The one and only Magazine devoted to Humor & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

పేజీలు : 68
వెల : రూ.10

1-15 డిసెంబరు 2001



సెంటర్‌స్ప్రెడ్‌లో
'పరవశం'
'లిటిల్ హార్ట్స్'
పాటల పుస్తకాలు

ఈ సంచికతో
బాపు బర్త్‌డే స్పెషల్
16 పేజీల కార్టూన్
అనుబంధం ఉచితం



# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా

'పరవశం', లిటిల్ హార్ట్స్

సినిమా పాటల పుస్తకాలు

'సెంటర్ స్ప్రెడ్'లో

2వ పేజీలో ఘంటసాల ఫొటో

67వ పేజీలో ఎల్లారీశ్వరి ఫొటోలు

'చండీరాణి' చిత్రంలో ఎన్.టి.ఆర్. భానుమతి

ఫొటోల కర్టెసీ: సంజయ్‌కిషోర్

పాఠకులకు ప్రత్యేక కానుక - 16 పేజీల కార్టూన్ల అనుబంధం

ముఖచిత్రం: పవన్‌కళ్యాణ్ కవర్ డిజైన్ :ఈరంకి




తెలుసుకోవాలంటే తెలియజేయాలంటే బోలెడు విషయాలున్నాయ్. కాగితం నింపాలంటే కూడా బోలెడు విషయాలుంటాయ్. చెప్పిందే చెప్పొచ్చు, రాసిందే రాయొచ్చు. అట్టమీద బొమ్మ, మహా అయితే ఇష్టమైన ఏదో ఓ శీర్షిక 'చూసి' 2 నిమిషాల్లో పత్రిక అవతల పడెయ్యొచ్చు.

విషయసూచికలో ఉన్న అన్ని శీర్షికలూ విషయమున్నవే ఉండాలంటే, నిర్వహించేవారికి సంస్కారం, సహనం ఉండాలి. చదివే వాళ్ళ మీద నమ్మకముండాలి. అప్పుడే హస్తభూషణంగా మాత్రమేగాక, మస్తకానికి పని పెడుతుంది పుస్తకం! 'చదవడం' కరువైపోతున్న రోజుల్లో పరువైన పుస్తకాలు, సరుకున్న పుస్తకాలు గగనమైపోతున్న రోజుల్లో 'హాసం' 'సంస్కారులైన' పాఠకులకు ఓ అపురూప వరం - తెలిసిన వాళ్ళకు్కూడా, "అరె ఈ విషయం నాకు తెలీదే" అనిపిస్తోంది. - బూతు బొమ్మ, రోత సాహిత్యం ఉంటేనే సర్క్యులేషన్ పెరుగుతుందని తమనితాము మోసం చేసుకుంటున్న సంపాదకులకి ఓ పాఠం - 'హాసం'!

Bravo Raja! God Bless -

**యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, చెన్నై.**

**'హాసం'**ని అందరూ మెచ్చుకుంటున్నారు. ఆనందంగా వుంది.

**-రావి కొండలరావు, విశాఖపట్నం.**

**మీ** సంగీత హాస్య పక్ష పత్రిక 'హాసం' వెలసి నన్నెంతో ఆనందింప జేసింది. పరిచయం చేసి పట్టుబట్టి నా చేత కొనిపించి, చదివించిన మిత్రుడు 'త్యాగరాజు'గారిని గుర్తు చేసుకుంటూ అంటాను యిలా:

భాషణ, భూషణాలు బహుపసందు
భరణి పరిచయాలు 'నాటి జ్ఞాపికల' విందు
ధరణి సంతసించు నేటి 'హాస'మందు
ధన్యంబీ 'హాస' సంచాలకుల జీవితాలని యందు

మిత్రుడు త్యాగరాజు 'దావా' వేస్తానన్నాడు, నేను 'హాసం' గురించి దండోరా వేయమంటున్నాను.

**-రావులపాటి వెంకటరామారావు, ఖమ్మం.**

**హా**స్యం'లో 'హా'ను, 'సంగీతం'లో 'సం'ను తీసుకొని హాస్య-సంగీత పత్రికగా "హాసం"ను వెలువరిస్తున్నందుకు, ప్రతి సంచికా దరహాస చంద్రికలను, సంగీత తరంగాలను వెలయిస్తున్నందుకు మీకు అభినందన మందారాలను అందజేస్తున్నాను.

"భారతి"... 'జ్యోతి'... తర్వాత 'రచన' పత్రికల సరసన "హాసం" సముచిత పీఠాన్ని అధిరోహించ గలదు. సందేహం లేదు. కొన్న పుటలు పొట్టలు చెక్కలయ్యే నవ్వుల్ని పూయిస్తున్నాయి. సినీ ప్రముఖుల ప్రత్యేక కథలు ఆలోచనల్ని రేకెత్తిసున్నాయి. ఈ కృషి నిరంతరాయంగా సాగాలని కోరుకుంటూ..... మీ

**-కెఎస్ఆర్ నమ్మి పెనుగొండ.**

**మొ**దటి రెండు సంచికలు చూశాక కట్టిన చందా గిట్టుబాటవుతోందని అనిపించింది.

కాని, మీ సంచికలు దాచుకోవడం కోసం ఒక 'బుక్ షెల్ఫ్'కి డబ్బులు ఖర్చు చేయాల్సి వచ్చేట్టుంది.

ఎందుకంటే మీరు ఇస్తున్న ఇన్ఫర్మేషన్ చాలా విలువ కలదిగా వది కాలాల పాటు దాచుకోవాల్సిందిగా ఉంది. ఈ వివరాలు సామాన్యంగా దొరికేవి కావు.

**-మోతే యస్.నాగేశ్వరరావు**
**పశ్చిమ వీధి, ఏలూరు - 534 001.**

ప్రారంభ సంచిక నుంచి 'హాసం' హస్యాన్ని చవిచూస్తూ 'హాసం' సంగీతాన్ని ఆస్వాదిస్తూ... వెరసి 'హాసం'... హాస్య-సంగీత పత్రికను అభిమానిస్తున్నాం. జీవితాంతం భద్రపరుచుకుని మనస్సుకు సేద తీరాలనుకున్న ప్రతిసారీ చదువుకోగల అర్హతగల అతికొద్ది ప్రతులలో... పత్రికలలో 'హాసం'దే అగ్రతాంబూలం. ఆరోగ్యమే మహాభాగ్యం. ఆరోగ్యం ఉన్నవాళ్ళు... అంటే... 'హాసం' ఆచంద్రతారార్కం మాకాప్త మిత్రమై ఉంటుంది. 'హాసం' నభూతో... అన్న రీతిలో వెలుగొందుతుందని మాకనిపిస్తోంది.

**- నేమాన సుభాష్ చంద్రబోస్,**
**(ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం-1)**

**మీ** 'హాసం' పత్రిక మొదటి సంచిక నుండీ మిస్ అవకుండా చదువుతున్న అభిమాన పాఠకురాలిని. మొదటి సంచిక నుండి చూస్తున్న నేను ఈ పత్రిక చూస్తూనే ఇంప్రెస్ అయ్యాను. అందుకు మరొక కారణం రచన మాసపత్రికలో 'హాసం' పత్రిక గురించి ప్రకటన రావడం కూడా, ఈ రోజుల్లో ఎటు చూసినా టెన్షన్ కలుగ చేసే సంఘటనలతో కూడిన కథలు, సీరియల్స్, సినిమాలు తప్ప మనసుకు హాయిని కలిగించేవి ఉండటంలేదు. నిత్య జీవితంలో బాధ్యతలు, బరువులు సమస్యలనుండి కాసేపు బయటపడి రిలాక్స్ అవుదామంటే పుస్తకాల్లోను, రేడియోల్లోను, టీవీల్లోను ఎటుచూసినా అవే సమస్యలు నిండివుంటున్నాయి. పైగా యువతరానికి అవే నచ్చుతున్నాయి. సాధ్యమైతే అనుకరించడానికి కూడా ప్రయత్నిస్తున్నారు. టీవీల్లో చూసిన సమస్యల్లాంటివి నిజ జీవితంలో కూడా తెచ్చిపెట్టుకుంటూ ఒక విధమైన వెర్రిలో ఉంటున్నారు. నాలాంటి పెద్ద వయసు వాళ్ళు కాస్త సరదాగా కాలక్షేపం చేద్దామంటే కుదరడం లేదు. పిక్నిక్స్, టూర్స్ షికార్లు వగైరాలతో ఎంజాయ్ చేయటానికి ఓపిక, ఆర్థిక స్తోమత ఉండాలి కదండి. ఇటువంటి సమయంలో ఈ 'హాసం' పత్రిక రావడం నాకు చాలా ఆనందం కలిగించింది. ఈ పత్రికలో నాకిష్టమైన పాత సినిమాల గురించి చదువుతుంటే మళ్ళీ చిన్నతనంలోకి వెళ్ళిపోయినంత హాయిగా ఉంది.

పిల్లలందరి చదువులు, పెళ్ళిళ్ళు, బాధ్యతలు అన్నీ తీరిపోయి, రిటైరయిపోయి హాయిగా ఏ సమస్యలూ లేని నాలాంటి వారు టీవీ సీరియల్స్ సమస్యలు చికాకులతో ఎందుకు బుర్ర పాడు చేసుకుని టెన్షన్ తెచ్చుకోవాలి? టెన్షన్ తెచ్చుకోడం ఎందుకంటారా సహజంగా... ఆ మాటకొస్తే సహజం కంటే ఎక్కువగా మన నట్టింట్లోనే జరుగుతున్నంతగా ఫీలింగ్ వచ్చేటట్లు ఉంటుంటే టెన్షన్ వచ్చి బి.పి. పెరక్కుండా ఎట్లా ఉంటుంది!

ఇట్లాంటి బాధలనుండి 'హాసం' పత్రిక విముక్తి కలిగిస్తోంది. ఈ పత్రిక వార పత్రికగా వస్తే ఇంకా బాగుంటుంది. ఇందులో ప్రతీ శీర్షిక, ప్రతీ పేజీ నాకు ఎంతో నచ్చాయి. నాకు యిష్టమైన కళాకారుల గురించి ఆరోజుల్లో జరిగిన సన్నివేశాల గురించి చదువుతుంటే ఆ సంతోషం చెప్పలేను. రావు బాలసరస్వతి, వాణీ జయరాం వంటి అమృత కంఠాల గురించి, దేవదాసు లాంటి రత్నాలలాంటి చిత్రాల గురించి, అప్పటి చిన్న సంఘటనలతోబాటు కళ్ళముందు ఉంచి, నన్ను నా చిన్నతనంలోకి తీసుకువెళ్ళిన మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను.

'హాసం' పత్రిక గురించి ఇట్లా రాస్తుంటే ఇంక ఆపడమంటూ ఉండదు. మరి నేను భోజనం చేసి 'హాసం' (టానిక్) తీసుకుని రిలాక్స్ అవ్వాలి కదా నెక్స్ట్ ఇష్యూ కోసం ఎదురు చూస్తూ ఉంటాను. అంతా ఒకేసారి చదివేస్తే అయిపోతుందని మెల్లమెల్లగా చదువుతుంటే అట్లా కుదరటంలేదు. మీకు, మీ 'హాసం' పత్రికకు మరొక సారి మనసారా అభినందనలు తెలుపుతూ...

**వల్లూరి సావిత్రీదేవి,**
ఇ.సి.ఐ.ఎల్.క్రాస్‌రోడ్స్, హైద్రాబాద్.

**జూ**క్ బాక్స్‌లో సినిమా పాటలు మాత్రమే అడగాలా? సదాశివబ్రహ్మేంద్ర కీర్తనల వంటివాటిలో సంస్కృతం అర్థం కాక బాధపడుతూంటాము. తప్పు పాడుతున్నామేమో నన్న భయం కూడా వేస్తూ ఉంటుంది. సరైన వచనం ఇచ్చి వాటిలోని పదాలకు అర్థాలు వివరించగలరా?

**- పి.బాలాత్రిపుర సుందరి,** రాజమండ్రి.

**తప్పకుండా...! సమయం వచ్చినప్పుడు మంచి పనులు చేసే అవకాశాన్ని ఒదులుకోం** **-ఎడిటర్**

సంపుటి :1 సంచిక: 5

1-15 డిసెంబరు 2001

పేజీలు : 68 వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 5

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

సంగీతాన్ని ఆస్వాదించడం చెవివల్ల జరిగేదే అన్న విషయంలో రెండు అభిప్రాయాలకు తావులేదు. మరి సంగీతం గురించి వ్రాస్తే ఏం ఆనందం కలుగుతుందని అడిగేవారు లేకపోలేదు. సాహిత్యం కానీ కవిత్వం కానీ వాటి మౌలిక రూపాలలో ఆనందాన్నిస్తాయని తెలిసినా వాటికి వ్యాఖ్యానాలు అవసరం పడుతున్నాయన్న విషయం గుర్తుకు తెచ్చుకున్నప్పుడు ఈ సందేహం రానవసరం లేదు. కాళిదాసు కవిత్వం, షేక్స్‌పియర్ నాటకాలు వాఖ్యాతల పుణ్యమాని మరింత ప్రాచుర్యానికి నోచుకున్నాయని అనవచ్చు. అలాగే మన పురాణ గ్రంథాలలోని విజ్ఞాన సర్వస్వం ఎక్కువగా భాష్యకారుల వలన సామాన్య జనానికి మరింత చేరువ కావటాన్ని మనం గమనించవచ్చు.

పాఠకులు గానీ, శ్రోతలు గానీ ఒకే స్థాయికి చెందిన వారు కావడం లోక విరుద్ధం. స్థాయి కలిగున్నా వారి చూపు కవి ఉద్దేశించిన అంశాలపై పడకపోవచ్చు. వాటి స్వారస్యం గ్రహించడంలో, బోధపరచుకోవడంలో, ఆస్వాదించడంలో గ్యాప్ రావచ్చు. కవి నేపథ్యం తెలియక, కథ నేపథ్యం తెలియక వాటి అందాలను పూర్తి స్థాయిలో అందుకోలేకపోవచ్చు. ఇలాటి పరిస్థితుల్లో వ్యాఖ్యాత విశ్లేషకుడు, భాష్యకారుడు అవసరం అవుతారు.

తెలుగు సినీసంగీతానికి సంబంధించిన విశ్లేషకులతో ప్రథమంగా ఎన్నదగిన వారు శ్రీ వి.ఎ.కె. రంగారావు. 'సరాగమాల' అనే శీర్షిక ప్రారంభించి ఆయన సినీ సంగీతాన్ని ఎలా ఎంజాయ్ చేయాలో పాఠలకులకు నేర్పారు. సినీ సంగీతం మాత్రమే కాదు, అన్ని రకాల సంగీతాలను కూడా ఆయన పరామర్శించారు. వాటిపై పాఠకశ్రోతల అవగాహనను మరింత పెంచారు. శ్రీ రంగారావు వ్రాసిన ఒక వ్యాసాన్ని లోపలి పేజీలలో చూడవచ్చు. తను నడిపిన ఆయా శీర్షికలను ఎంత బహుళార్థకంగా తీర్చిదిద్దారో ఆయన తన వ్యాసంలో వివరించారు.

ఒక పక్క పాఠక శ్రోతలకు మంచిపాటల గురించి సమాచారం అందిస్తూ, మరొక చెంప రికార్డు కంపెనీలకు తమ బాధ్యతను గుర్తుచేస్తూ, పొరబాట్లు చేసేవారిని ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూ, చలన చిత్ర సంగీత సీమకే కాక, అనేక రకాల కళాకారుల కృషిని హైలెట్‌చేస్తూ ఎన్నోవిధాలుగా సహాయపడడానికి ఆయనకా శీర్షిక ఎంతో ఉపయోగపడింది. ఒక పత్రికలో నడిపే ఒక శీర్షిక ద్వారా ఆయన అంత కృషి చేయగలిగినప్పుడు, సంస్థ పరంగా సగం పేజీలు సంగీతానికి అంకితం చేసిన పత్రికగా "హాసం" సంగీతాభివృద్ధి కార్యకలాపాలను మరింత హెచ్చుస్థాయిలో చేసే అవకాశం ఉందనిపిస్తుంది.

సినిమా గీతాలను విశ్లేషిస్తూ, వాటి గుణగణాలను ఎత్తి చూపుతూ, మంచి ఉన్న చోట దాని గురించి పదిమందికి చెబుతూ, దానికి కారణభూతులైన వారిని అభినందిస్తూ వేర్వేరు రూపాల్లో అనేక శీర్షికలు నడుపుతున్న "హాసం" కృషిని, శ్రమ గమనిస్తున్న వారికి ఆ అవకాశాన్ని మేం సద్వినియోగం చేసుకుంటున్నామనే నమ్మకం కలుగుతోంది. వారి నమ్మకాన్ని వమ్ముకానీయకుండా పత్రికను మరింత అర్థవంతంగా నడపడమే మా బాధ్యతగా భావిస్తున్నాం.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# కామెడీ రైటర్ ట్రాజెడీ

'మన్మధసామ్రాజ్యం'సినిమాతో రచయితగా పరిశ్రమలో కాలుపెట్టి 'నవ భారతం' ద్వారా వెలుగులో కొచ్చిన మరుధూరి రాజా అటు కామెడీని ఇటు ట్రాజెడీని ఏకకాలంలో పండిస్తూ ఇప్పటి వరకు 65 సినిమాలను పూర్తి చేశారు.

ఆలీబాబా అరడజను దొంగలు,
శుభా కాంక్షలు, సిసింద్రి, ఎగిరే పావురమా,
సూర్యవంశం, నువ్వు వస్తావని, 6 టీన్స్,
ఆరోప్రాణం, అమ్మాయి కోసం, వీడెక్కడి
మొగుడండీ చిత్రాలు ఆయన 'హిట్‌లిస్ట్'లో
ఉన్నాయి.



'హాసం' వారు కామెడీ కథ రాయమన్ని అడిగారు 'సరే' అన్నాను...కానీ రాసే దాకా వెంటాడి వేధించారు... కోపం వచ్చి కామెడీ కథని కొంచెం సీరియస్‌గా రాశాను. నేను మొట్టమొదటి సారి... రాసిన కథయిది. మొట్టమొదట నాచేత కథని రాయించి నన్నో కథా రచయితని చేసిన 'హాసం' వారికి... సీరియస్‌గా థాంక్స్

-మరుధూరి రాజా

ఈ కథపై పాఠకులు తమ అభిప్రాయాన్ని
మరుధూరి రాజా
ఫ్లాట్ నం. 2, ఫేజ్ - III
కమలాపురికాలనీ, పంజాగుట్ట
హైద్రాబాద్. 500 073
అడ్రసుకి నేరుగా పంపవచ్చు.

మరుధూరి రాజా మెచ్చిన ఉత్తరాన్ని పంపినవారికి 'హాసం' పత్రికను 6 నెలలపాటు ఉచితంగా పంపుతాము.

**రాత్రి దాదాపు తొమ్మిది గంటలకు అటు యిటుగా... ఎత్తయిన రోడ్డుమీదనుండి డౌన్‌లోకి వేగంగా వస్తున్న స్కూటర్... గతుకుల రోడ్డు మీద పరిగెత్తలేక తలకిందులుగా దొర్లింది. ఆ చీకటి నిశ్శబ్దంలో... విమానం నేలను గుద్దిన శబ్దం.. అటే వస్తున్ననేనూ... అసిస్టెంట్ సుబ్బారావు షాకైనాం... స్కూటర్ ఎక్కడ పడిందో తెలీదుగాని... స్కూటర్ మీద మనిషి గాలిలోకి ఎగిరి నేలకు గుద్దుకోవటం చీకట్లో స్పష్టంగా కనిపించింది.**

ప్రశాంతంగా ఉండే శ్రీనగర్ కాలనీ పార్కుదగ్గర ఓ యాక్సిడెంట్ చాలా ప్రశాంతంగా జరిగిందని... సుబ్బారావ్‌కు... నాకు తప్ప ఎవరికి తెలీదు...

ముందుకు కదులుతున్న నా ఆవేశాన్ని... అనుభవాలు వెనక్కిలాగుతున్నాయి... "సార్... వెళ్ళి చూద్దామా" అని బాధగా కదలబోతున్న సుబ్బారావ్‌తో "వద్దు కాసేపాగు..." అన్నాను బాధని బ్యాలన్స్ చేస్తూ...

యింతలో ఓ కారువస్తూ... హెడ్‌లైట్ వెలుతురులో స్కూటర్‌ను పక్కనే పడివున్న వ్యక్తిని దూరం నుండే చూసి స్లో అయి... పరిస్థితి చూసి... మళ్ళీ స్పీడందుకొని వెళ్ళిపోయింది.

ఆ వెంటనే అలాగే మరోకారు... ఓ బైకు... ఓ జీప్... ప్రమాదస్థలాన్ని పరామర్శిస్తున్నట్టు చూస్తూ దాటి వెళ్ళిపోయాయి... "చూశావా సుబ్బారావ్... మానవత్వం మరీ ఎంత రాక్షసంగా ఉందో...!? ఎవడైనా ఆగాడా... మనిషి బతికున్నాడో లేదో చూశాడా...!?"

"నిజమే సార్... మరి మీ మానవత్వం ఏమై పోయింది...?"

"దాచిపెట్టాను...! దాన్ని బైటకు తీస్తే... నాకు మనశ్శాంతి ఉండదు." అంటూ నన్నే నేరస్థుడిగా చూసే నా అసిస్టెంట్‌కి పాతికేళ్ళ క్రితం తగిలిన పాత గాయాన్ని గురిపెట్టాను.

ఒంగోలు 'శర్మకాలేజి'లో ఫైనలియర్ చదివే రోజులవి... అప్పటికి హృదయం యింకా చెడిపోలేదు... మనసు మలినం కాలేదు... కళ్ళలో ప్రేమ కసిగా మారలేదు... సాయంత్రం ఆరు గంటలవుతోంది. ఉద్యోగస్తులు టీ కొట్ల దగ్గరికి చేరే సమయం... నేనూ నా స్నేహితుడు గౌస్... రిక్షాలో సినిమాకి వెళుతుండగా... ట్రంక్‌రోడ్ సెంటర్‌లో చర్చికి ఎదురుగా -వరల్డ్ ట్రేడ్ సెంటర్‌ని తాలిబన్ టెర్రరిస్ట్‌లు గుద్దిన విమానంలాగా- ఓ బైక్ వేగంగా వచ్చి ఓ రిక్షాని గుద్దేసింది... అదృష్టవశాత్తు... రిక్షాలో ఎవరూ లేరు. దురదృష్టవశాత్తు రిక్షావాడు... కటువైనగాయాలతో... స్పృహ తప్పాడు. కణతలు, మోచేతులు, మోకాళ్ళమీద ఎవడో టెర్రరిస్ట్ చేసిన సంతకాల్లా రక్తపు చారలు... కనిపిస్తున్నాయి... మరో వైపు బైకు నడిపే 20 ఏళ్ళ కుర్రాడు... వెనకే కూర్చున్న మరో కుర్రాడు... రోడ్డుమీదనే బైకును వదిలి పారిపోయారు...

రిక్షా డొక్కయిపోయింది... చుట్టూ జనం చేరారు... ఈ యాక్సిడెంట్ మనకే జరిగితే ఏమయ్యేది అని... రిక్షావాడిలో తమని ఊహించుకొని వణికి పోతూ ఓవైపు... మనకి కాలేదు కదా అన్న ఆనందంతో మరో వైపు... చూస్తున్నారే గాని... ఎవరూ వాణ్ణి కాపాడే పొజిషన్లో లేరు... చర్చి మీదనుండి చూస్తున్న 'జీసెస్' కూడా... మనుషులు కొట్టిన మేకుల్ని వదిలించుకొని రాలేక... నిస్సహాయ ప్రేమతో చూస్తున్నాడు... ఒక్కసారి రక్తంలో... ఆవేదన... ఆవేశం...

"రేయ్ గౌస్... మనం యితన్ని హాస్పిటల్‌కి తీసుకెళ్దాం..."

"బావా సినిమాకు టైం అయిపోతుంది!"

"సినిమా కాదురా... ఆలస్యం చేస్తే యితని టైమైపోవచ్చు... అతన్ని ప్రమాదంలో వదిలేసి వెళ్ళటం మానవత్వం అనిపించుకోదు..." అంటున్న నా బాధని వెంటనే వాడు అర్థం చేసుకున్నాడు...

"సరే నీ యిష్టం...నువ్వు యితన్ని రిక్షాలో

గవర్నమెంట్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళు... నేను ఈ బైకు సంగతి చూస్తాను... రాస్కెల్స్... యింత యాక్సిడెంట్ చేసినవాళ్ళు ఎక్కడ దాక్కున్నా మనదగ్గరికి రావాలి...!" అనుకుంటూ బైక్‌ని దగ్గరలో తెలిసిన వాళ్ళ యింట్లో పెట్టటానికి నడిపించుకుంటూ బయల్దేరాడు గౌస్...

డామేజి అయిన రిక్షాని... రోడ్డు పక్కన జాగర్త చేసి... మరో రిక్షాలో రిక్షా వాడిని ఎక్కించి... అతని తల నా వొళ్ళో పెట్టుకొని మధ్యమధ్యలో అతని తలను నిమురుతూ దైవధ్యానం చేస్తూ... హాస్పిటల్‌కు చేరాను.... రిక్షావాణ్ణి బెంచిమీద పడుకోబెట్టి చుట్టూ చూస్తే గవర్నమెంట్ హాస్పిటల్లో ఒకరిద్దరు నర్సులు తప్ప ఎవరూ కనిపించలేదు... ఓ నర్సుని పిలిచి ఆందోళనగా అంతా వివరంగా చెప్పి డాక్టరుగారు కావాలని అడిగాను...



"ఈ రోజు సండే కదా... జస్ట్ రిలీఫ్ కోసం యింటి కెళ్ళారు... కబురు చేస్తాను'' అని క్యాజువల్‌గా వెళ్ళిపోయింది నర్స్...

యింతలో గౌస్‌కూడా అక్కడికి చేరుకున్నాడు... తర్వాత వ్యవహారం ఎలా నడిపించాలి...! రిక్షావాడికి ఎలా న్యాయం చెయ్యాలి... అని ఇద్దరం మహాత్మాగాంధి, నెహ్రూ లెవెల్లో ఫీలవుతూ చర్చలు మొదలు పెట్టాం. యింతలో చక్కటి మందు వాసన... దాని వెనకే డాక్టర్... వచ్చారు. పేషంట్‌ని చూసి... 'వెంటనే పోలీస్ రిపోర్ట్ యివ్వండి... కేస్ ఫైల్ చెయ్యకుండా మేం ట్రీట్‌మెంట్ చెయ్యకూడదు...'' అన్నాడు బద్ధకంగా...

"సార్... కేస్ పెడితే రిక్షావాడికి న్యాయం జరగదు... యాక్సిడెంట్ చేసిన బైక్‌ని మేం దాచేశాం... రిక్షావాడికి నష్టపరిహారం ఇచ్చేదాక బైక్‌ను మేం వదలం... దయచేసి అతనికి... ట్రీట్‌మెంట్ యివ్వండి... అన్నాను... హృదయంతోపాటు ... చెమటతో శరీరం ద్రవిస్తుండగా...

"మీ వాలకం చూస్తుంటే యాక్సిడెంట్ చేసింది మీరో... మీక్కావలసిన వాళ్ళో అనిపిస్తుంది. లేకపోతే... కేసు... ఎందుకు పెట్టరు...!?" అన్నాడు డాక్టర్...

మా నిజాయితి మీద నిప్పుపడింది...!

"రిక్షావాడికి ట్రీట్‌మెంట్ యివ్వడానికి అభ్యంతరం లేదు... కాని మాకూ కొన్ని ప్రాబ్లమ్స్ ఉంటాయి...'' అంటూ... మా జేబులవైపు చూశాడు... సినిమాకు వెళ్ళటానికి తెచ్చుకున్న '60'రూపాయలు అతనికి కనిపించాక... కొంచెం చిరాకు కూడా పడ్డాడు.

వెంటనే పోలీస్టేషన్‌కు... వేగంగా నడుస్తూ... పరిగెత్తుకుంటూ వెళ్ళి చేరాం... స్టేషన్లో యిద్దరు పోలీసుల్ని చూస్తే... పోలీస్టేషన్‌కి భద్రత లేదేమో అని భయమేసింది. వాళ్ళూ పాత పాటే పాడారు... "బైక్ ఎవరిది... మీరెవరు... బైక్ ఓనర్‌కు మీకు కనెక్షన్ ఏంటి...?'' అనేశాడో కానిస్టేబుల్...

మా శీలం... మళ్ళీ సిగ్గుపడింది...

"స్టూడెంట్స్ అంటున్నారు... చదువు మానేసి సమాజసేవ చెయ్యమని ఎవడయ్యా మీకు చెప్పింది!''... ఇదేదో కేస్ రివర్స్ అయ్యేట్టట్టుందని కంగారుపడ్డాం...చివరికి చెరో ఇరవైరూపాయలు ఇచ్చి వాళ్ళ కర్తవ్యం గుర్తు చేశాం... బైక్ ఓనర్‌తో రాజీ కుదిరి రిక్షావాడికి న్యాయం జరిగేట్టయితే... కేస్ విత్‌డ్రా చెయ్యటానికి వీలుగా పోలీసులు సహృదయంతో మాకు సహకరించారు... కేస్

ే ఎ ఎ ం

మీదకెక్కింది... పేషంట్ బెడ్‌మీదకు చేరాడు... ఆ తర్వాత మొదలైంది అసలు ట్రీట్‌మెంట్...!

...............

"నా బైక్‌ని హేండోవర్ చేసుకోటానికి మీరెవరయ్యా..."

సినిమా హాలుదగ్గర కలప దుకాణం ఓనర్... టేకు మానుల మధ్య వైర్లతో అల్లిన కుర్చీలో కూర్చుని... పెద్దగా అరిచాడు... చుట్టూ వేసిన వైర్ కుర్చీలలో నలుగురు అతని తాలూకు




మగవాడి నుండి బాచిలర్స్ డిగ్రీని తీసేసుకుని, ఆడదానికి మాస్టర్స్ డిగ్రీ ఇచ్చేది



అనుచరులు... ఎదురుగా వేసిన బెంచీమీద... నేనూ గౌసూ...

ఉదయం బైక్ ఎవరిదో అని ఎంక్వయరీ చెయ్యకుండానే కబురుచేసి మమ్మల్ని పిలిపించాడు అతను. ప్రత్యర్థిని భయపెట్టడానికి కరాటే ఫైటర్‌లా ఆయన అరిచిన... అరుపుకి... గౌస్‌గాడు గాభరాపడ్డా... నేను చలించలేదు... అప్పటికే యిలాంటి క్యారెక్టర్లు నేను రాసిన నాటకాల్లో వున్నాయి... అదే నా ధైర్యం...!

ఆ కలప దుకాణం ఓనర్ పేరు ఏదో ఉంది... ప్రస్తుతానికి ఓనర్ అనే నాకు గుర్తుంది... ఆ ఓనర్ యింకా అరుస్తూనే ఉన్నాడు...

"నా మేనల్లుడు, వాడి ఫ్రెండ్ నాకు తెలీకుండా బైకు తీసుకెళ్ళి యాక్సిడెంట్ చేశారు... అందుకని నా బైక్‌ని దాచిపెడతారా..." అన్నాడు బెదిరింపుగా...

"సార్... మీ బైక్ మీకు అప్పగించటానికి మాకు అభ్యంతరం లేదు... రిక్షావాడు మంచంమీద వున్నాడు... వాడి ఆరోగ్యం బాగుపడ్డానికి నెలరోజులు పడుతుంది... అప్పటిదాక వాడి ఫ్యామిలి నడపటానికి ఐదొందలైనా అవుతుంది. వాడి రిక్షా డామేజి అయింది... దాన్ని బాగు చెయ్యటానికి... మందులకి 1000 అవుతుంది... మీరు పదిహేను వందలు యిచ్చేస్తే... బైకు మీకు గౌరవంగా తెచ్చిస్తాం..." అన్నాను బ్యాలెన్స్ తప్పకుండా...

ఒక్కసారి ఓనర్‌లో ఆవేశం పెరిగింది... యాక్సిడెంట్ చేసిన మేనల్లుడిని బైటకు పిలవమని ఎవరితోనో చెప్పాడు... మేనల్లుడు భయం నటిస్తూ బయటకు రాగానే... రాయటానికి అసభ్యంగా ఉండే ఓ తిట్టు తిట్టి... "నీవల్ల... బచ్చా వెధవలు కూడా నన్ను నిలదీస్తున్నారు..." అని గడ్డం అదిరేటట్టు ఫెడీల్... ఫెడీల్‌మని నాలుగ్గుద్దులు గుద్దాడు... నామాట వినకపోతే మీకు ఇదే గతి అన్నట్టు చూస్తూ... "మర్యాదగా చెప్తున్నాను... వెంటనే వెళ్ళి బైకు తీసుకురాకపోతే... సెంటర్‌లో మిమ్మల్ని కట్టేస్తాను..." అని అరిచాడు...

వెంటనే... అతని చుట్టూవున్న నలుగురు మనుషులు పైకిలేచి నిల బడ్డారు. బెదిరింపుగా వాళ్ళలో ఒకడు... బేస్ వాయిస్‌తో 'పదండి బైక్ తెద్దాం' అని అభిమానంగా నా భుజం మీద చెయ్యివేసి... కసిగా. ఓ నలుపు నలిపాడు... పరిస్థితి గౌస్‌కి నాకు అర్థమైంది... వెంటనే నేను స్టేట్‌మెంట్ మార్చాను... "సార్ మీరు దీని గురించి ఫీలై ఆ కుర్రాణ్ని కొట్టద్దు... అయినా అతను యాక్సిడెంట్ చేస్తే మీరేం చేస్తారు..." అనగానే అతను కొంచెం రిలీఫ్ ఫీలయ్యాడు... వెంటనే... "మీ బైకు మీకు తెచ్చిస్తాం... కాకపోతే మాతోపాటు... యిద్దరు ఫ్రెండ్స్‌కూడా ఈ వ్యవహారంలో వున్నారు... వాళ్ళు కాలేజికి వెళ్ళిపోయి వుంటారు... వాళ్ళతో కూడా ఓ మాట చెప్పి మీ బైకు మీకు చేర్చేస్తాం..." అనగానే... ఈ సారికి క్షమించి టైమ్ ఇస్తున్నట్టుగా మమ్మల్ని వదిలేశాడు... మేం భయపడి వుంటామని వాడి అనుమానం.

.............

వాడి అనుమానంలో నిజంలేదని సాయంత్రం ఆరుగంటలకు పశ్చాత్తాపపడ్డాడు... సుమారు... ముప్పైమంది స్టూడెంట్స్ మా క్రిష్టఫర్... ఆధ్వర్యంలో కలప దుకాణంలోకి దిగిపోయారు... క్రిష్టఫర్ అంటే రౌడి కాదు... అతని ధైర్యం చూసి... అపోజిషన్ వాళ్ళు పెట్టిన పేరది... ఓనర్ ఈ జనాభాని చూసి కంగారు పడ్డాడు... భయపడ్డాడు... క్రిష్టఫర్ డిగ్నిఫైడ్‌గా వార్నింగ్ యిస్తున్నాడు...

మీకు బలముంటే కలప దుకాణంలో వుంటుంది...
ఎక్కడ పడితే అక్కడ ఉంటుం దను కోవద్దు...
మాకు కాలేజిలోనే బలం ఉంటుందనుకోవద్దు...
ఎక్కడ పడితే అక్కడ ఉంటుంది...
మేం కలప దుకాణం పెట్టగలం కాని...
మీరు కాలేజిలో చేరలేరు...
రేపు మిమ్మల్ని పొడవటానికి రెడీ అయ్యే...
ఈ రోజు తన్నులు తినటానికైనా మీ దగ్గరికొస్తాం...!

అర్థమై ఉంటుందనుకుంటా...

అంటూ వేమన పద్యాన్ని చాణక్యుడి గొంతుతో వినిపించాడు... అరగంటలో పదిహేను వందలు వసూలు అయినాయి.

వచ్చేప్పుడు కలప దుకాణం ఓనర్‌కి జరిగిన నష్టానికి బాధపడ్డవాళ్ళలో మొదటి వాడ్నినేనే... కాని తప్పదు కదా... మా బ్యాచ్ మొత్తం... హాస్పిటల్ దగ్గరికి వచ్చే సరికి రాత్రి తొమ్మిది గంటలు దాటింది... అప్పటికే రిక్షావాణ్ణి డిశ్చార్జి చేశారని తెలిసి కంగారుపడి అడ్రస్ పట్టుకున్నాను. క్రిష్టఫర్... వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ... "తమ్ముడూ యిలాంటి కేసులు డీల్ చెయ్యటానికి నీకు అనుభవం లేదు... యికముందైనా జాగర్తగా ఉండు..." అంటూ వెళ్ళి పోయాడు... రిక్షావాడి కివ్వాల్సిన నష్టపరిహారం... మరుసటి రోజు ఉదయం యిచ్చెయ్యాలని గౌస్ నేను నిర్ణయించుకున్నాం...

మరునాడు ఉదయం రిక్షావాడియింటికి చేరుకున్నాం... రేకులతో నాలుగు గోడలని కప్పిన ఆ చిన్న ఇంట్లో యింకా చిన్న నులక మంచంలో కూర్చుని... సత్తుకంచంలో మజ్జిగ అన్నం తింటున్న రిక్షావాణ్ణి చూసేసరికి... మాకు బాధేసింది...

మేం చేసిన సహాయానికి మాలో గర్వం పొంగకూడదని తలవంచుకొని పదిహేను వందలు రిక్షావాడి ముందుపెట్టి "ఇదిగో నయ్యా నీకు జరిగిన నష్టానికి పరిహారం.. పదిహేను వందలు వసూలు చేశాం తీసుకో..." అన్నాం తృప్తిగా...

అతను ఒక్కసారి ఆవేశంగా... "పదిహేను వందలా" అన్నాడు... వాడి అరుపులో అనుమానం మా నిర్మలమైన గుండెలకు గునపంలా తగిలింది.

"ఎవడయ్యా మిమ్మల్ని పదిహేను వందలు అడగమంది. నేను కనీసం మూడువేలు ముక్కుపిండి వసూలు చేద్దామనుకున్నాను. ఈ పదిహేను వందలు దేనికి సరిపోతుంది?. అసలు మొత్తం... వాళ్ళని ఎంత అడిగారు...?" అన్నాడు.

"పదిహేను వందలడిగాం... పదిహేను వందలు వసూలు చేశాం..." అన్నాడు గౌస్...

అప్పటికే రిక్షావాడి బంధువులు ఒకరిద్దరు ముసలి ఆడవాళ్ళు, మధ్య వయసు మగవాళ్ళు చేరిపోయారు... వాళ్ళ మాటల్లో కూడా ఎక్కువ వసూలు చేసి... తక్కువ యిస్తున్నాం... అనే భావన కనిపిస్తోంది... "ఏ లాభం లేకుండా ఎందుకు సాయం చేస్తారు" అని వెనుకనుండి ఓ మహాతల్లి అనేసింది...

ఆ క్షణంలో మేం శ్రీరాముడి మీద... మహాత్ముడి మీద... మదర్ థెరిస్సా మీద ప్రమాణం చేసినా నమ్మకూడదని వాళ్ళు నిర్ణయించు కున్నట్టుంది... చేసేదిలేక చేసిన పనికి తలవంచుకొని బైటకి నడిచాం. మా కళ్ళలో ఎవరికి కనిపించని



కన్నీటి చుక్కలు... జీసెస్ పాదాల నుండి రాలుతున్న రక్తపు చుక్కల్లా మెరుస్తూ మాకు మాత్రమే కనిపిస్తున్నాయి...

.................

మాకు జరిగిన అనుభవం విన్న సుబ్బారావ్ బ్రెయిన్‌కు షాకైంది. "చూశావ్‌గా సుబ్బారావ్ యిప్పుడా స్కూటర్ మీద నుండి పడిపోయిన వాడ్ని కాపాడుతాం...! ముందు వాడి స్కూటర్‌ను కూడా సేఫ్‌గా ఓ చోట ఉంచాలి.

వీడిని హాస్పిటల్‌కి చేర్చి అయిన వాళ్ళందరికి కబురు చేసే సరికి కనీసం రెండు మూడువేలు ఖర్చు అవుతుంది... పోనీ ఆ ఖర్చు పెడతాం! కానీ... తర్వాత... రేపు యాక్సిడెంట్ టైమ్‌లో మీరక్కడ ఎందుకున్నారని పోలీసులు అడుగుతారు... సమాధానం చెప్తాం... 'మా అబ్బాయి మెళ్ళో గోల్డు చైన్ ఉండాలి, జేబులో పాతిక వేలుండాలి...' అని వాళ్ళ వాళ్ళు అంటారు... అదికూడా మనమే సర్దుబాటు చెయ్యాలిగా..." అన్నాను

"అలా ఎందుకు అడుగుతారు సార్..."

"మన టైమ్ బాగులేకపోతే అడుగుతారు... అసలే సినిమా రైటర్ని...! అలాంటప్పుడు తప్పకుండా అడగొచ్చు సినిమా వాళ్ళ డబ్బులంటే... పావురాయి రక్తం తాగినంత కూల్‌గా... టేస్ట్‌గా ఫీలయ్యేవాళ్ళు చాలామంది వున్నారు...!

అంతే కాదు సుబ్బారావ్... నా మనసుని గాయం చేసింది... ఆ రిక్షావాడొక్కడే కాదు... వేరే వేరే పొజిషన్‌లో... వేరే వేరే గెటప్‌ల్లో... వేరే వేరే రిక్షావాళ్ళు చాలామంది వున్నారు...! మంచి వాడనిపించుకోటానికి ఎంతో పోగొట్టుకోవాలి... జాలిగల వాడనిపించుకోటానికి హృదయాన్నే వదులుకోవాలి... ఎదుటి వాడి మోసాన్ని భరిస్తూ బుద్ధుడిలా నవ్వగలిగితేనే మన మంచితనం నిలబడుతుంది" అంటూ... చీకట్లో నడుస్తున్నాను...

సుబ్బారావ్ ఏమనుకున్నాడో నీకు తెలీదు కానీ... జాలి పడ్డాడని అతని ఊపిరి శబ్దాన్ని బట్టి తెలుస్తోంది...

"భగవాన్... సాటి మనిషిని ఆదుకోలేని... నిస్సహాయుడిగా... దుర్మార్గుడిగా నన్నెందుకు తయారు చేశావ్... గతంలో మింగిన విషాన్ని అమృతంగా మార్చి మళ్ళీ మానవత్వపు తేనెధారల్ని... నా హృదయంలో నింపు... దుర్మార్గుడిగా నేను... బ్రతకలేక పోతున్నాను... సంభాషణల్లో హాస్యానికి పెద్దపీటవేసే నాకు యిలాంటి... దయనీయ మైన సంఘటనలు ఎదురవటమేమిటి!? అందుకే చెరగని, చెదరని నా చిరునవ్వుని కల్తీ కాకుండా కాపాడు. నాకే కాదు కామెడీని నమ్ముకున్న ఏ రచయిత నవ్వులు కూడా కల్మషం కాకూడదని దీవించు... శాసించు" అన్న ఆలోచనలు... బైటకొస్తుండగా కంటి రెప్పలు పావురాయి రెక్కల్లాటపటపకొట్టుకున్నాయి. రెండు కన్నీటి చుక్కలు... ఎడారిని తడి చేసే... స్వాతి చినుకుల్లా రాలుతున్నాయి... ★



**నా బాధలని - సగం**
**నేను పెట్టే బాధల్ని - పూర్తిగా**
**భరిస్తూ, సహించటమే కాక**
**అనుభవాల్న గాయాలు తగిలి...**
**చచ్చిపోతున్న నాలో ప్రేమని**
**ఓర్పుతో యింకా కాపాడుతున్న**
**నా భార్య కస్తూరికి**
**కాటుక బొట్టంత కానుకగా.**
**ఈ కథని ప్రేమతో... యిస్తున్నాను**

**-మరుధూరి రాజా**



# ఆమె పేరే సంచలనం




# సుచిత్రా కృష్ణమూర్తి

ఆ పేరు వినగానే 'జోలేజోలే', 'ధూమ్‌తర', 'ఆహా' ఆల్బమ్స్ గుర్తొస్తాయి పాప్ సంగీత ప్రియులకి. 'చునౌతి' సీరియల్ గుర్తొస్తుంది టీవి ప్రేక్షకులకి. శేఖర్ కపూర్ గుర్తొస్తాడు సినీ ప్రేక్షకులకి. నిజానికి మిసెస్ శేఖర్ కపూర్ కాకముందు కూడా ఆమెకు ఓ అస్తిత్వం ఉంది.





ఒక సింగర్‌గా

ఒక టీవి నటిగా

ఒక మోడల్ గర్ల్‌గా

ఒక సినిమా నటిగా

వైవిధ్యంతో కూడిన పాపులారిటిని పెళ్లికి ముందే సాధించడం వల్ల ఆమెనంతా ఇంకా సుచిత్రా కృష్ణమూర్తి గానే సంబోధిస్తారు తప్ప మిసెస్ శేఖర్ కపూర్ అని పిలవరు. అలా పిలిపించుకోవడం కూడా ఆమెకి ఇష్టం ఉండదు.

'జోలేజోలే', 'ధూమ్‌తర', 'ఆహా' ఆల్బమ్స్ సుచిత్రకు సంగీత పరంగా ఎంతో పేరు తెచ్చిపెట్టాయి. ఇక చునౌతి టీవి సీరియల్ గురించి చెప్పనే అక్కర్లేదు.

జీవితం పూలబాట, చాలాతక్కువమందికి మాత్రమే! మిగిలిన వారందరూ లక్ష్యం కోసం శ్రమించాల్సిందే. అయితే విజయం ఎప్పుడూ అర్హత ఉన్నవారినే వరిస్తుంది. ఆ అర్హతలు ప్రతిభ, పరిశ్రమ, పట్టుదల ఈ మూడు పుష్కలంగా వున్న సుచిత్ర ధైర్యాన్ని తోడుగా చేసుకుని పరిస్థితులతో పోరాడింది.

## బాల్యం - తల్లితండ్రులు

ముంబైలో పుట్టి పెరిగిన సుచిత్ర తండ్రి ఇన్‌కమ్ టాక్స్ కమిషనర్. ఆమె కుటుంబానికి సినిమా ప్రపంచానికి ఎలాంటి సంబంధం లేదు. సుచిత్ర అన్నయ్య డాక్టర్. అక్కకు స్వంతంగా ఓ గేమ్స్ కంపెనీ ఉంది. మరో అక్క శాస్త్రీయ సంగీత కళాకారిణి. ఇక సుచిత్ర తల్లి సులోచన కూడా మంచి గాయకురాలు. చివర్న పుట్టింది కనుక సుచిత్ర అంటే సహజంగానే గారాబం ఎక్కువై అంతా ఆమెనో మహారాణిలా చూసేవారు.

ఊహ తెల్సినప్పటి నుంచి జీవితంలో గొప్పదాన్నవ్వాలని, పేరు ప్రఖ్యాతులు సంపాదించాలని సుచిత్ర కలలు కనేది. సంగీతం, నాట్యం, నటనల మీద ఆసక్తి పెంచుకున్న సుచిత్రకు అనుకోకుండా 'చునౌతి' సీరియల్‌లో నటించే అవకాశం వచ్చింది. తండ్రి అభ్యంతర పెట్టినా తల్లి ప్రోత్సహించడంతో టీవీ మీడియాలోకి ప్రవేశించింది.

## బెడ్ దగ్గర కత్తితో

టి.వి.లో నటిస్తూనే మోడలింగ్ చేస్తున్న సుచిత్రకు 'కభీహా కభీనా' సినిమాలో నటించే అవకాశం వచ్చింది. ఆ సినిమా మధ్యలో వుండగా తల్లిదండ్రుల ప్రవర్తనలో మార్పుకనిపించడంతో ఇంట్లోంచి బయటకు వచ్చేసి ఒంటరిగా జీవన పోరాటాన్ని ఆరంభించిందామె. "అందుకే ఆ రోజులు గుర్తుకు వస్తే చాలు ఒంటరిగా ఉండటానికి భయపడతాను. బయటకు వచ్చేసిన మొదటిరోజు రాత్రి కటికనేల మీద పడుకున్నాను. బెడ్ దగ్గర ఓ కత్తి పెట్టుకునేదాన్ని. చేతిలో ఉన్న డబ్బులు ఖర్చయిపోతాయోమోనన్న బెంగ, భయం వల్ల రిక్షా, టాక్సీ ఎక్కాలన్నా ఆలోచించాల్సి వచ్చేది. ఆ విధంగా రెండు సంవత్సరాలు గడిపాను. ఈ రెండేళ్ళలో నా జీవితం నాకెన్నో పాఠాలు నేర్పింది అని వివరించారామె.

## శేఖర్ కపూర్‌తో పరిచయం

తన పంతొమ్మిదవ ఏట శేఖర్‌కపూర్‌ని కలిసిన సుచిత్ర, అతను తనకన్న దాదాపు ముప్పై ఏళ్ళు పెద్దవాడైనా సరే ప్రేమలో పడింది. అతడు తీయబోయే సినిమాలో అవకాశం ఇస్తారేమోనని కనుక్కునేందుకు వెళ్ళిన సుచిత్రకు 'జీవిత భాగస్వామి' పాత్రను ఇచ్చారు శేఖర్‌కపూర్. మొదటి పరిచయం అచ్చంగా 'జబేసేదేఖా' ఆల్బమ్‌ని తలపిస్తుందంటుందామె.

ఎదురు చూస్తున్న సుచిత్ర ముందు నుంచి శేఖర్ కపూర్ నడిచి తన క్యాబిన్‌లోకి వెళ్ళడం, సుచిత్ర ఆశ్చర్యంతో శేఖర్ వంక చూస్తుండటం ఆ వీడియోలో ప్రధాన అంశాలు.

ఎలిజబెత్ సినిమా కోసం ఇరవై రోజులలో తిరిగి వస్తానని లండన్ వెళ్ళిన శేఖర్ కపూర్‌కి అక్కడ నుంచి తిరిగి రావటానికి రెండున్నర ఏళ్ళు పట్టింది. ఇద్దరి మధ్యా ప్రేమ, అవగాహన ఉండటం వల్ల ఒంటరితనాన్ని అతి సులువుగా అధిగమించ గలిగానంటుంది సుచిత్ర.

ప్రస్తుతం మ్యూజిక్ షోలు చేస్తున్న సుచిత్ర త్వరలో మరో మ్యూజిక్ ఆల్బమ్‌ను రిలీజ్ చేయటంలో బిజీగా వుంది. ప్రపంచ వ్యాప్తంగా ఏదైనా ఓ ఆల్బమ్‌ను రిలీజ్ చేయాలన్నది ఆమె అభిమతం.

అనుకున్న పని జరిగి తీరాలి. అందుకోసం ఎంత కష్టమైనా సరే పడాలి అన్నది ఆమె సిద్ధాంతం. ఇటీవల 'విశ్వ'అనే కన్నడ సినిమాలో నటించి తన పాటలు తానే పాడుకున్న సుచిత్రను త్వరలో ప్లేబాక్ సింగర్‌గా కూడా చూడవచ్చు.

-ఆదెళ్ళ శివకుమార్.









# చిలిపిలిపి

Nail Round = గోరు చుట్టు

- జె.ఎస్.ఎన్.స్వామి, తాడేపల్లిగూడెం.

IPTU = నిన్ను చూసి జాలిపడుతున్నాను.

ఎ 1,00,000న్ = ఎలక్షన్

**-ఆర్.అప్పలరాజు, రెడ్డిపల్లి**





# పేరు-రిపేరు

అమ్మాయే నవ్వితే - నాలో వున్న ప్రేమ - చెప్పాలని వుంది

నువ్వు నాకు నచ్చావ్ - మనసంతా నువ్వే - వీడెక్కడిమొగుడండీ - చిక్కడు దొరకడు

**-భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్**



# డబుల్ రోల్

మునసబుగారింటికెళితే ఆయన 'లేరు' అని చెప్పాడు వాళ్ళ 'పాలేరు'

**-బి.వి.సౌజన్య, హైదరాబాద్.**

ఎప్పుడు 'నిషా' మీదుండే ఆ మంత్రి ప్రజా 'మనిషా';

**-టి.వి.సతీష్, విజయవాడ**

'రంగయ్యా' నీ షర్టుకున్నది 'నలుపు రంగయ్యా'






## కొంటె కొశ్చెను తుంటరి జవాబులు

ప్ర: మగవాడు మిస్టర్ అయితే మరి ఆడది!?
జ: మిష్టరీ

జె.యస్.యన్.స్వామి - తాడేపల్లిగూడెం

ప్ర: మనకి పుట్టుమచ్చలు ఎలా వచ్చేయి?
జ: బ్రహ్మదేవుడు మన తల రాత రాసేటప్పుడు ఇంక్ సరిగ్గా ల్లో కాకపోతే పెన్నుని దులుపుతూ ఉండి ఉంటాడు. అప్పుడు లికిన సిరా చుక్కలే పుట్టు మచ్చలు అయి ఉంటాయి.

యు.పావనఫణి - పెడన

ప్ర: పెరుగుట విరుగుట కొరకే!?
జ: ధరలు పెరుగుట నడ్డి విరుగుట కొరకే.

## చిలిపి కవిత

భారీ బడ్జెట్ సినిమా
లాంటిది
నగర జీవితం
చిన్న 'పోర్షన్'కి కూడా
పెద్దఎత్తున 'మూల్యం'
చెల్లించక తప్పదు మరి!?



## పేరడీ పెరేడ్



పల్లవి : నువ్వునేను సినిమా వందరోజుల హంగామా (3)
ఇది ఎవర్‌గ్రీను మామా / కాదనుట ఎవరి తరమా
తేజ చూపినా మహిమే మామా ఈ వందరోజులా నువ్వునేను సినిమా

1, ఈ హిట్టుకి హీరోలు మన కెమెరామెన్ రసూలు (3)
చేస్తున్నడండి సవాలు / వేస్తున్నడండి శివాలు ॥తేజ చూపినా॥

2, రియల్ హీరో తాను సినిమాకి బ్యాక్‌బోను (3)
అది జెమిని టీవి కిరణ్ రెండువైపులున్న పదును ॥తేజ చూపినా॥

3, కవి కులశేఖరుడు గురువు సీతారాముడు (3)
మన తేజకేమొ సహచరుడు మనస్వినికి అర్భుడు ॥తేజ చూపినా॥

4, ఈ హిట్టుకి తొలిమెట్టు ఆర్పీదే క్రెడిట్టు (3)
గాజువాక పిల్లపై ఒట్టు ఆర్పీకి ఉంది పట్టు ॥తేజ చూపినా॥

5, చిత్రం తొలి ఉదయం మలికిరణమే శతచిత్రం (3)
ఈ తేజ ఉదయ కిరణం అది పట్టుదలకు ప్రతిఫలం ॥తేజ చూపినా॥

6, ముద్దుముద్దు వనిత మన హీరోయిన్ అనిత (3)
మార్చేయనుంది చరిత అహ బైటుగుంది భవిత
తేజ యూనిట్‌దే విజయం మామా ఈ వందరోజుల నువ్వునేను హంగామా

(మస్తుగుంది పోరి, ఘల్లుఘల్లు గారడి పిల్ల, కొండమల్లెలు వంటి ప్రైవేటు ఆల్బమ్స్ రచయిత **కానర్ల శ్యామ్** రాయగా పిట్టలదొర (ఇంతకూరుంటెయ్యమ్మో) భజరంగభళి, ఆల్‌రౌండర్ సినిమాల గాయకుడు **ప్రణయకుమార్** 'నువ్వు - నేను' సినిమా శత దినోత్సవ వేడుక సభలో **'గాజువాక పిల్లా మేం గాజులోళ్ళం కాదా'** అనే పాటకు పేరడీగా పాడిన పాట ఇది.)

## ఈ రూటే వేరు

LTTE = లుకింగ్ టు టోక్యో టాకింగ్ టు ఇంగ్లాండ్ (మెల్లకన్ను)

**-చైతన్య**

హౌరా!? = ఎలా రా!?

**-పి.శోభన్‌బాబు, కొర్ని**

త్రీరోజస్ టీ = మూడు రోజుల క్రితం తయారుచేసిన టీ

**-వి.జోషి, యడవల్లి.**



# నువ్వు - నేను



'నువ్వు-నేను' సినిమా ధర్మవరపు సుబ్రమణ్యంకు సరికొత్త జీవితాన్ని ప్రసాదించింది. ఓవర్‌నైట్‌లో బిజీ కామెడీస్టార్ అయిపోయారాయన. 'అంతొద్దు బాబూ' అంటూ బెజవాడ బేస్ వాయిస్‌లో మాట్లాడుతుంటే థియేటర్ నిండా చప్పట్ల వర్షమే.

'నువ్వు-నేను' సినిమాలో తనకు నచ్చిన పాట గురించి వివరణాత్మకంగా ఇలా చెప్పుకొచ్చారాయన.

'ప్రియతమా ఓ ప్రియతమా' అని ఉదయకిరణ్, అనితలు టెలిఫోన్‌లో పాడుకునే పాట నాకన్నిటికన్నా బాగా నచ్చింది. సాంగ్ ప్రెజెంటేషన్ బాగుంది. టీనేజర్స్ ప్రేమలో పడ్డప్పుడు భావ వ్యక్తీకరణకు వాళ్ళకు మార్గాలు తెలియవు. 20-25 ఏళ్లప్పుడైతే మెచ్యూర్టీ వుంటుంది కాబట్టి, వారి భావవ్యక్తీకరణ విధానమే వేరుగా వుంటుంది. టీనేజ్‌లో వున్న వాళ్ళకి, ముఖ్యంగా తల్లితండ్రుల శృంఖలాల్లో వున్నవాళ్ళ ప్రేమ వ్యక్తీకరణకు అనువైన మాధ్యమం 'టెలిఫోన్'. పాటని టెలిఫోన్ దగ్గర ప్రారంభించి, కట్ చేస్తే రాజస్థాన్‌లో తేలడం చాలా మంది చేసేపని. కాని దర్శకుడు తేజ చాలా ఇంటలెక్చువల్‌గా ఈ సాంగ్ తీసారు. కుర్రాళ్ళకే కాకుండా, పెద్దలకూ కూడా ఈ పాట నచ్చింది. సన్నివేశానికి తగిన బ్యాక్‌డ్రాప్‌ని ఎంచుకోవడంలోనే తేజ తెలివితేటలు కనిపిస్తున్నాయి'' అని అన్నారాయన.

# మనసంతా నువ్వే



ఉదయకిరణ్ ఇప్పుడు కుర్రకారు కలల రాకుమారుడు. మా 'మనసంతా నువ్వే' నిండిపోయావంటూ అమ్మాయిలు ఉదయకిరణ్ గురించే కబుర్లు చెప్పుకుంటున్నారు. ఓ వైపు రెండో సినిమా 'నువ్వు - నేను' సెంచరీ కొడితే, ఇంకో వైపు మూడో సినిమా 'మనసంతా నువ్వే' హాఫ్ సెంచరీకి ఉరకలు వేస్తోంది. నువ్వు - నేను, మనసంతా నువ్వే పాటలే ఎక్కువగా కుర్రకారు నోళ్ళలో నానుతున్నాయి. మరి ఉదయకిరణ్ మనసులో సందడి చేసి 'మనసంతా నువ్వే' అనిపించే పాట ఏమిటని అడిగితే 'నీ స్నేహం కలకాదు అని', 'చెప్పనా ప్రేమ చిలిమి చిరునామా' పాటలు రెండూ నాకు బాగా యిష్టం. ముఖ్యంగా 'చెప్పనా ప్రేమ' పాట మీద అభిమానం ఎక్కువ వుంది. ఎందుకంటే నేను చేసిన మూడు సినిమాల్లోనూ ఫస్ట్ డ్యూయెట్ సాంగ్ ఇదే అవుతుంది. అలాగే ఫస్ట్‌టైమ్ ఫారిన్ లొకేషన్‌కి వెళ్ళి చేసిన పాట ఇది. ఈ పాట కోసం మలేషియా వెళ్ళి వచ్చాం. నాకు చిన్నప్పట్నుంచీ చిరంజీవి గారంటే బాగా యిష్టం. నటనలో నాకు ఆయనే ఇన్‌స్పిరేషన్ అని చెప్పుకోవాలి. హీరోయిన్లతో పోటీ పడుతూ మెరుపు వేగంతో ఆయన చేసే డాన్స్ చూస్తే ఎవరికైనా ముచ్చటేస్తుంది. నేను కూడా అలా డాన్స్ చేయాలని కలకన్నాను, ఆ కల ఇలా నెరవేరింది'' అని చెప్పుకొచ్చారు ఉదయకిరణ్.




# నువ్వు నాకు నచ్చావ్



'ఆనందం' చిత్రంలో ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించిన సంభాషణలను రాసిన డైలాగ్ రైటర్ చింతపల్లి రమణ - 'నువ్వు నాకు నచ్చావ్' సినిమాలో తనకు నచ్చిన పాటగా 'ఓ నవ్వు చాలు ఎన్నెన్నో వలలు వేస్తే అల్లుకుంటుంది. ' పాటను పేర్కొన్నారు. "ఈ పాటలో -పరప పర పప్పా/పప్పప్ప పప్పా/ పరప పరపప్పప్పా / పప్ప పరపప్ప'' అంటూ ట్రంపెట్‌తో ఏం వాయించారండీ!? ఇక పాటలో 'పట్టపగలెవరైనా రాతిరిని చూస్తారా ఆమె కురులను చూపిస్తా ఔననక ఛస్తారా' - అంటూ సీతారామశాస్త్రి గారు ఎంత బాగా రాశారో.... బ్యూటిఫుల్ ఎక్స్‌ప్రెషన్... ఇలాంటివి ఆ పాటలో ఇంకా ఎన్నో వున్నాయి. మీరు మీ 'హాసం'లో 'నువ్వు నాకు నచ్చావ్' పాటల పుస్తకం వేశారు కదా.... అది చూస్తే ఇంకా చెప్పగలను. కానీ రాంపల్లి సుబ్రహ్మణ్యశర్మ అని నాకో ఫ్రెండున్నారు. మంచి పాటగాడు. వాడు మొన్న ఈ పాట పాడుతూ పీక్ లెవల్‌లో మూడొచ్చి ఆ పాటల పుస్తకం ఉన్న పేజీల్నీ పీక్కు పోయాడు'' అంటూ తన చమత్కారంతో చెప్పారు చింతపల్లి రమణ.

# ఆనందం



ఇప్పుడు విజయవంతంగా ప్రదర్శించబడుతున్న అన్ని సినిమాల్లోనూ ఎమ్మెస్ నారాయణ ఉన్నారు. అన్నీ ఒకదానికొకటి పోలికలేని పాత్రలే! 'ఆనందం'లో ఆయనది బ్యాచ్‌లర్స్ పోర్షన్స్ అద్దెకిచ్చే హౌస్ ఓనర్ పాత్ర. ఈ సినిమాలో మీకు నచ్చిన పాట ఏదని చెబితే ఆయన ఇలా చెప్పుకొచ్చారు.

"ప్రేమంటే ఏమిటంటే ఎట్టాగ చెప్పమంటే'' పాటంటే నాకు బాగా ఇష్టం. ముఖ్యంగా బీట్ బాగుంది. పాటలో మంచి అర్థంతోపాటు రిథమ్ కూడా వుంది. నాకు మొదట్నుంచీ కూడా మెలోడీ సాంగ్స్ అంటే ఇష్టం. ఫాస్ట్‌బీట్ అయినా గానీ సంగీతానికి తగ్గట్టుగా సాహిత్యం జత కుదిరితే బాగుంటుంది. సాగదీయడాలు, కుదించడాలు ఉంటే నాకు ఇష్టం వుండదు. ఈ పాటలో సాహిత్యం, సంగీతం నన్ను అమితంగా ఆకట్టుకున్నాయి'' అని వివరించారాయన.

## స్టూడెంట్ నెం.1



ఆనంద్ అనగానే ఒక వేణువు వినిపించెను (అమెరికా అమ్మాయి), నల్లా నల్లాని మబ్బుల్లోన లగ్గో పిల్లా (మనవూరి పాండవులు) పాటల్ని గుర్తుచేసుకుంటారు సినీ సంగీత ప్రియులు. ఇటీవల ఆయన హైద్రాబాద్ వచ్చినప్పుడు 'స్టూడెంట్ నెం.1' సినిమాలో 'పడ్డానండీ ప్రేమలో మరి' పాటని తనకు నచ్చిన పాటగా పేర్కొన్నారు. ఈ పాటలో బీటు, మెలోడీతో పాటు ఒక రకమైన ఎట్రాక్షన్ ఉంది. అసలు పడ్డానండి ప్రేమలో మరి అన్నది పల్లవి కాదు పాట మధ్యలో ఒకలైను. దానికే రిపీట్ వాల్యూ ఇచ్చి స్వరపరిచారు కీరవాణి. ఆ ప్రక్రియ నాకు బాగా నచ్చింది." అంటూ వివరించారాయన.

## పరవశం



బాలచందర్ 100వ చిత్రంగా ఏ.ఆర్.రెహమాన్ క్రేజీ కాంబినేషన్‌లో విడుదలైన 'పరవశం' క్యాసెట్లు సికింద్రాబాద్ సంగీత్ సాగర్‌లో రోజుకి పదికి తక్కువ కాకుండా అమ్ముడవుతున్నాయి. బి సైడు మొదటి పాటగా వచ్చే పాటకు రెస్పాన్స్ బావుందని సంగీత్ సాగర్ ఫ్లోర్ మేనేజర్ దేవరాజు తెలిపారు. "ఎ సైడున ఉన్న పాటైతే వినగానే బావుందో లేదో చెప్పగలరు. బి సైడున వచ్చే పాటను ఎలా వినిపించగలరు వాళ్ళ రెస్పాన్స్ ఎలా చెప్పగలరు?" అని అడిగితే " మనం వినిపించేదాక ఆగటం లేదండీ టీవీ యాడ్స్‌లో ఈ పాట చూసేసి వచ్చి మరీ కొంటున్నారు" అని చెప్పారాయన.

## డాడీ



తెలుగు టీవీ ప్రపంచంలో నంబర్‌వన్‌గా ఉన్న యాంకర్ ఝాన్సీ! గలగల పారే సెలయేరు లాంటి తన వాచకంతో టీవీ కార్యక్రమాలకే వన్నె తెచ్చిన ఝాన్సీ ఓ పక్క సినిమాల్లోనూ, మరోపక్క టీవీలోనూ ఆర్టిస్ట్‌గా రాణిస్తున్నారు. 'మీ ఫేవరేట్ హీరో' ఎవరని అడిగితే మొదటగా చిరంజీవి పేరునే చెబుతారామె. అందుకే తన అభిమాన నటుడు నటించిన 'డాడీ' సినిమాలోని తనకు నచ్చిన పాట ఏదని అడగటం జరిగింది. "గుమ్మాడి గుమ్మాడి పాట ఎక్స్‌ట్రార్డినరీగా వుంది, అలాగే అర్థవంతంగా వుంది. ఈ సినిమాలో మిగిలినవన్నీ కమర్షియల్ సాంగ్స్. ఇది మాత్రం కథకి కంపల్సరీగా కావాల్సిన పాట. మిగతావన్నీ చిరంజీవిగారి స్టైయిల్‌లో వుంటే, ఈ పాటలో మాత్రం చిరంజీవిగారు స్టైయిల్ మార్చి చేసినట్టనిపిస్తుంది. పాపతో కలిసి చిరంజీవిగారు పాడటం బాగుంది. ట్యూన్, లిరిక్స్, పిక్చరైజేషన్, ముఖ్యంగా చిరంజీవిగారి అభినయం... అంతా బావుంది." అని చెప్పారు ఝాన్సీ.

## ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



రిక్షావోడు, స్నేహంకోసం మొదలైన చిత్రాలకు కెమెరామెన్‌గా పనిచేసిన దత్తు. కె. లో మంచి టెక్నీషియన్ వున్నాడని నిరూపించిన చిత్రం 'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం'. ఈ చిత్రంలో మ్యూజిక్‌కి ఎన్ని మార్కులు పడ్డాయో, ఫొటోగ్రఫీకి కూడా అన్ని మార్కులు పడ్డాయి. ముఖ్యంగా పాటల్లో తన విద్వత్తుని కెమెరా ద్వారా ఝుళిపించారు దత్తు. ఈ సినిమాలో మీకు నచ్చిన పాట ఏమిటని అడిగితే, " నీ కోసం వేచివేచి చూసెను నయనం' పాటకే నేను ఫస్ట్ ర్యాంక్ ఇస్తాను. ఈ పాటలో హాంటింగ్ బీట్ వుంది, మోడ్రన్ టేకింగ్ వుంది, మంచి టెక్నికల్ వేల్యూస్ వున్నాయి. డిఫరెంట్ కలర్ కాంబినేషన్స్‌లో సాంగ్ కలర్‌ఫుల్‌గా వచ్చింది. కెమెరామెన్‌గానాకు మంచి జాబ్ శాటిస్‌ఫాక్షన్‌ని ఇచ్చిన పాట ఇది" అని తెలిపారు.

## ఖుషీ



మనస్విని ఆత్రేయ పురస్కారంతో గేయ రచయితగా మరో విజయ శిఖరమధిరోహించిన నవ యువకుడు కులశేఖర్. 175 రోజులు పూర్తి చేసుకున్న 'ఖుషీ' చిత్రంలో తనకు నచ్చిన పాట ఏదని అడిగితే ఇలా వివరించారు.

"అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా' పాట నాకు నచ్చిన పాట. రచయిత ఎంచుకున్న పాట్రన్ బాగుంది. ఆ సిట్యుయేషన్ తీసుకుని వారిద్దరి ప్రేమని జనరలైజ్ చేయడం బాగుంది. మంచి టేకాఫ్ వుంది పాటలో. ఈ పాటకి మాతృక అయిన తమిళ్ సాంగ్‌లో 'అమ్మాయి ఓ సెంటిమీటర్ నవ్వు నవ్వింది. ఆ సెంటిమీటర్ నవ్వు చూసి వందమంది చచ్చిపోయారు.' అని వుంది. దాన్నే తెలుగులో యథాతథంగా చెబితే ఎబ్బెట్టుగా వుంటుంది. మన నేటివిటీ కనుగుణంగా చక్కటి ఫీల్‌తో పాటను రూపకల్పన చేశారు. నాకు ముఖ్యంగా పల్లవి టేకాఫ్, పంచ్ నచ్చింది' అన్నారు కులశేఖర్.

## జాబిలి



కృష్ణారెడ్డి-అచ్చిరెడ్డి రెండు పేర్లు, ఇద్దరు వ్యక్తుల్లా అనిపించినా వారిది ఏకాత్మ! రోజా మూవీస్ అర్జునరాజు కృష్ణారెడ్డి దర్శకత్వంలో నిర్మించిన 'జాబిలి' సినిమాలో 'గంగా యమున గోదారి' పాట తనకు నచ్చినదని చెప్పారు అచ్చిరెడ్డి. సామాజిక చైతన్యం కనిపించే ఈ పాట యూత్‌కి ఎక్కువ ఇన్‌స్పైయిరింగ్‌గా ఉంటుంది. లిరిక్‌లో అంతర్లీనంగా ఉన్న సందేశం కృష్ణారెడ్డి పిక్చరైజేషన్‌లోని టోటాలిటీతో మరింత హిట్ అయి కనిపిస్తుంది. నేటి యువత యొక్క వ్యక్తిత్వ ఆర్థిక భవిష్యత్తుకి ఈ పాట ఒక టార్చిలాగ గమ్యం చూపిస్తుంది" అని అన్నారాయన.

# డిసెంబరు 15 బాపూ జన్మదిన సందర్భంగా ఈసారి బాపూ రమణీయం ఇలా...






కాన్సెప్ట్ : రాజా    డైలాగ్స్: ఎమ్బీయస్ ప్రసాద్    కార్టూన్ : జయదేవ్








అశ్వనీదత్



రాఘవేంద్రరావు



రాజమౌళి



కీరవాణి



చంద్రబోస్

ఈ పాటను కోరిన వారు
కె.వేణుగోపాల్,
బాలాజీనగర్, హైదరాబాదు.

# కొంచెం నన్ను నువ్వు నిన్ను నేను తాకుతుంటే...

| | |
|---|---|
| చిత్రం | : స్టూడెంట్ నెం.1 |
| బ్యానర్ | : వై జయంతీ మూవీస్ |
| నిర్మాత | : సి.అశ్వనీదత్ |
| దర్శకత్వం | : రాజమౌళి |
| దర్శకత్వ పర్యవేక్షణ | : కె.రాఘవేంద్రరావు |
| సంగీతం | : కీరవాణి |
| పాట రచన | : చంద్రబోస్ |
| గానం | : బాలు, చిత్ర |
| అభినయం | : జూ॥ ఎన్.టి.ఆర్, గజాలా |

సృష్టిలో మనిషి తన గురించి తాను తెలుసుకోకముందే శృంగారానికి సంబంధించిన అనుభవాన్ని పొందాడు. కేవలం మానవులకు మాత్రమే పరిమితం కాకుండా జీవకోటిలోని ప్రతి ప్రాణికి తప్పనిసరియైన ఈ ఆకర్షణకు చెందిన అనుభూతిని నిర్వచించటంలో మనిషి ఇంకా కొత్త దారులు వెతుకుతూనే వున్నాడు. ఇది బైటి ప్రపంచం సంగతి!

ఇక సినీ ప్రపంచానికొస్తే-శృంగారానికి పెద్దపీట వేసిన వారిలో సినిమావారి ప్రాతినిధ్యాన్ని ఒప్పుకుని తీరాలి. ప్రతి విషయానికి మంచీ చెడూ ఉన్నట్టే ఇందులో మితిమీరిన కథనాలూ లేకపోలేదు. కాకపోతే మంచిని మాత్రమే స్వీకరించి చెడును వదిలేయగలిగితే హృదయం ఆరోగ్యంగా ఉంటుంది కనుక మొదటి వర్గానికే ప్రాధాన్యతనిద్దాం.

చక్కగా, అందంగా -శృంగారాన్ని ఆవిష్కరించటంలో కూడా కొన్ని కొన్ని చోట్ల స్థాయీభేదం ఉండడం సహజం. అదీగాక ఆదరించే ప్రజలలో కూడా ఆ అభిరుచి రకరకాల స్థాయిల్లో ఉంటుంది కనుక అందరికీ ఆమోదయోగ్యంగా ఉండే రీతిలో తెలివిగా నెట్టుకుంటూ, నెగ్గుకుంటూ రావాలి. ఎటువంటి వారినైనా తన చిత్రీకరణ ద్వారా మెస్మరైజ్ చేయగల రాఘవేంద్రరావు ఓ వైపు, ఎలాంటి పాటకైనా తనదైన ముద్రతో ఉదాత్తస్థాయిని కల్పించగల కీరవాణి ఒకవైపు ఉన్నప్పుడు ఏ గీత రచయితకైనా సరే - అయితే అతి సులువుగా పాట అయిపోతుంది లేదా కొన్ని వెర్షన్‌లు రాసి, ఎంతో శ్రమపడిన తర్వాత పూర్తవుతుంది.

ఇక్కడ ఈ పాట కొచ్చేసరికి-రాఘవేంద్రరావు పర్యవేక్షకుడు మాత్రమే. దర్శకుడు రాజమౌళి ఆయన శైలిని పుణికి పుచ్చుకున్న వ్యక్తి కనుక ఆ ప్రభావం పాటలు రాయించుకోవటంలో కూడా ఉంటుంది. ఇదిలా ఉండగా నిర్మాత అశ్వనీదత్ పాటల విషయంలో చాలా పర్టిక్యులర్‌గా ఉండే నిర్మాత. సో... ప్రేక్షకులను, శ్రోతలను మెప్పించే పాట-ముందు వీరందరి మార్కులు పొందవలసివుంటుంది.

చంద్రబోస్ అతి కొద్దికాలంలోనే విపరీతమైన పాపులారిటీ సంపాదించిన సినీగీత రచయిత! అతను రాసిన పాటల్ని బాగా గమనిస్తే ఒక స్కీము ఉంటుంది లేదా ఛమక్కులు చుట్టుముట్టేస్తూ ఉంటాయి. పదాలు గిలిగింతలు పెడుతూంటే భాష వర్తమాన పరిస్థితులకు అనుగుణంగా ఉంటుంది. ఉదాహరణలు కూడా మన ఊహకు అందుబాటులో వుండేవిగానే ఉంటాయి. కాకపోతే వాటిని అతడు చెప్పే పద్ధతిలోనే కాస్త తమాషా, కొంత చిలిపితనం, టోటల్‌గా 'హుషారుతనం' తొంగి చూస్తూ ఉంటాయి.

ఆ చిలిపితనం, ఆ తమాషా, ఆ హుషారు మొదలైన ఈ గుణాలన్నిటినీ శృంగారంతో రంగరించి మరీ కొట్టాడు చంద్రబోస్ ఈ పాటలో. సోకు నిప్పురేగటం, కన్నె కొంపలంటుకోవటం, తీపి ఆశరేపుతున్నప్పుడు రేపు కాదు ఇప్పుడే అనటం లాంటివి 'చిలిపి శృంగారం' అక్కౌంటులోకొస్తే నరాల్లో లవ్వో గివ్వో జివ్వో పుట్టడం / పెదాలలో నవ్వో కెవ్వో పువ్వో పూయటం / అన్నపాశన ప్రాసగా వన్నెప్రాశనను ఉపయోగించటం లాంటివి 'తమాషా శృంగారం' జాబితాలోకొస్తాయి.

తెలుగు వ్యాకరణంలో 'ముక్త పదగ్రస్తం' అనే అలంకారం ఒకటుంది. వాక్యంలో చివర విడిచిన పదంతో తర్వాత వాక్యాన్ని ఆరంభించటం ఆ అలంకారం యొక్క లక్షణం. పల్లవి లోను, నరాల్లో లవ్వో గివ్వో జివ్వో పుడుతుంది అంటూ చరణాల చివర లీడ్ చేసే వాక్యాలలోనూ ఈ ముక్త పదగ్రస్తాన్ని ఉపయోగించటం చంద్రబోస్‌కి కవిగా ఊహించుకోగల 'స్క్రీన్ ప్లే' గుణాన్ని, సహజంగా ఉన్న 'స్కీమ్ ప్లే' తత్వాన్ని మనం గమనించవచ్చు.

ఇక స్వరకర్తగా కీరవాణి కాంట్రిబ్యూషన్ ఈ పాటకి శ్వాస...! ఆయన స్వరకల్పన ఎక్కువగా జీవ స్వరాలపై ఆధారపడి ఉంటుంది. అందుకే అణువణువునా మెలోడీ తొంగిచూస్తూ ఉంటుంది. కావాలంటే ఈ పాట ఓ సారి విన్నతర్వాత అది తిరిగి మననం చేసుకోడానికి ప్రయత్నించండి. లిరిక్‌తో సంబంధం లేకుండా ట్యూన్ 'తననా'లతో తన్నుకుంటూ బైటికొచ్చేస్తుంది. జీవ స్వరాలతో కూడిన పాట లక్షణం అదీ!! ఈ పాట ఎక్కువగా మాల్ కౌస్, ఉదయ చంద్రిక రాగాల మిశ్రమంపై ఆధారపడింది. ఇటువంటి కంపోజిషన్స్‌కి ఒక ఒరవడి పెట్టింది - కె.వి.మహదేవన్! బాబూ మూవీస్ వారి 'మంచి మనసులు' (1962) సినిమాలో 'నన్నువదలి నీవు పోలేవులే' పాట ద్వారా ఎంతోమంది సంగీత దర్శకులకు ప్రేరణనిచ్చాడాయన. 'అదిరిపడిన పెదవి కేంటి అర్థం' - అంటూ కీరవాణి 'బొంబాయి ప్రియుడు' సినిమాలో 'నన్ను వదలి నీవు పోలేవులే' పాట వరసని దృష్టిలో పెట్టుకుని ఓ పాటని చేయటం జరిగిందికూడా! ఈ విషయమై అడిగితే "ఆ పాట (నన్ను వదలి నీవు పోలేవులే) ఒక నిధిలాంటిదండీ... నావరకు నేను ఆ పాట ఆధారంగా ఓ వంద పాటలు చెయ్యగలను" అన్నారు కీరవాణి. కావాలంటే ఇదే సినిమాలో 'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాము' పాటలో 'మరపురాని తిరిగిరాని గురుతులండీ' అనే లైనుని గుర్తుకు తెచ్చుకోండి. అది అచ్చం 'నన్ను వదలి నీవు పోలేవులే' పాటకు దగ్గరగా ఉంటుంది. అంతేకాదు 'నన్ను వదలి నీవు పోలేవులే' పాట వరసలో ఇళయరాజా కూడా ఓ పాటని స్వరపరిచారని ఆయన్ని కూడా ఆ పాట ప్రభావితం చేసింది చెప్తూ ... ఆ తమిళ గీతంలోని కొంత భాగాన్ని పాడి వినిపించారు. ఆ టేప్ 'హాసం' లైబ్రరీలో భద్రంగా ఉంది!

మళ్ళీ- 'కాస్త నన్ను నువ్వు నిన్ను నేను' పాట దగ్గరకి కాస్త వస్తే పాటంతా ఒక ఎత్తు. పల్లవిలో ట్యూన్ పరంగా కీరవాణి పెట్టిన మెలికలు ఒక ఎత్తు. ఆ మెలికలే పాటని ఎంతో ఎత్తుకి తీసుకువెళ్ళి పోయాయి. బావిలో నీరు ఎంత తోడితే అంత వూరుతుందన్నట్టు ఈ పాట ఎన్నిసార్లు విన్నా అన్నిసార్లూ కొత్త కొత్త అంశాలు గోచరిస్తూ ఉంటాయి.

అ: కాస్త నన్ను నువ్వు నిన్ను నేను తాకుతుంటే
తాకుతున్నచోట సోకునిప్పు రేగుతుంటే
ఆ: రేగుతున్నచోట భోగిమంట మండుతుంటే
మంట చుట్టుముట్టి కన్నె కొంపలంటుకుంటే
ఆ: నరాల్లో లవ్వో గివ్వో జివ్వో పుడుతుంది
ఆ: పెదాల్లో నవ్వో కెవ్వో పువ్వో పూస్తుంది
అ: అమ్మడూ నీ యవ్వారం అసలుకే ఎసరు పెడుతుంటే
కమ్మగా నీ సింగారం కసురు విసురుతుంటే
ఆ: పిల్లడూ నా ఫలహారం కొసరి కొసరి తినిపిస్తుంటే
మెల్లగా నీ వ్యవహారం కొసరులడుగుతుంటే
అ: చిన్ననాడె అన్న ప్రాసనయ్యిందోయ్.
కన్నెదాని వన్నె ప్రాసనవ్వాలోయ్
ఆ: అమ్మచేతి గోరు ముద్దతిన్నానోయ్
అందగాడి గోటి ముద్ర కావాలోయ్.... ఓ...ఓ...ఓ...
ఆ: కాస్త నన్ను నువ్వు నిన్ను నేనుకోరుకుంటే
కోరుకున్న చోట నువ్వు నేను చేరుకుంటే
అ: చేరుకున్న చోట ఉన్న దీపమారుతుంటే
ఆరుతున్నవేళ కన్నె కాలు జారుతుంటే ॥నరాల్లో॥
అ: మెత్తగా నీ మందారం తనువులో మెలిక పెడుతుంటే
గుత్తిగా నీ బంగారం తలకు తగులుతుంటే
ఆ: కొత్తగా నీ శృంగారం సొగసులో గిలకలవుతుంటే
పూర్తిగా నా బండారం వెలికి లాగుతుంటే
అ: బుగ్గలోన పండుతుంది జాంపండు
పక్కలోన రాలుతుంది ప్రేంపండు
ఆ: రాతిరేళ వచ్చిపోరా రాంపండు
బంతులాడి పుచ్చుకోరా భాంపండు.... ఓ.....ఓ...ఓ...
ఆ: కాస్త నన్నునేను నిన్ను నువ్వు ఆపుకుంటే
అ: ఆపలేక నేను నిన్ను జాలిచూపమంటే
ఆ: చూపనంటు నేను తీపి ఆశ రేపుతుంటే
అ: రేపుతుంటె నేను రేపుకాదు యిప్పుడంటే ॥నరాల్లో॥

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త,
లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.

రచన: అడవి బాపిరాజు
గానం, సంగీతం : ఘంటసాల వేంకటేశ్వరరావు
రాగం : నఠభైరవి (కర్ణాటక సంగీతం) -20వ మేళకర్త
రాగ్ అసావ్‌రీ (హిందుస్తాని సంగీతం)
ఆరోహణ : సరిగమపదనిస
అవరోహణ: సనిదపమగరిస
తాళం: ఖండచాపు (జంపెతాళం) -కర్ణాటక సంగీతం
ఝప్‌తాళ్ - హిందుస్తాని సంగీతం

ఈ రాగంలో ఆరోహణ, అవరోహణలందు కూడా సప్త స్వరాలూ ఉన్నవి కనుక యీ రాగాన్ని మేళకర్త రాగమని, జనకరాగమని అంటారు.

ఈ రాగంలో షడ్జము, చతుశ్రుతి రిషభము, సాధారణ గాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, శుద్ధ దైవతము, కైశికి నిషాదము వున్నవి.

## పాడకే నా రాణి...

పల్లవి॥ పాడకే నా రాణి పాడకే పాట
పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే ॥పాడకే॥

1.చరణం॥ రాగమాలాపించి వాగులా ప్రవహించి
సుడిచుట్టు గీతాల సురిగి పోనీయకే ॥పాడకే॥

2.చరణం॥ కల్హార ముకుళములు కదలినవి పెదవులు
ప్రణయ పదమంత్రాల బంధించె జీవనము ॥పాడకే॥

3.చరణం॥ శృతిలేని నామదికి చతుర గీతాలేల
గతిరాని పాదాల గతుల నృత్యమ్మటే ॥పాడకే॥

## ఘంటసాల వేంకటేశ్వరరావు

ఆంధ్రుల అభిమాన గాయకుడు, స్వరకర్త అయిన ఘంటసాల వేంకటేశ్వరరావు గారు తెలుగు లలిత సంగీతానికి ఒరవడి దిద్దిన మహనీయులలో ఒకరు. చలన చిత్రాలలో నేపథ్య గాయకుడిగా మాత్రమే ఉండిపోక, దేశంలో ఏ ఉద్యమం వచ్చినా, ఏ సంఘటన జరిగినా స్పందించి పాటలు పాడి రికార్డులుగా వెలువరించారు. స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించి 'స్వాతంత్ర్యమె మా జన్మహక్కని చాటండి', సరోజినీ నాయుడిపై 'అమ్మా! సరోజినీదేవి', ఆంధ్రమాతను స్తుతిస్తూ 'జయహే! జయజయా ఆంధ్రమాతా' అనే పాటలు పాడారు. 1953లో ఆంధ్రరాష్ట్రావతరణోత్సవానికి కర్నూలు వెళ్ళి అక్కడ సభలో 'తెన్నుభారత కవితను తీర్చిదిద్దిన... 'అన్న పద్యాన్ని ఆవేశంగా పాడారు. 'పుష్ప విలాపము', 'కుంతీకుమారి' మొదలైన కరుణశ్రీ పద్యాలను లలితంగాను, భావయుక్తంగాను పాడడంలో ఒక రివొల్యూషన్‌ను తీసుకువచ్చారు. తన యిష్ట దైవమైన తిరుమలేశునిపై భక్తిని మదినిండా నింపుకుని అనేక గీతాలను గానం చేస్తూ జీవితాన్ని సార్థకం చేసుకున్న పుణ్యమూర్తి. తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే ఆస్థాన విద్వాంసునిగా సత్కారాన్ని అందుకున్న ధన్యజీవి. ఆకాశవాణి ద్వారా ఎన్నో లలిత గీతాలను ఆలపించారు. ప్రజలలోకి వెళ్ళి ఎన్నో లలిత సంగీత కచేరీలు చేశారు. ఆకాశవాణిలో ఆయన గానం చేసిన గేయాలు 'పాడకే నా రాణి' (అడవి బాపిరాజు), 'పాడనా ప్రభూ' (బోయి భీమన్న) మొదలైనవి విశేషంగా ప్రజాదరణ పొందినవి. నేను ప్రప్రథమంగా లలిత సంగీతానికి సిలబస్‌ను రూపొందించి, 'లలిత సంగీతం - డిప్లొమా కోర్సును (2 సంవత్సరాలు) తయారు చేయగా, దానిని తెలుగు విశ్వ విద్యాలయం వారు ఆమోదించి 2000 సం॥లో కోర్సును ప్రారంభించారు. ఆకోర్సు పాఠ్యాంశంలో ఘంటసాలగారు స్వరపరచి గానం చేసిన 'పాడకే నా రాణి' అనే పాటను పొందుపరచాను.



1954 నుండి ఘంటసాల గారితో నాకు పరిచయము, సాన్నిహిత్యము కలిగినవి. ఆయన గానం చేసిన అనేక గీతాలలోని సంగీతం గురించి ఆయనతో ముచ్చటిస్తూండే వాడిని. ఆ విధంగా ఆయనకు నాపై అభిమానము, వాత్సల్యము ఏర్పడినవి. 1969లో టంగుటూరి ప్రకాశం పంతులుగారిపై ఒక డాక్యుమెంటరీ చిత్రానికి నేను, నా మిత్రుడు ఎల్.నిర్మల్‌కుమార్ కలిసి సంగీతం కూర్చిన గురజాడ వారి 'దేశమును ప్రేమించుమన్నా' గీతాన్ని ఘంటసాలగారు ఎంతో హృద్యంగా గానం చేశారు.

ఆయన పెద్ద కుమారుడు విజయకుమార్ తరచూ హైదరాబాద్

## పాడకే నారాణి

ప॥ ; స్సారి గప | పదపమగ | స స్సారిమగమగ | గరిరిస సా, |
. పా.డ కే. | నా. రా. ణి | . పాడకే. . . | పా. . . టు . |

; స్సారి గప | పాదపప | ; పదానిగారి | సాస్సనిదప నినిదా | మగపా, |
. పాట మా. | ధు ర్యా. లు | . ప్రా. ణా. లు | మరి. గి. నే. . | . . . |

॥ పాడకే ॥

1. చ ॥ ; పాద సా | నిపసాస | ; సాని సరిగా | రిమగ రిరిసా సానిరి |
. రా. గ మా | లా. పించి | . వా.గు లా. . | ప్రవ. హిం.. చి.. |

సనని పాద సా | నిపసాస | ; సాని సరిగా | రిమగ రిరిసా సా |
. . . రాగ మా | లా. పించి | . వా.గు లా. . | ప్రవ. హిం.. చి |

; నిసా సారి | సానిరిసాస దానిపపా | ; పదాపమా | గరిమగరిస సా |
. సు ది చు. ట్టు | కొ. . . . లా. . లు | . సురిగి పో | నా. . . యి. కే |

॥ పాడకే ॥

మిగిలిన రెండు చరణాలు పైచరణం మాదిరిగానే పాడాలి.

---

వస్తూండేవాడు. అతను పియానో, కీబోర్డు బాగా వాయించేవాడు. నా ప్రోత్సాహంతో అతను ఆకాశవాణిలో మ్యూజిక్ కంపోజర్ ఆడిషన్‌లో ఉత్తీర్ణుడై ఆ తరువాత పలు కార్యక్రమాలు నిర్వహించాడు. విజయకుమార్ ఈ మధ్యనే మరణించాడని తెలిసి చాలా బాధపడ్డాను.

ఘంటసాల గారి గానం ఎంతగా ప్రజలను ప్రభావితం చేసిందో, చేస్తున్నదో, ఆయన శరీరాన్ని వదలినప్పటి నుండి ప్రతిఏడూ జయంతికీ, వర్ధంతికీ కడు భక్తి శ్రద్ధలతో ఆంధ్రదేశం నలుమూలలా ప్రజలు జరుపుకునే ఉత్సవాలే చాటి చెబుతాయి.

ఆ అమర గాయకునికి జయంతి సందర్భంగా నమస్సుమాంజలులు!

# అడవి బాపిరాజు

**(1895-1947)**

బాపిరాజు 10 అక్టోబర్ 1895లో పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవరం సమీపంలో ఉండే సారిపల్లి గ్రామంలో జన్మించారు. ప్రాథమిక విద్య నర్సాపూర్‌లో, కళాశాల విద్య రాజమండ్రిలోను అభ్యసించారు.



రాజమండ్రి కళాశాల ప్రిన్సిపాల్ కూల్‌డ్రే దొర గారితో పరిచయం బాపిరాజులోని కళాకారుని బహిర్గతం చేసింది.

బాపిరాజులోని భావకవి, చిత్రకారుడు, శిల్ప సంగీతవేత్త, నటుడు, నవలా రచయిత, కథానిక రచయిత వెలికి వచ్చి తెలుగు కళారంగాన్ని సుసంపన్నం చేశారు. కాల్పనికోద్యమ కాలంలో బాపిరాజు శశికళ, గోధూళి తొలకరి, రాగమాలిక, తరంగిణి కావ్యాలు రచించారు. బాపిరాజుగారి 'వరద గోదావరి, గంగిరెద్దు' కృతులలో వర్డ్సువర్త్ ప్రభావం కన్పిస్తుంది.

బాపిరాజు తెలుగు వీరుల జీవితాలు నవలలుగా మలచటంలో సిద్ధహస్తుడని చెప్పవచ్చు. కళామూర్తి, ప్రతిభాశాలి అయిన బాపిరాజు నృత్య, సంగీత, చిత్రలేఖనములను తన నవలల్లో రూపు కట్టించారు. శాతవాహనుల కాలంనాటి కథ 'హిమబిందు' గాను, కాకతీయుల కథ ఇతివృత్తంగా 'గోనగన్నారెడ్డి' గాను మలిచారు. వీరి నవల నారాయణరావు ఆంధ్రవిశ్వ విద్యాలయము వారి బహుమతి పొందింది. బౌద్ధవైదిక పరమైన స్పర్ధలు 'అడవి శాంతిశ్రీ'లో కన్నులకు కట్టించారు. నరుడు, నా పడమటి ప్రయాణం, తుఫాను, కోణంగి, జాజిమల్లి వారి సాంఘిక నవలలు.

బాపిరాజు గొప్పనవలా కారుడే కాదు అద్భుత చిత్రకారుడు కూడా. ఆయన గేయాలు పాటలు నాటి యువతరాన్ని వివరీతంగా ఆకర్షించినాయి. 'నువ్వటే నువ్వటే', 'నా రాణి కళ్ళలో నాట్య మొక్కటి మెరిసె', 'ఉప్పొంగి పోయింది గోదావరి', 'పాడకే నా రాణి' లాంటి మధుర గేయాలెన్నో రచించారు. పిఠాపురం వాస్తవ్యులైన ప్రముఖ వైణికులు శ్రీ సంగమేశ్వర శాస్త్రి గారి వీణావాదనం విని ముగ్ధులై బాపిరాజు గారు 'పలికిస్తివయ్యా నీ బంగారు వీణ, మీటిస్తివా వెలుగు మేళవించిన తంత్రి... సంగమేశా! వీణ శబ్దించు మీలో' అనే పాట రాశారు. ఈ పాట 1960 దశకంలో శ్రీపాలగుమ్మి విశ్వనాథం గారు అభోగి రాగంలో స్వరపరచగా హైదరాబాదులో ఆకాశవాణిలో నేను గానం చేశాను. ఈ పాట బహుళ జనాదరణ పొందింది.

అందరికీ ఘంటసాల ఎలా పాడతారో తెలుసు... ఆయన సంగీతాన్ని ఇచ్చిన సినిమాల్లో పాటలు ఎలా ఉంటాయో తెలుసు. ఆయన మాట్లాడితే ఎలా ఉంటుందో ఆయనతో పరిచయం ఉన్నవారికి, ఆయన ఇచ్చిన రేడియో ఇంటర్వ్యూలు టేపులలో దాచుకున్నవారికి తెలుసు. ఒక రచయితగా ఆయన ప్రతిభ ఎటువంటిదో కొన్ని ప్రైవేటు గీతాలు విన్నవారికి తెలుసు... కానీ... ఒక వ్యాస రచయితగా ఆయన ఎలా రాస్తారో చాలామందికి తెలియదు. తనలోని భావాలను, భాషకు పదును పెడుతూ సంస్కారవంతంగా చెప్పదలచుకున్న విషయాన్ని ఒక నిబద్ధతతో, రాజీపడని తత్వంతో ఆంధ్రపత్రిక (29-3-1963) వారికోసం ఘంటసాల రాసిన ఈ వ్యాసం సంగీత సాహిత్య ప్రియులకు ఆయన జన్మదిన సందర్భంగా ఓ కానుక కాగలదని విశ్వసిస్తున్నాం. 38 ఏళ్ల క్రితం రాసిన ఈ వ్యాసం ఇప్పటి పరిస్థితులకు మాత్రమే కాకుండా భవిష్యత్తులో కూడా ఉపయోగపడే విధంగా ఉండటం ఘంటసాల దార్శనికతకు ఓ నిదర్శనం.

-ఎడిటర్

# సినీ సీమలో సంగీతం

సుమారు రెండు దశాబ్దముల నుంచి సంగీత దర్శకునిగా, నేపథ్యగాయకునిగా సినిమా సంగీత ప్రపంచంలో నేను చేసిన పరిశ్రమకు ఆధారభూతమైన విశ్వాసాలు, తద్భవమైన అనుభవాలు రసికులూ, రసజ్ఞులూ అయిన ప్రేక్షక లోకానికి తెలియజేయడం అప్రస్తుతం కాదనే నమ్మకంతో ఈ మాటలు వ్రాస్తున్నాను. తన సాధనా, కృషి ఫలించాలంటే, సార్థకత చెందాలంటే ప్రతి కళాకారుడూ ప్రజలతో తనకు గల సంబంధాన్ని నిత్యము గుర్తిస్తూ, కళారంగంలో తనకున్న బాధ్యతలను, యెదుర్కొన వలసిన శక్తులను వారికి తెలియజేస్తూ వారినుండి విజ్ఞతా పూరకమయిన సలహాలను, అభిమానోపేత మయిన సానుభూతినీ పొందుతుండటం అవసరమవుతుంది.



ప్రతి జాతి సంస్కృతీ కళారంగంలో తన కృషినీ, ధ్యేయాన్ని, ఒక విశిష్టమైన పద్ధతిని రూపొందించుకొంటుంది. భారతదేశం కూడా సహస్రాబ్దాలుగా లలితకళలన్నిటిలోనూ తన విశిష్టతను అడుగడుగునా ప్రస్ఫుటంగా ప్రకటిస్తూ తన సాధనను కొనసాగిస్తూనే ఉంది.



భారతీయ జీవన రంగంలో సంగీతకళకున్న స్థానం మరే సంస్కృతిలోనూ లేదని చెప్పడం సాహసంకాదు. భారతజాతి అనాదిగా, సంగీతకళను ప్రత్యేకమైన విధానాలతో, విభిన్న మార్గాలలో పయనింపచేసి ఎంతో ఉజ్వలమైన ఫలితాన్ని సాధించింది. సంప్రదాయ సిద్ధమైన ఈ కళావిశేషాన్ని విస్మరించి మనం ఏవిధమైన అభివృద్ధినీ సాధించలేము.

భారతీయ సంగీతం ఎన్ని భిన్న సాంప్రదాయాల్ని అనుసరించినా, ఎన్ని భిన్న రీతుల్ని ప్రదర్శించినా, రససిద్ధిలో ఈ భిన్న ఫణుతులు అవలంబించే మార్గములో ఒక విచిత్రమైన ఐక్యతను ఏర్పరచుకొంది. సూక్ష్మంగా పరిశీలిస్తే, భారతీయ సంగీతంలో ఏ ప్రాంతపుదైనా సరే ఏకత్వం గోచరించక మానదు.

ప్రధానంగా భారతీయ సంగీత ప్రవంతి రెండు రసవాహినులుగా ప్రవహించినది. ఒకటి స్వరరాగ తాళ ప్రధానమైనది. శాస్త్రీయమైన వ్యక్తిత్వాన్ని కలిగినది. నాదోపాసన కుపయుక్తమైనది. రెండవది జీవన శకట ప్రయాణానికి అహరహమూ లయ కలుపుతూ నిత్యజీవితాన్ని సుమధురం

చేసేది. మొదటిది 'మార్గ' సంగీతమని, రెండవది 'దేశి' సంగీతమని పండితులు చెప్పారు. ఒకటి రసాత్మక మైనది. రెండవది భావాత్మకమైనది. ఒకటి స్థితి ప్రధానమైనది, మరొకటి గతి ప్రధానమైనది. జీవితంలోని వైవిధ్యాన్ని తొలగించి ఒకే నాదాత్మలో స్వరాన్ని అనుభవింపజేసేది మార్గ సంగీతమైనది, ఒకే ఆత్మను జీవితంలోని వివిధ రంగాలలో ప్రతిబింబించి హృదయ స్పందనం కలిగించేది దేశి సంగీతం.

మార్గ సంగీత సంప్రదాయ సరళి ఉన్నత వర్గాన్ని ఆకర్షించి రాజాస్థానములలోనూ, దేవస్థానములలోనూ తన ప్రతిభను ప్రసరింపజేస్తే, దేశిసంగీతం ప్రతి పామరుని హృదయ స్థానంలోను సింహాసనం చేసుకొంది. మార్గ సంగీతం భారతీయాత్మతను తాత్వికమైన రసానుభూతితో మైమరపింపజేస్తే, దేశి సంగీతం రసికమైన రస పుష్టితో ప్రజానీకాన్ని మురిపింపజేసింది. ఇందుచేతనే శాస్త్రీయ వాగ్గేయ రచనలలో భక్తిభావానికే అధికమైన ప్రాచుర్యం లభించింది.

ఒక విధంగా అనుకోవచ్చును. శాస్త్రీయ సంగీతం భక్తి భావ పునీతమైతే దేశి సంగీతం నవరసభరితం. జీవితంలోని ప్రతి రసాత్మక సన్నివేశాన్ని తనలో యిముడ్చుకుంది దేశి సంగీతం. ఈ భిన్నరసాల సన్నివేశాలను ఒకే నాదవర్ణంలో చిత్రించినది మార్గ సంగీతం.

ఊడుపుల వేళల్లో పచ్చని పొలాల్లో పనిచేస్తూ, తమ కష్టాన్ని మరచి గొంతెత్తి పాడే పల్లెపడుచుల పాటలలోనూ, నూర్పుల కళ్ళాలలో ఆనందోత్సాహంతో వూగుతున్న రైతు యువకుల పదాలలోను, ఏలేలో పాటలలోనూ, జోల పాటలలోనూ, పెండ్లి పాటలలోనూ, వదినా మరదళ్ళ సరాగాలలోనూ, ఆలూమగల సరసాలలోనూ, అత్తాకోడళ్ళ సంవాదాలలోనూ, నలుగు పాటలలోనూ, తత్త్వ కీర్తనలలోనూ, పడవపాటలలోనూ, యక్షగానాలలోనూ, బుర్రకథలలోనూ, గొల్ల సుద్దులలోనూ వీధి భాగవతాలలోనూ, జముకల పాటలలోనూ వినిపించేది దేశిసంగీతమే.

ఇంతవరకు మన జాతీయ సంగీతం, మార్గ పద్ధతి అయితేనేమి, దేశిపద్ధతి అయితేనేమి, వివిధ శాస్త్రీయ సంగీత రచనల రూపంలోనూ, పద్య పఠన రూపంలోనూ హరికథాది రూపాలలోనూ, పైన చెప్పుకున్న దేశీయ రూపాలలోనూ వ్యక్తమయింది.



ప్రస్తుత నాగరిక జీవన విధానాన్ని బట్టి, పాశ్చాత్య సంగీత ప్రభావాన్ని బట్టి వ్యావహారిక భాషా ప్రభావాన్ని బట్టి, ఒక నూతన సంగీత సంప్రదాయం భారత సంగీతంలో రూపొందించుకొంటున్నది. ఇదే సినిమా సంగీతం. ప్రజా బాహుళ్యంలో సినిమాలకున్న అశేషాదరాన్ని బట్టి, ఈ నూతన సంగీత సంప్రదాయ నిర్మాణం అతి ఉత్సాహంగాను, అతి త్వరితంగాను సాగుతున్నది. కొంతకాలం నిశ్చలంగా ఉన్న మన దేశీయ సంగీతం సినిమా కళయొక్క అభివృద్ధితో నూతనోత్తేజాన్ని పొంది కొత్తరంగులు రంగరించుకొంది.

ఈ నూతన సంగీత సంప్రదాయ నిర్మాణం సినీ సంగీత దర్శకుల ప్రతిభా విశేషాల బట్టి నిర్మింప బడుతున్నదవడం సాహసం కాదు. కారణం ఏమంటే మన మార్గ సంగీతకళ ఏవిధమైన మార్పుల్నీ చేర్పుల్నీ వహించగలిగే స్థితిలోలేదు. ఏ విధమైన పరిణామమైనా, తన విశిష్టతకు భంగం కలిగిస్తున్నదేమో యని భయపడుతున్నది. అందుచేత సంగీతంలో నూతనమైన ప్రయోగాలనూ, వినూత్నమైన విశేషాలనూ, విచిత్రానుభూతులను వివిధ మార్గాలలో అభివృద్ధులను సినీ దర్శకుల నుండీ మాత్రమే దేశం ఆశిస్తున్నదనడం వాస్తవం.

ఇటువంటి పరిస్థితుల్లో సంగీత దర్శకుడు మన జాతీయ ధోరణులైన రసాత్మక ప్రాధాన్యమైన మార్గ సంగీతాన్ని భావాత్మక ప్రాధాన్యమైన దేశిసంగీతాన్ని, విజాతీయ సంగీత రీతుల్ని, తన నూతన సంప్రదాయ సృష్టికి ఉపకరణములుగా తీసుకొంటున్నాడు.

ఈ నూతన సంప్రదాయ నిర్మాణం ఉత్తర భారతదేశంలోనే ప్రారంభించబడినదనటం సాహసం కాదు. సినిమా పరిశ్రమకు పూర్వం కూడా మన నాటక సంగీతంలో పద్యపఠనానికి శాస్త్రీయ సంగీత రాగాలనూ, పాటకు ఉత్తర దేశ లలిత సంగీతరచనలనూ, ఒరవడిగా తీసుకొనడం జరిగింది. అయితే ప్రస్తుతం ఈ సంప్రదాయ నిర్మాణం సినిమా యొక్క పారిశ్రామిక పరిమితుల్ని బట్టి మాత్రమే సాగుతున్నదన్నమాట యధార్థం.

నేటి వరకూ నడచిన సినిమా సంగీతం ఒకమారు సింహావలోకనం చేస్తే తొలినాటి సినిమా సంగీతంలో శాస్త్రీయ సంగీత ప్రభావమే ఎక్కువగా ఉండి రాగ ప్రధాన రచనలే ఎక్కువగా కనబడుతాయి. కాని కాలక్రమాన సంగీత దర్శకులు భాషయొక్క పలుకుబడికీ, నుడికారపు గమనానికీ, భావావేశానికీ దేశి సంగీతమే అనుకూలమైనదని గ్రహించారు. ఈ దేశి రీతిని సినిమా సంగీతంలో మొదట ప్రవేశపెట్టిన మార్గదర్శి నౌషద్ అనే మాట సర్వ జనామోదం పొందుతుందనే నమ్ముతున్నాను. దేశి సంగీత పద్ధతులలో, ప్రతి రసాత్మక సన్నివేశానికీ ఆయన తన సంగీత రచనలతో రూపించిన రాగం తాళముల ప్రయోగం సమకాలిక సంగీత దర్శకులకు స్వీకార యోగ్య మయినది. శృంగారగీతాలు, యుగళగీతాలు, విషాదగీతాలు, ప్రేమగానాలు, బృందగానాలు మొదలైన ఆయన సంగీత రచనలన్నీ ఆయనను నవ్య సాంప్రదాయ నిర్మాతగా నిరూపిస్తాయి.

నౌషద్‌తోబాటు, ప్రతిభావంతులయిన యితర సంగీత దర్శకుల మేధస్సు కూడ

ఈ కొత్త సంప్రదాయాన్ని సముజ్వల పరిచింది. నవ్య సంగీత నిర్మాతలుగా పేర్కొనబడవలసిన వారిలో ప్రధానులు సి. రామచంద్ర, అనిల్‌బిశ్వాస్, పంకజ్ మల్లిక్, వసంతదేశాయి, హేమంత కుమార్, ఓ.పి. నయ్యర్, శంకర్ జైకిషన్లు. మరొక ముఖ్యులు ఎస్.డి. బర్మన్. దక్షిణ దేశంలో స్వర్గీయ సుబ్బరామన్, శ్రీయుతులు రామ నాథన్, కె.వి.మహదేవన్, విశ్వనాథన్ రామ్మూర్తి, ఎస్వి.వెంకటరామన్, సాలూరు రాజేశ్వరరావు, పెండ్యాల నాగేశ్వరరావు మొదలగు వారు గణ నీయులు.



సినిమా సంగీతాన్ని స్థూలంగా పరిశీలించినప్పుడు గేయానికి చెందిన భాగం మన సంప్రదాయాలనూ, చిత్రీకరణకు అవసరమయే నేపథ్య సంగీతం పాశ్చాత్య పద్ధతులను అనుసరిస్తున్నట్టు తెలుసుకొనవచ్చును. గేయ భాగాలలో కూడా విదేశీ సంగీతరీతుల్ని వాడిన సందర్భాలు లేకపోలేదు. అయితే ఈ విధమైన ప్రయోగాల వలన మన జాతీయమైన పలుకుబడికి దూరమై అవాంఛితికి పాల్పడే అవకాశం ఎక్కువగా ఉంది. ఈ విషయంలో సంగీతదర్శకులు శ్రద్ధ తీసుకొనటం ఎంతైనా అవసరం.

అయితే ప్రస్తుత సంగీత రచనా విధానం ప్రయోగస్థితిలో ఉంది. నిర్దిష్టమైన పరిమితుల్ని ఏర్పర్చి ప్రతిభా వంతులైన సంగీతదర్శకుల కృషికి అవరోధం కలిగించే పరిస్థితిలో లేదు.

భారతీయ సంగీత చరిత్రలో జంత్రసమ్మేళన పద్ధతి నూతనమైనది. ప్రాచీన సంగీత రచనలలో ప్రత్యేకించి జంత్రసమ్మేళనకై నిర్దేశింపబడిన స్వర రచనలు కనపడవు. ప్రధానంగా భారతీయ సంగీతం మెలోడి మీద ఆధారపడి ఉంది. ఇది రస నిష్పత్తికి గనుక యుక్తమైన రాగప్రస్తారానికి ప్రాముఖ్యత నిస్తుంది. ఇట్లుకాక పాశ్చాత్య సంగీతం హార్మోనీకి ప్రాధాన్యం యివ్వడం వలన జంత్రసమ్మేళనల విషయంలో పాశ్చాత్య సంగీత కారులు అతి ఉదాత్తమైన ఫలితాలను సాధించియున్నారు. ఈ సమ్మేళన విషయంలో పాశ్చాత్య పద్ధతి నుంచి మనం తెలుసుకొనవలసినది ఎంతో ఉన్నది. వాది, సంవాది, వివాది స్వర ప్రయోగాలలో పాశ్చాత్యులు రసార్ణవం యొక్క అగాధమైన లోతులలోకి పోయారు.

ఈ పరిస్థితులలో భారత సంగీత దర్శకుడు ప్రజారంజన అనే తన లక్ష్యసిద్ధికోసం వివిధ విజాతీయ సంగీత సంప్రదాయాలు సమన్వయం తన కృషిలో భాగంగా తీసుకొంటున్నాడు. ఈ క్రొత్త ప్రయోగాలలో కొన్ని అవాంఛనీయమైన ఫలితాలు రావచ్చును. అందుకు రసికలోకం నిరుత్సాహ పడకూడదు.

సంగీత దర్శకుని బాధ్యత పాటలతోనే తీరదు. చిత్రంలోని ప్రతిసన్నివేశానికి ఆయా రసాలకు తగినట్లుగా నాద రూపమైన వ్యాఖ్య ఇవ్వటం కూడ అతని పనే. ఈ నాదాత్మకమైన వ్యాఖ్యనే రీ రికార్డింగ్ అంటారు. ఈ రీ రికార్డింగ్‌లో వినపడే నేపథ్య సంగీతం ఒక సంగీత దర్శకుని ప్రతిభకు దర్పణం వంటిది. రసాత్మకమైన సన్నివేశాలకూ ఆయా రసోత్పన్న శక్తిగల ఈ సంగీత వ్యాఖ్యను సృష్టించటానికి ఎంతో భావనాశక్తి, కాలజ్ఞానమూ, అనుభవమూ అవసరం. అసమర్థమైన రీ రికార్డింగ్ చిత్రాన్ని పేలవంగా తోపింపజేస్తుంది. ప్రజ్ఞా వంతమైన రీ రికార్డింగ్ బలహీనమైన సన్నివేశాన్ని కూడ చిత్రంలో కుదుట పర్చగలదు.

ఎంతో ప్రతిభ, వ్యుత్పత్తి, అనుభవమూ కలిగిన సంగీత దర్శకుని కృషి కూడా వ్యక్తిగతమైన ఉదాత్త కళ లోపం వలన ప్రజాభిరుచికి దూరమయే అవకాశం ఉంది. అందుచేత సంగీత దర్శకుడు తన స్వంత కళాభిరుచితో బాటు, ప్రజాభిరుచి, చిత్ర పరిశ్రమ యొక్క ఆర్థిక నిబంధనలనీ గుర్తు పెట్టుకొనవలసి ఉన్నది.

నేపథ్య గాయకునిగా నాకు గల అనుభవాన్ని బట్టి నాలుగు మాటలు చెప్పవలసి ఉంది. నేపథ్య గాయకునికి శ్రావ్యమైన కంఠస్వరమూ, వివిధ సంగీత గమకములను పలికించగల శక్తితో బాటు రసభావములకు అనుగుణ్యమైన నాదోత్పత్తి, సుస్పష్టమైన ఉచ్చారణ, కంఠస్వరము యొక్క పట్టు విడుపులు తెలియడం చాలా అవసరం. తన భావాలను పోషించగల గాత్ర శైలి యే శాస్త్రములోను, యే పారిభాషిక పదాలలోను నిర్వచించబడనిది. అనుభవమే గురువుగా తనకు తానై తెలుసుకోవలసినది. నా భావనలో నేపథ్య గాయకునికి సంగీత హృదయంతోబాటు కవి హృదయము, కంఠస్వరములోని మెళకువలతోనే నటించగల నటనా కౌశల్యము కూడా అవసరం.

వృత్తినిబట్టి నేపథ్య గాయకుని బాధ్యత యింకా ఉన్నది. తన నుండి ఉత్తమ ఫలితాన్ని ఆశించే సంగీత దర్శకుల భావనకు అనుగుణంగా రస సంపూర్ణ సహకారం ఎంతో సద్భావంతో ఇవ్వవలసి ఉంది. ఈ సందర్భంలో వివిధ సంగీత దర్శకుల ప్రతిభాన్వితములైన సంగీత రచనలను తమ గాత్ర మాధుర్యంతో రసికలోకానికి అందించిన ఉత్తమ గాయకులు ప్రశంసార్హులు లతామంగేష్కర్, గీతాదత్, షంషాద్, ఆశా, మహమ్మద్‌రఫీ, తలత్ మహమ్మద్, మన్నాడే, ముఖేష్ మొదలగు ఉత్తరదేశ గాయకులు, సుశీల, లీల, జానకి, సౌందర్య రాజన్, గోవిందరాజన్, జయరామన్, లోకనాధన్, శ్రీనివాస్, రాజా, మాధవపెద్ది, పిఠాపురం మొదలగు దక్షిణ దేశగాయకులు సినీసంగీత సీమకు వరప్రసాదులుగా భావించవలసి ఉంది.

కళాకారునిగాను అనుభవాన్ని బట్టి నాగాఢ విశ్వాసాన్ని తెలియజేసేమాట ఒకటి చెప్పవలసి ఉంది. కళాకారుని నుండి వ్యక్తమయే కళాకాంతిలో అతడు జీవితంలో పొందిన అనుభవాల గాఢత్వము, తీవ్రత, ప్రతిబింబించక మానవు. భావతీవ్రత, ఆర్ద్రత లేని హృదయం నుండి ఉత్తమమైన కళ వ్యక్తమయే అవకాశం లేదు. అందుచేత కళాకారుడు కళా సాధనతో తుల్యంగా జీవిత అనుభవాల నుండి ఉన్నతమైన హృదయ సంస్కారాన్ని కలిగించుకోవలసి ఉంది.

ప్రజల ఉత్తమమైన అభిరుచులతో, విజ్ఞత, బాధ్యత, సానుభూతితో కూడిన సద్విమర్శతో ప్రతిభావంతులైన సంగీత దర్శకుల ప్రజ్ఞా విశేషంతో, నేపథ్యగాయకుల నైపుణీరాగంతో మన క్రొత్త సంగీత సంప్రదాయం ఎంతో వృద్ధిని, ఉత్తేజాన్నీ పొందగలదని నా అచంచల విశ్వాసం.

**-ఘంటసాల**

హైదరాబాద్ ఉస్మానియా ఆసుపత్రి నుంచి ఘంటసాల సావిత్రమ్మ గారికి వ్రాసిన ఉత్తరం

**GHANTASALA**
Music Director & Playback Singer

36, USMAN ROAD, T. NAGAR, MADRAS-17.

హైదరాబాదు
15/9/72

నా ప్రియమైన [illegible]

[illegible]

ఘంటసాల.

ఘంటసాల గారు రాజమండ్రి, గుడివాడ, బళ్ళారి జైళ్లలో మొత్తం 18 నెలలు జైలు శిక్ష అనుభవించారు. బళ్ళారి జైలులో ఉన్న సర్టిఫికెట్ మాత్రమే పొందుపరుస్తున్నాము.

No.RB/ 5704 /72.

Office of the Superintendent,
Central Jail, Bellary,
Dated 17.8.72

To
Sri/Madam, Ghantasala Venkateswara Rao S/o Suryanarayana
Music Director, 35 Usman Road, T. Nagar
Madras-17. Tamilnadu State

Sub: Political Sufferers-Conviction particulars of Sri. Ghantasala Venkateswara Rao. furnished.
Ref:- Your letter No. nil dated 31-7-1972

With reference to the above, I am herewith furnishing the conviction particulars as entered in the Convict Register (Convict Admission Register) of Allipuram Camp Jail/~~Central Jail~~, Bellary vide Admission Book No. 13 Page No. 87.

Extract of Column No. 1 to 3, 8 to 13, 18 to 21 and 29 of the Admission Register:

1. Register No. — 7460 [C.D.M]
2. Name of Prisoner with that of father or husband (if female) — Ghantasala Venkateswara Rao son of Suryanarayana
3. Date of admission to Jail: — 24-4-43.
4. Previous Occupation: — Music - Teacher.
5. Residence, town or village Taluk & District: — Chowtupalli - Gudivada - Kistna
6. Age: — 22 Years
7. Description with height and marks of identification: — 5'-3½"
   1. Two scars on the lower part of forehead.
   2. A mole above the outer third of left clavicle
   3. A mole on the outer side of right eye
8. Section & Code under which imprisoned. — Sec 14 I.P.C and rule 35(4) of D.I. Rules
9. Calender No. of cases and sentencing authority. — C.C. 100/42; Special Magt Gudivada.
10. Sentence or order: — Total Sentence - Six months (c) R.I. (small)
11. Date of sentence or order: — 19-4-43
12. Date of release or disposal: — 30-9-43 Remission earned 18 days

Superintendent,
Central Jail, Bellary. 17/8/

GHM/

(శ్రీమతి ఘంటసాల సావిత్రిగారి సౌజన్యంతో)

# 1961-70



# శివ శంకరీ...



ఆలాపన: ఆ ... ... ...

పల్లవి: శివశంకరీ
శివశంకరీ శివానందలహరి
శివశంకరీ శివానందలహరి
శివశంకరీ
శివానందలహరి శివశంకరీ

చరణం: చంద్రకళాధరి ఈశ్వరీ....
చంద్రకళాధరి ఈశ్వరీ
కరుణామృతమును
కురియజేయుమా
మనసు కరుగదా మహిమ జూపవా
దీనపాలనము చేయవే
శివశంకరీ
శివానందలహరి శివశంకరీ
శివశంకరీ శివానందలహరి
శివానందలహరి శివశంకరీ
శివశంకరీ శివానందలహరి శివశంకరీ
శివశంకరీ
శివానందలహరి
శివశంకరీ
చంద్రకళాధరి ఈశ్వరీ
రిరి సని దనిసా మపదనిసా
దనిసా దనిసా దనిసా
చంద్రకళాధరి ఈశ్వరీ
రిరి సనిపమగా రిసధా నీరీనీసా
రిమపదా మపనిరి నిసదప
చంద్రకళాధరి ఈశ్వరీ
దనిస మపదనిస
సరిమగరిమపని దనిస
మప నిరి సరి నిస దనిప
మపనిసరీసని సరిగా రిస రిరి సని
సనిపనిపమ పమ గమరిసనిస
సరిమపనిదానిస
సరిమపనిదానిస
సరిమపనిదానిస
చంద్రకళాధరి ఈశ్వరీ
ఆ....

చంద్రకళాధరి ఈశ్వరీ
శివశంకరీ...
శివశంకరీ....
తోం తోం తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిర్ద్రి యానా దరితోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిరిదిరి తోం తారీయానా
దిరిదిరి తోం తోం తోం దిరిదిరి తోం
తోం తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం దిరిదిరి
తానా దిరితోం
దిరిదిరి దిరిదిరి దిరిదిరి దిరిదిరి
నాదిరి దిరిదిరి దిరి దిరిదిరి దిరి
నాదిరి దిరిదిరి తోం దిరిదిరి దిరి
నాదిరి దిరిదిరి తోం
నినినిని నినినిని దనిని దనినిని దప
పసస నిససనిద నిరిరి సరిరి సని
సగగ రిగగ రిస
సరిరి సరిరి సని
నిసస నిసస నిద
దనిని దనిని దప
నినిదద ససనిని రిరిసస గగరిరి
గగ సస రిరి నిని సని రిరి సస సస
రీరిరీరిరి నినినిరీరిరిరి నినినిగాగగగ
నినిని రీరిగరిమా
రిమరి సరిసనిసని పనిప మపమరిగా
సరి సస మపమమ సరిసస ససస
సరిసస పనిపప సరిసస సససస
మపమమ పనిదద
మపమ పనిద మపమ పనిద
పదపప సరిసస
పదప సరిస పదప సరిస
మమమ పపప దదద నినిని
ససస రిరిరి గరిసనిసరిపా
॥శివశంకరీ॥

తెలుగు చలన చిత్ర సంగీత చరిత్రలో ఉదాత్తమైన గీతాలు, ప్రామాణికమైన గీతాలు వచ్చిన సంవత్సరాల్లో 1961 ఒకటి. ఆ సంవత్సరం విడుదలైన చిత్రాలలో విజయావారి 'జగదేకవీరుని కథ' చిత్రాన్ని సంగీత ప్రియులెవ్వరూ మరచిపోలేరు. ఆ చిత్రంలో 'శివశంకరీ శివానందలహరి' పాట - ఆ పాటతో సంబంధం ఉన్న ప్రతి ఒక్కరి జీవితంలోనే కాకుండా తెలుగువారికి కూడా ప్రతిష్ఠాత్మకంగా నిలిచింది.

ఆ పాటకు సంబంధించిన వివరాలివి:

'శివశంకరి' పాట స్వరపరచటానికి ముందే 'జగదేకవీరుని కథ' చిత్రంలోని మిగతా పాటల రికార్డింగు, పిక్చరైజేషనూ కూడా అయిపోయింది. క్లయిమాక్స్ షూటింగ్ ఇంకా రెండు నెలలుందనగా దర్శకుడు కె.వి.రెడ్డి, సంగీత దర్శకుడు పెండ్యాలను పిలిచి 'నాగేశ్వరరావు గారూ! ఇప్పుడు మీరు చేయబోయే పాట పిక్చర్‌కి ప్రాణం వంటిది. పూర్వం నారదుడు, తుంబురుడు వాదించుకుంటుంటే హనుమంతుడు పాడితే శిలలు కరిగాయట. ఈ యుగంలో కూడా తాన్‌సేన్ పాడితే దీపాలు వెలిగాయట, అంతెందుకు మన కళ్ళముందే బీహార్ రాష్ట్రం క్షామంతో తల్లడిల్లిపోతుంటే పండిట్ ఓంకార నాథ్‌ఠాకూర్ వరుసగా ఆరు రోజుల పాటు 'మేఘ్‌మల్హార్' రాగం పాడి వర్షాలు కురిపించి చరిత్ర సృష్టించ లేదూ....! సో.... సంగీతానికున్న శక్తి అపారం. అసలు రిథమ్‌కు ఎంత శక్తి ఉందంటే.... ఆర్మీ ఒక బ్రిడ్జ్ మీద ఒకే రిథమ్‌లో మార్చ్ చేసుకుంటూ వెళితే ఆ బ్రిడ్జి కూలిపోతుంది తెలుసా....!? అందుకే బ్రిడ్జిల మీద ఆర్మీ చేత చెల్లాచెదురుగా నాన్ రిథమేటిక్‌గా నడిపిస్తారు. ఆర్మీలో ఉండేటప్పుడు నీగ్రో సింగర్ పాల్ రాబ్సన్ పాడుతూ ఒక మ్యూజికల్ నోట్ దగ్గర తన వాయిస్‌ని సస్టెయిన్ చేస్తే ఆ పవర్‌కి గ్లాసులు పగిలిపోయేవి. కరెక్టు స్పాట్లో కరెక్ట్ నోట్ గనుక పడితే మీ ముందున్న హార్మోనియం కూడా లేచి నాట్యం చేస్తుందండి...' అంటూ అన్ని ఉపమానాలు చెప్పేసరికి పెండ్యాల వారికి గుండె అదిరిపోయింది. అంత ఎఫెక్ట్‌ని ఎలా తీసుకురావాలా అని ఆలోచిస్తుండగా ఇంకో మాట అన్నారు కె.వి.రెడ్డి, "మామూలు లైట్ సాంగ్స్‌లో మా కోరికలు, సలహాలు చెప్పగలం.... ఇది కేవలం శాస్త్రీయ సంగీతంతో

| | |
|---|---|
| బ్యానర్ | : విజయా |
| చిత్రం | : జగదేకవీరుని కథ (1961) |
| దర్శకుడు | : కె.వి.రెడ్డి |
| సంగీత దర్శకుడు | : పెండ్యాల |
| గీత రచన | : పింగళి నాగేంద్రరావు |
| గానం | : ఘంటసాల |
| అభినయించినది: | యన్.టి.రామారావు<br>జూ. ఎ.వి. సుబ్బారావు |



( ఈ పాట గురించి పెండ్యాల తను చనిపోవడానికి వారం పదిరోజుల ముందు స్వహస్తాలతో ఒక అభిమానికి రాసిన ఉత్తరంలోని కొంత భాగమిది)

సృష్టించవలసిన ఎఫెక్ట్... మేం మాట్లాడగలిగేది ఏమీ లేదు. మీరు తయారు చేస్తే విని బాగుందో లేదో చెప్పడమే మా పని. ఇక్కడ (మద్రాసులో) ఇప్పుడు 'జగదల ప్రతాపన్' అనే సినిమా ఆడుతోంది. మన కథకు బేస్ అదే. కావాలంటే వెళ్లి చూడండి" అంటూ చెప్పారు, "వద్దండీ... చూస్తే ఆ ప్రభావం నా ఫ్లోకి అడ్డురావచ్చు, మనమే తయారుచేద్దాం, నా శాయశక్తులా ట్రై చేస్తాను" అన్నారు పెండ్యాల.

మరునాటి సిట్టింగ్‌లో చిన్న పేపరుమీద 'శివశంకరీ శివానందలహరి' అంటూ రాసి కె.వి.రెడ్డిగారికి చూపించారు పింగళి నాగేంద్రరావు. దానికాయన 'బాగుందండీ...' అంటూ పెండ్యాల గారి కిచ్చారు. ఆ కాగితాన్ని అలా ఇస్తూ 'ఆర్తి బాగా కనబడాలి... మీ ఇష్టమొచ్చిన రాగాల్లో వినిపించండి" అన్నారు. పెండ్యాల బాగా ఆలోచించి ముల్తానీ, ఘూర్జరీ, తోడీ, కాళింగడా, దర్బారీ, అసావేరి రాగాలలో ఆ పల్లవిని పాడి వినిపించారు. కె.వి.రెడ్డిగారికి, పింగళి నాగేంద్రరావు గారికి దర్బారీ రాగంలో చేసిన ట్యూనే నచ్చింది. మిగతా చరణం తర్వాత రాసిస్తానని మర్నాటికే తెచ్చారు పింగళి. 'నాగేశ్వరరావుగారూ.... మొత్తం పాటంతా మీ చేతికొచ్చింది..... ఇక మీ ఇష్టం.. మీరెప్పుడు ఫోన్ చేసి వినిపిస్తానంటే అప్పుడే నెక్స్ట్ సిట్టింగ్" అన్నారు కె.వి.రెడ్డి. సరేనని ఓ పదిహేను రోజుల పాటు ఇంటివద్దే కూచొని స్వరరచన ముగించి 'పాట రెడీ సార్' అన్నారు పెండ్యాల. ఆ మర్నాడు కూర్చున్నారంతా.... పెండ్యాల పాడడం ప్రారంభించారు. అందరూ వింటున్నారు. తల, కాళ్ళు, చేతులూ అందరూ రిథమాటిక్‌గా ఊపుతున్నారు. అది చూసి పెండ్యాల మరింత ఉత్సాహంతో పాడేరు. పాట పూర్తయిన కొంత సేపటి వరకూ నిశ్శబ్దం. 'నాగేశ్వరరావు గారూ.... పాట చాలా బావుంది, బాగా కష్టపడి చేశారు.... కానీ....' అంటూ ఆగారు కె.వి.రెడ్డి. దాంతో గుండాగినంత పనైంది పెండ్యాల గారికి... 'ఏవయిందండీ...' అంటూ అడిగారు జంకుతూనే. "ఏం లేదండీ.... టైం చూసుకున్నారా.... పదమూడు నిమిషాలు... పదమూడు నిమిషాలపాటు తెరమీద ఏం చూపించమంటారు. మమ్మల్ని!? తగ్గించక తప్పదు. అరున్నర నిమిషాలు మేగ్జిమమ్.... అంతే....' అన్నారు. కె.వి.రెడ్డి. 'సరే సార్ ఫిల్టర్ చేస్తాను' అంటూ మరో నాలుగు రోజులు కష్టపడి పాటని చిత్రికపట్టి ఆ తర్వాత వినిపించారు పెండ్యాల. దానికి బాగా సంతృప్తి చెంది ఘంటసాల గారిని పిలిపించి' నాగేశ్వరరావు గారూ.... పాడవలసినవారు ఈయన. ఆయనకు వినిపించండి' అన్నారు. పాట వినగానే 'బ్రహ్మాండం బాబూ.... ఈ పాట కోసం నేను పదిహేను రోజులైనా సరే రిహార్సలుకి వస్తాను. బాబూ..... బాగా పాడతాను' అన్నారు ఘంటసాల. అలాగే వచ్చి సాధన చేశారు కూడా. రికార్డింగ్ అయ్యాక పాటను విన్న యన్.టి.ఆర్. 'హిందూస్థానీ విద్వాంసులు పాడుతున్నప్పుడు, వాయిస్తున్నప్పుడు కొన్ని కొన్ని విన్యాసాలు చేస్తారు. మాస్టారితో పాటు కూచుని అవన్నీ ప్రాక్టీస్ చేస్తాను" అన్నారు. అలాగే నాలుగు రోజులు రిహార్సల్సు చేయటమే కాకుండా, 'మాస్టారూ..... షూటింగ్ టైమ్‌లో కంప్లీట్‌గా మీరు సెట్ మీదే ఉండాలి" అన్నారు పెండ్యాల గారితో. అలాగే ఉన్నారు పెండ్యాల. వారం రోజుల పాటు ఆ పాట షూటింగ్ జరిగింది. పాట మొత్తంలో ఎక్కడా ఒక దగ్గర కూడా తొట్రుపాటు లేకుండా, తడబడకుండా ఎ టు జెడ్ బైహార్ట్ చేసి లిప్‌మూవ్‌మెంటు ఇస్తూ రకరకాల విన్యాసాలతో ఎన్.టి.ఆర్. నటించిన విధానానికి షూటింగ్ టైమ్‌లో ఉన్నవారు, విజిటర్స్‌గా వచ్చిన వారు ఆశ్చర్యపోయేవారు. ఆ తర్వాత ఈ పాట ఎంతటి చరిత్రను సృష్టించిందో....అది అందరికీ తెలిసిన విషయమే.

## కామెడీ స్కిట్



# వెల్‌విషర్

**- రాజా**

**ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా ధారావాహికంగా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్‌లలో తొలియత్నమిది.**

**సెట్‌కి అవతల జూనియర్ వేణుమాధవ్ స్క్రిప్ట్ చదువుతూ ఉంటాడు,**

**యమ్మెస్. నారాయణ : (డైరెక్టర్స్ హ్యాట్‌తో వచ్చి జూనియర్ వేణుమాధవ్ భుజంతడుతూ) వేణూ... వేణూ...**

**వేణుమాధవ్ సీరియస్‌గా స్క్రిప్ట్‌లో రాసినవన్నీ వచ్చాయో లేదో లెక్క చూసుకుంటూ, భుజంమీది చేతిని విదిలించుకుంటూ, పట్టనట్టుగా పొయ్యిలో బొగ్గులు రాజేస్తూ, గొట్టంతో ఊదుతూ, విసనకర్రతో విసురూ ఉంటాడు.**

యమ్మెస్ : (వ్యంగ్యంగా) సార్... సార్

వేణు : ఏస్

యమ్మెస్ : ఓసారిటు చూస్తారా సార్...

వేణు : సారీ... పనిలో ఉన్నాను... తర్వాత కనబడండి...

యమ్మెస్ : అది కాద్సార్... ఈ సినిమాకి డైరెక్టర్ ఎవరండీ?

వేణు : ఉన్నాడ్లే... యమ్మెస్ నారాయణ అని... ఒకప్పుడు కమేడియన్...! డైరెక్టర్ అయితే ఇంకాబాగుపడతావురా కృషి చెయ్యిరా పైకొస్తావు అని నేనే ఎంకరేజ్ చేశాను. ఇదే తన ఫస్ట్ ఫిల్మ్! పాపం స్క్రిప్ట్ కూడా తనే రాసుకున్నాడు పిచ్చాడు.

యమ్మెస్ : ఇంతకీ మీరు...

వేణు : అసిస్టెంట్ డైరెక్టర్... (అంటూ ఇటు తిరుగుతాడు.)

(వేణుమాధవ్‌కి ముఖం కనబడకుండా టోపీ అడ్డం పెట్టుకుంటాడు యమ్మెస్)

(మళ్ళీ పొయ్యి ఊదుతూ) పేరుకి అసిస్టెంట్నే గాని డైరెక్షన్ అంతా మన్దే!

యమ్మెస్ : అయితే చాలా బిజీ అన్నమాట




**రాత్రి పూట తిరిగే గబ్బిలాయిని పెంపుడు పావురంలా మార్చే ప్రక్రియ**





వేణు : యా...! యమా బిజీ, పిచ్చ బిజీ, బిజీ బిజీ...
యమ్మెస్ : గజి బిజి కూడానా అండీ?
వేణు : యా...! (ఉలికిపడి) ఏయ్ ఎవరయ్యా నువ్వు...?
యమ్మెస్ : (టోపీ తీసి) నన్నే వెక్కిరిస్తావు రా..!?
వేణు : మీరా సార్... ఎక్స్యూజ్ మి...

యమ్మెస్ : ఇప్పుడర్థం అయింది నాకు-డైరెక్టర్లు టోపీ ఎందుకు పెట్టుకుంటారో
వేణు : ఎందుకు సార్!?
యమ్మెస్ : నీలాంటి అసిస్టెంట్ డైరెక్టర్లు టోపీ పెట్టకుండా... అర్థం అయిందా..!?
వేణు : సారీ సార్
యమ్మెస్ : ఏదో... అసిస్టెంట్ డైరెక్టర్‌గా అనుభవం ఉందన్నావని, ఇదినా ఫస్ట్‌ఫిల్మ్ అని నిన్ను పెట్టుకుంటే నా గొంతును గుర్తు పట్టకపోతే పోయావు. ఇలా తక్కువచేసి మాట్లాడతావా... అదీ పరోక్షంగా...!
వేణు : సారీ సార్... ఇక నుంచి ఏదైనా సరే... ఎదురుగానే అంటాను.
యమ్మెస్ : ఏయ్... తమాషాగా ఉందా... పిచ్చి పిచ్చి వేషాలేసేవంటే హైదరాబాద్ ఆటో ఎక్కించగల్ను జాగ్రత్త
వేణు : అమ్మో అంత శిక్షొద్దు సార్... మీరు చెప్పినట్టే చేస్తాను
యమ్మెస్ : అలారా దారికి... అంతా రెడీయా...
వేణు : ఎవ్రీ థింగ్ రెడీ సార్...
యమ్మెస్ : మరీ బొగ్గులు, పొయ్యి ఏంటీ?
వేణు : అదేంట్సార్ అలా అంటారు మీరే కదండీ స్క్రిప్ట్‌లో రాశారు.
యమ్మెస్ : నేను రాశానా... ఏదీ?
వేణు : ఇదిగో... ఇక్కడ... ఈ డైలాగు ఎదురుగా... 'కోపంతో నిప్పులు తొక్కుతూ' అని రాయలేదూ మీరు?
యమ్మెస్ : ఆహా!? పాపం హీరో...
వేణు : యస్సర్
యమ్మెస్ : ఇక్కడొచ్చి...
వేణు : యస్సర్
యమ్మెస్ : ఈ నిప్పులు తొక్కుతూ యాక్ట్ చెయ్యాలి...
వేణు : ఫెర్‌ఫెక్ట్ సార్
యమ్మెస్ : ఓహో... ఎంత గొప్పవాడివి తండ్రీ... ఎంత చక్కగా అర్థం చేసుకున్నావు!? నీకు తెలుగు నేర్పిన మాష్టారు ధన్యుడు... పరమానందయ్య శిష్యుడి ప్రతిరూపానివిరా నువ్వు
వేణు : అర్థంకాక పోయినా థాంక్యూసార్... అయినా నన్ను మరీ అంత తీసెయ్యకండి సార్




**పువ్వులమ్మేవాడి దగ్గర ఖాతా**
**పప్పులమ్మే వాడికి బదిలీ కావడం**



యమ్మెస్ : మరెంత తీసెయ్యాలో చెప్పు... ఇప్పుడే తీసేస్తాను (పాజ్ ఇచ్చి) నీ కాలు

వేణు : అలా తీసివేతలు, కూడికలు, భాగాహారాలు, గుణకారాలు, మిరియాలు, ధనియాలు, ఏలకులు, జీలకర్ర, లవంగాలు, జాజికాయ, జాపత్రి...

యమ్మెస్ : ఏయ్... ఏయ్... ఏంటా పిచ్చివాగుడు

వేణు : సారీ సార్... చమత్కారం చెప్పకుండా తన్నుకొచ్చేసింది.

యమ్మెస్ : ఓహో... (బుగ్గ నొక్కుతూ) చమత్కారం కూడానా చిలిపి...!?

వేణు : (ఆనందంతో మెలికలు తిరిగిపోతూ) థాంక్యూ సార్

యమ్మెస్ : ఛవ్... రాసింది సరిగ్గా అర్థం చేసుకోవడం చేతకాదుగాని చమత్కారంట చమత్కారం

వేణు : అదికాదా్సర్... నన్నర్థం చేసుకోండి... తెలుగు భాషంటే నాకు ఇష్టమే!

యమ్మెస్ : ఆహా! (వ్యంగ్యంగా)

వేణు : నిజం సార్... మా అంకులొకాయన ఉన్నాడు...

యమ్మెస్ : చిన్నాన్నా... మావయ్యా?

వేణు : రెండిటికీ అనుకూలంగా ఉంటుందనే అంకుల్ అనేశాను షార్ట్‌కట్‌లో

యమ్మెస్ : సింగిల్ ఎపిసోడ్ పాయింట్‌ని డెయిలీ సీరియల్‌లా -లాగొద్దు.. త్వరగా తెముల్చు-ఏమయింది ఆ అంకుల్‌కి

వేణు : అతనికేమీ కాదు సార్... అతనికి ఎదురుపడ్డవాళ్ళకే కాలుతుంది... ఖర్మ...!

యమ్మెస్ : అంటే...!?

వేణు : అతను తెలుగు భాష మీద మమకారంతో ప్రతీదీ అర్థంకాని లెవెల్లో మాటాడే వాడు. రైల్వే టికెట్ కౌంటర్ అనడానికి ధూమ శకట అనుమతి పత్ర విక్రయశాల అనేవాడు. అతనికి భయపడి అందరు దూరంగా పారిపోయేవారు. అలా అయిపోతానేమోనన్న భయంతో, ఉద్యోగం పోగొట్టుకుంటానేమోనన్న బెంగతో తెలుగు భాషకి కాస్త దూరంగా ఉంటున్నాన్సార్...

యమ్మెస్ : ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్... తెలుగు సినిమా... దర్శకత్వశాఖలో ఉంటూ తెలుగు తెలియక పోతే ఉద్యోగం పోగొట్టుకుంటావ్ తెలుసా



వేణు : ఇప్పటిదాకా తెలీదు సార్... కానీ తెలుగు ఎక్కువగా తెలియటం వల్ల ఉద్యోగం పోగొట్టుకున్న మా కజిన్ కథ మాత్రం తెలుసు

యమ్మెస్ : కజినా...? చిన్నాన్న కొడుకా... మావయ్య కొడుకా...

వేణు : ఆ కన్‌ఫ్యూజన్ ఈసారి లేకుండా ఉండడానికే కజిన్ అన్నా




ఫస్టు చాప్టర్‌లోనే హీరో ఇంపార్టెన్స్ తగ్గిపోయే లవ్‌స్టోరీ



కట్ షార్ట్ చేసేసి

యమ్మెస్ : ఆహా... అంకుల్ అంటే చిన్నాన్నయినా కావచ్చు, మావయ్యైనా కావచ్చు కజిన్ అంటే వాడి కొడుకైనా కావచ్చు, వీడి కొడుకైనా కావచ్చు. భయంకరమైన లారీలా డాష్ ఇచ్చేసి సారీ అనొచ్చు ఎంత హెల్ప్ అయినా తీసేసుకొని థాంక్స్ అని కట్ చేసెయ్యొచ్చు. హుఁ... తప్పించుకోడానికి తెల్లవాడి తంత్రం తర్వాతే ఏదైనా? హీరోగారు రావటానికి చాలా టైమున్నట్టుంది ఈ లోగా సందేహం వచ్చినప్పుడల్లా అడుగు.

వేణు : థాంక్యూ సర్... థాంక్యూ... ఇప్పుడొచ్చేసింది ధైర్యం... నిజం చెప్పేస్తున్నా... మీరు స్క్రిప్ట్‌లో రాసినవన్నీ పట్టుకొచ్చేను... ఒక్కటి మాత్రం అర్థంకాక ఎక్కడ దొరుకుతుందో తెలీక తీసుకురాలేదు.

యమ్మెస్ : అంత దొరకని వస్తువులేవీ నేను స్క్రిప్ట్‌లో రాయలేదే... ఏంటదీ...!?

వేణు : 'తటపటా' అండి

యమ్మెస్ : తటపటానా.... అదెక్కడ రాశాను?

వేణు : అదిగో అదే...! ఇందాక్కూడా అలాగే అన్నారు, చూడండి... ఇక్కడ మీరు రాశారో లేదో... హీరోయిన్‌తో హీరో చెప్పే ఈ డైలాగుకి ముందు 'తటపటాయిస్తూ' అని రాయలేదూ మీరు... ఆ తటపటాని హీరోయిన్‌కి హీరో ఇవ్వాలంటే నేను పత్రావాలా వొద్దా..!? ఇంతకీ ఏంటిసార్ అది... గులాబీ పువ్వు... చేమంతి పువ్వు... లాగ అదేమైనా పువ్వా...

యమ్మెస్ : అవున్రా... అదో కొత్తరకం పువ్వు... చెవిలో పువ్వు...! ఖర్మరా బాబూ ఖర్మ... తటాపటాయిస్తూ- అంటే జంకుతూ, సంకోచంతో, కొట్టుమిట్టాడుతూ అని అర్థం! అర్థం అయిందా?

వేణు : అయింది సార్... కొట్టు మిట్టాడుతూలో- కొట్టు- అంటే షాపు అని అర్థంకదూ సార్

యమ్మెస్ : కాదురా నా బుర్ర బద్దలు కొట్టూ అని అర్థం.

వేణు : అబ్బా... మీనింగులో అంత డిఫెన్సు ఉందా

యమ్మెస్ : డిఫెన్సా... డిఫెరెన్స్‌రా బాబూ డిఫరెన్స్

వేణు : అదేంటసార్... రెండూ షేమ్ కాదా

యమ్మెస్ : షేమా... ఓరి దేవుడా...! ఎందుకురా... ఎందుకురా నన్నిలా చిప్స్ నమిలినట్టు నమిలేస్తున్నావు

వేణు : అలా ఇరిగేట్ అయిపోతారేంటి సార్

యమ్మెస్ : ఇరిగేటా...!? ఇరిటేట్‌రా... ఇరిటేట్...! కూర్చో... ఇక హీరో వచ్చినా సరే కాల్షీట్ వేస్ట్ అయినా సరే... ఓ మాటకి ఇంకో మాట వాడితే ఎలా ఉంటుందో నువ్వు తెలుసుకు తీరాల్సిందే అర్థం అయిందా?

వేణు : అయింది సార్...

యమ్మెస్ : హమ్మయ్యా... ఇంకేమైనా ఉంటే ఇప్పుడే అడిగెయ్

వేణు : ఒక్క చిన్న డౌటుండి పోయింది సార్

యమ్మెస్ : అడుగు

వేణు : ఇక్కడ స్క్రిప్ట్‌లో 'హీరో ఆ ఇంటికి రాగానే' తలుపులకు వేసి ఉన్న తాళం వెక్కిరిస్తూ కనిపించింది' అని రాశారు మీరు... కదూ సార్

యమ్మెస్ : కరెక్ట్ కరెక్ట్

వేణు : అదెలా తీద్దాం అనుకుంటున్నార్సార్... తాళం క్లోజప్‌లో షూట్ చేస్తే వెనకనుంచి 'వెవ్వెవ్వే' అంటూ వాయిస్ వచ్చినట్టుగా మిక్స్ చేద్దామా లేకపోతే ఓ నాలిక తాళం లోంచి 'ఛ్' అని బైటికి వచ్చినట్టుగా గ్రాఫిక్స్ చేద్దామా?

యమ్మెస్ : రామచంద్ర ప్రభో! ఒరేయ్... పూర్వజన్మలో నేనేం పాపం చేసుంటానంటావ్?

వేణు : పొండి సార్ మీరు మరీనూ... మీ సీక్రెట్ వ్యవహారాలు నాకెలా తెలుస్తాయి... అదీ పూర్వజన్మలోవి... భలేవారు సార్...

యమ్మెస్ : ఒరేయ్ నిజంగా నన్ను మింగెయ్యడానికి వచ్చిన రాహువువో తిమింగలానివో రా నువ్వు...

వేణు : సార్ సార్ నన్ను మరీ అంత ద్రోహిగా అనుకోకండి సార్

యమ్మెస్ : మరి ఎంత ద్రోహివి అనుకోవాలో నువ్వే చెప్పు...

వేణు : నన్నర్థం చేసుకోడానికి ట్రైచెయ్యండి సార్... అప్పుడు తెలుస్తుంది నేను మీ పట్ల ఎంత సిన్సియర్‌గా ఫీలవుతున్నానో... నేను మీ వెల్ విషర్ని సార్... ప్లీజ్ సార్...

యమ్మెస్ : సరే... నీ డౌట్లన్నీ ఇప్పుడే తీర్చేసుకో హీరోగారి ముందు నా పరువు తీయకు

వేణు : అదిగో అక్కడ కలర్ డబ్బాలు బ్రాండ్ న్యూవి తెప్పించాను. ఎప్పుడు ఓపెన్ చేసి కలిపి రెడీగా ఉంచమంటారో చెప్పండి చాలు...

యమ్మెస్ : కలర్ డబ్బాలా... ఎందుకవీ...?




మంచానికి ఎటు వైపునుంచైనా దిగే హక్కు
ఇక మీద లేదని బ్రహ్మచారికి గుర్తు చేసేది



# వెల్ విషర్

వేణు : (ఏడుపుతో) అదిగో అదే సార్... అన్నీ మీరే రాస్తారు... తీరా అడిగేసరికి తిడతారు, ద్రోహి అంటారు... ఎలాసార్ మీతో? ఇదిగో ఇటు చూడండి సార్ మీరు్రాసిన స్క్రిప్టు... ఇందులో ఏం రాశారు మీరు 'హీరోయిన్ ఆ మాట అనగానే హీరో ముఖంలో రంగులు మారుతాయి' అని రాశారా లేదా... చెప్పండి సార్...

యమ్మెస్ : రాశాను... అయితే..!?

వేణు : మరి హీరోయిన్ ఆ మాట అనగానే ఎఫెక్టు కోసం హీరో గారి మొహం మీద రంగులు కొట్టాలా వద్దా సార్..!? లేదా ఎడిటింగ్‌లో ఆపని మీరే చేసుకుంటారా?

యమ్మెస్ : ఒరే వేణూ... ఇంతసేపూ నేను చెప్పిందంతా నీకు అర్థం అయిందనుకున్నాన్రా... ఇలా వ్యర్థం అయిపోతుందనుకోలేదు

వేణు : ఏవయింది సార్ ఇప్పుడు...!?

యమ్మెస్ : లేక లేక నాకు ఫస్ట్ డైరెక్షన్ ఛాన్స్ వస్తే, దొరక్క దొరక్క నంబర్ వన్ టాప్ స్టార్ నాకు కాల్షీట్ ఇస్తే... ఆయన ముఖం మీద రంగులు కొట్టాలా... అది నేను తియ్యాలా... ఒరేయ్... నువ్వింక బాగుపడవు... నన్ను బాగుపడనియ్యవు...

వేణు : గురువు గారూ

యమ్మెస్ : నీకు చేటల్లాంటి చెవులున్నాయే గాని ఒక్క ముక్క కూడా ఎక్కలేదురా... నువ్వుంటుండగా ఇక ఈ సెట్లో అడుగుపెడితే చెప్పుచ్చుక్కొట్టు (కోపంగా వెళ్ళబోతాడు)

వేణు : ఆస్క్రిప్టు ఇలా ఇచ్చి వెళ్ళండి సార్...

యమ్మెస్ : ఆఁ! అంటే... నువ్వు డైరెక్ట్ చేసేద్దామనే?

వేణు : ఏదో సార్ మీ దయ... మీ ఆశీర్వాదం...

యమ్మెస్ : ఇప్పుడర్థం అయిందిరా నీ ప్లాను... వెల్ విషర్‌ని అన్నావు చూడు... దాని మీనింగు కూడా ఇప్పుడే అర్థం అయిందిరా! నా వెనక నుయ్యి తవ్వేసి నన్ను అందులో తోసెయ్యాలని విష్ చేసే వెల్ విషర్‌విరా నువ్వు... నిన్నింక ఒదలనోరేయ్... ఛంపేస్తా...!

(ఇద్దరూ పరిగెడుతూ ఉండగా)

............ కట్ ..........



పాఠకులకు దృశ్యానుభూతిని కలిగించటం కోసం పాపులర్ ఆర్టిస్టుల పేర్లను వాడుకోవటం జరిగింది. అందుకు వారికి కృతజ్ఞతలు. ఇటువంటి కామెడీ స్కిట్‌లను, కామెడీ ట్రాక్‌లను పాఠకులు కూడా పంపవచ్చు. తగిన పారితోషికం తప్పకుండా ఉంటుంది.

-ఎడిటర్




స్త్రీని బెటర్ హాఫ్‌గా,
పురుషుడిని బిట్టర్ హాఫ్‌గా ఫిరాయించడం



చూస్తే పరవశం ॥రాతిరికే॥
కో: తప్పించుకో తప్పించుకో
చ: అల్ల అల్లసాని తమరికి చుట్టమా
రెండు పెదవుల
సరసపు పద్యమా
తీపి కవితను
రాస్తావా... రాస్తావా
మా ప్రేమ కాఫీ లోకటే
అవి వేడిగ తాగితె రుచిలే
రుచి చూడగ వస్తావా...
వస్తావా వస్తావా
నిను వెన్నపూసలా నేను
మింగనా దాదా
మగధీరులెందరో నీదు
ముందర సాదా ॥రాతిరికే॥
చ: రోజా ఉచ్చరించి నీ పేరు వలన
మది రెచ్చి పోయి
కూత పెట్ట నాయనా
నా గాయత్రీ మంత్రం
నీవేనా... నీవేనా
శివకాశీ నిప్పురవ్వ నువ్వే
చిరపుంజీ వాన చుక్క నువ్వే
కోలార్ బంగారంకి సాటేనా
నువ్వు వీధి వెంట వెళితే
వీధి దీపం కన్ను కొట్ట కన్నా
ఇక నాకు తప్ప వెంటపడ్డ
పడుచులకు నువ్వే అన్నా
కో: తప్పించుకో ॥రాతిరికే॥
నడిజాము వెన్నెల రేడా
మనసైన నా మదనా నీవు
అధరములతో
ఆయుధములే చేస్తావా
కో: తప్పించుకో తప్పించుకో ..

తారాగణం:
మాధవన్, సిమ్రాన్, స్నేహ, లారెన్స్
సాంకేతిక వర్గం:
మాటలు: శ్రీరామకృష్ణ, పాటలు: ఎ.ఎం.రత్నం, శివగణేష్, సంగీతం: ఎ.ఆర్.రెహమాన్, నిర్మాణం: శ్రీసూర్యమూవీస్, కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె.బాలచందర్, సమర్పణ: ఎ.ఎం.రత్నం






ప: ఆనందమే మా సొంతమే ఆనందమే మా సొంతమే
అంబరమందుకొంటు పాడాలి ఖవ్వాలీ
అందర మొక్కటంటు తుళ్ళింత లవ్వాలీ ॥అంబర॥
మనసే ఆశల పల్లవి పలికే కమ్మని స్వరమై ॥పల్లవి॥
బ్రతుకే ఊహల నందన వనమై అందిన వరమై ॥నందన॥
హోలీ పండగ నేడే నంటు రంగులు జల్లాలి
లోకం మొత్తం మనదేనంటు సందడి చెయ్యాలి ॥హోళి॥
చ: కాకుల ఒడిలో పెరిగిన కోయిల ఆమని చెంతకు చేరిందే
ఆమని మామిడి చిగురులు పంచి తీయని రాగం నేర్పిందే
కోయిల గానం వింటుంటే కాలం ఎంతో తెలిసేనా
ఆమని తోడే లేకుంటే కోయిల గొంతే పలికేనా
మీతో స్నేహం తపముకు దొరకని ఫలమని తెలిసెను ॥తప॥
మీ అనురాగం మధువులు చినుకులు చిలికెను మనసులు తడిసెను॥హోళీ॥ ..

తారాగణం:
వెంకటేశ్వర్, గాయత్రీ ప్రియ, రాళ్ళపల్లి, ఎం.ఎస్.నారాయణ, వై.విజయ, కల్పనారాయ్, తిరుపతి ప్రకాష్, తిరుపతి దొరై, అనంత్, కళ్ళు చిదంబరం, మాస్టర్ ఆదిత్య, మాస్టర్ మహేంద్ర, మాస్టర్ అక్షయ్, ఎర్రయ్య, విఠలరావు తదితరులు
సాంకేతిక వర్గం:
మాటలు: అంబటి గోపి, సంగీతం: చక్రి, కెమెరా: శ్రీనివాస్, పాటలు: కులశేఖర్, నిర్మాణ నిర్వహణ: కూనా నందగోపాల్, నిర్మాణం: వెంకటేశ్వర ఫిలిం యూనివర్సిటీ, దర్శకత్వం: శ్రీకాంత్



రచన:ఎ.ఎమ్. రత్నం, శివగణేష్ **1** గానం:పి. బలరాం, చిత్ర

సాకి :ప్రేమకే జయం
ప/అ :నీవే నా జాతీయ గీతం
రంజనా రంజనానా ఒకే
పాటవే పూల బాటవే
నా మనసుకు నచ్చావే
మమతను పెంచావే
కాలము నీవే లోకము నీవే
కలలో నీవే ఇలలో
నీవే ॥నీవే నా॥
చ/అ :నా మానస పుత్రులను నీ
కనులు తెలిపెలే (2)
నా ఎదలో కవితలను
పెదవి పలికెలే
నీ పెదవి పలికెలే
ఆ: నీ కోరిన వరములను రాక
తీర్చులే
నీ రాక తీర్చులే
నా తరగని రాత్రులను
తోడు తీర్చులే
నీ తోడు తీర్చులే
అ: ప్రేమకే జయం జగతి
నీ మయం

నా మనసుకు నచ్చావే
మమతను పెంచావే
ఆ: ఆ.... ఆ.... ॥నీవే నా॥
చ/అ: తనువున కలుగు సుఖం
క్షణికములే
ఈ తనువున కలుగు సుఖం
క్షణికములే
మన ప్రణయం అమరమై
నిలవాలిలే నిలవాలిలే
ఆ : రాగాలన్నిటికీ స్వరములూపిరి
స్వరములూపిరి
నా మదిలో ఊహలకి (2)
నీవే ఊపిరి (2)
అ : ప్రేమకే జయం
ఆ : ప్రేమకే జయం నీది దేవుని
వరం
అ : నా మనసుకు నచ్చావే
మమతను పెంచావే
ఆ : కాలము నీవే లోకము నీవే
కలలో నీవే
అ : ఇలలో నీవే ॥నీవే నా॥

రచన : ఎ.ఎం.రత్నం, శివగణేష్ **2** గానం: శంకర్‌మహాదేవన్, నిత్యశ్రీ

సాకి/ఆ: మన్మధమాసం ఇది
మన్మధమాసం
మన్మధమాసం
మన్మధమాసం
ప/అ: ఇది మన్మధమాసం మన్మధమాసం
మన్మధమాసం మదమద మాసం



ఆ: ప్రియుడా కుశలమా నీ
తాపాలు కుశలమా (2)
గురువా కుశలమా కుశలమా
ఏకాంతం కుశలమా కుశలమా
ఇల్లు వాకిలి కుశలమా
నీ పెరటి తోట కుశలమా
పూల పందిరి కుశలమా
నీ కొంటె అల్లరి కుశలమా
ప్రియుడా కుశలమా
నీ తాపాలు కుశలమా
చ.ఆ: చిలిపి చేష్టకు తపించి
ఓ రెక్కనే కోల్పోయితి
ఒంటి రెక్కతో ఒంటి పక్షి
ఎంత దూరం ఎగురును
అ: ప్రియతమా నిను పిలిచెద
నీ అహింస హింసలు భరించెద
సీత దూకిన నిప్పులో నను
దూకమన్నా దూకెద
ఆ: కంటి నీటిలో కలత
కరుగుట కనలేదా
అ: కలత ఉన్నదె మనిషి
బ్రతుకని వినలేదా
ఆ: ఇది కన్నీరు జరిపే
రాయబారం విడిన
మనసులు అతకవా
అ: ఇది కన్నీరు జరిపే
రాయబారం విడిన
మనసులు అతకవా
చెలియా కుశలమా
ఆ: ప్రియుడా కుశలమా
ఆ: నీ కోపాలు కుశలమా
ఆ: నీ తాపాలు కుశలమా
గురువా కుశలమా కుశలమా
ఏకాంతం కుశలమా కుశలమా
అ: లేత బుగ్గలు కుశలమా
అందు చివరి
ముద్దు కుశలమా
పట్టె మంచం కుశలమా నా
పట్టు తలగడ కుశలమా

రచన:ఎ.ఎం.రత్నం.శివగణేష్ **8** గానం:రెహానా, గంగ, ఫెబి, ఫెజి, పూర్ణిమ

సాకి : పరవశం పరవశం పరవశం
వశం వశం (2)
ప: రాతిరికే రారాజైతే
రహస్యంగా మనసే దోచి
ముద్దులతో యుద్ధం చేస్తావా
మా వూళ్ళో నీటికి కరువు
నేతెచ్చా బిందెడు అరువు
ఒక్కటిగా స్నానం చేద్దాం రావా
చూస్తేనే పరవశము...
పరవశం పరవశం... నిన్ను



రచన: కులశేఖర్ **1** గానం: సావేరి, గాయత్రి, ప్రదీప్, రవివర్మ, ప్రమోద్

ప/ఆ: భారత జాతికి పచ్చని ధాత్రికి జెండా పండుగ
వచ్చిందోయ్ వచ్చిందోయ్ వచ్చిందోయ్
రాక్షస నీతికి స్వస్తిని పలికి స్వేచ్ఛను నిండుగ
తెచ్చిందోయ్ తెచ్చిందోయ్ తెచ్చిందోయ్
మనుషులంత కలిసే మనసులన్ని మురిసే
శాంతి వెల్లి విరిసే పూలజల్లు కురిసే
అ: హౌ గ్రేట్ ఇండియా వుయ్ ఆర్ ప్రౌడ్ ఆఫ్ ఇండియా
వుయ్ లవ్ ఇండియా వుయ్ మస్ట్ లవ్ ఇండియా
చ/ఆ: వందేమాతరమందామా జెండా జాతర చేద్దామా
నామ్‌స్వాసకర ఇంద కాట్ర ఒడ్రదా
నమకుళ్ ఇరుదర రత్తముడ్రదా
తకధిమి తత్తోం తక ధిమితత్తోం తక ధిమితత్తోం తిల్లానా
శుక పిక గళముల శ్రుతి సరి చేసి ప్రార్థన గీతం పాడిద్దాం ॥తకధిమి॥
భూతల స్వర్గం మనదేనంటూ లోకాలన్నీ చాటేద్దాం
అ: మువ్వన్నెల జెండా రెపరెప లాడిద్దాం ॥హౌ గ్రేట్॥
చ/:ఆ: సారే జహాఁసే అచ్ఛా హిందూ సితా హమారా
ఒట్రుమై ఇరుక్కుళొం నమ్మ ఎల్లారుం
నాటై కాపాత్కుళొం నమ్మ ఎల్లారుం
తక ధిమి తత్తోం తక ధిమి తత్తోం తక ధిమి తత్తోం తిల్లానా
పరమత సహనం వరమనుకుంటూ సహజీవనమే సాగిద్దాం
అ: తక ధిమి తత్తోం తక ధిమి తత్తోం తక ధిమి తత్తోం తిల్లానా
ఆ: జనగణమనలే మన ఎదసడులై దేశంకోసం జీవిద్దాం
అ: మన దేశం కోసం ప్రాణాలర్పిద్దాం ॥హౌ గ్రేట్॥



ఆ: ఇంకా నే మైనరో
అ: ఈడొచ్చి పద్దాక ఎన్నాళ్ళు ఈ కిరికిరి
ఆ: మూడొచ్చి రెచ్చాక నీదేరా ఈ సొగసరి ॥కన్యాకుమారి॥
చ:ఆ: జున్ను ముక్కలాంటి దాన్ని వాత్సాయనా
సొంపు గోటితో గిల్లమాకు ఓరి నాయనా
అ: వెన్నపూస రంగరించి వెన్ను రాయనా
కన్నె వన్నెలన్ని దొంగిలించ దారి కాయనా
ఆ: మురిపాలు మూటగట్టి దర్జాగా దానమిచ్చి
నీ ముద్దు మోజు తీర్చనా
అ: అందాలు ఆరగించి హుందాగా ఆవురించి
నీ చెంత సేద తీరనా
ఆ: అందరి ముందర చిందులు ఎందుకు
విందులు చేయనా ॥కన్యాకుమారి॥
చ:అ: నంగనాచి బుంగమూతి అందమేనమ్మో
చెంగు చెంగు మంటు చెంత చేరి విందు చేయమ్మో
ఆ: కొంటె పిల్లడల్లె కొంగులాగ మాకమ్మా
కన్నె గుట్టులన్ని బయట పడితే సిగ్గు చేటమ్మా
అ: ఏనాడు తెలియనట్టు ఇవ్వాళే జరిగినట్టు
ఏందమ్మో వింతవైఖరి
ఆ: స్వర్గాలే తెలిసినట్టు పన్నీరే చిలికినట్టు
బాగుందే కొంటె తిమ్మిరి
అ: ఒంటరి వింటది జంటగ చేరితే సందడి చేయనా ॥కన్యాకుమారి॥

రచన: కులశేఖర్ **8** గానం: చక్రి, కౌసల్య, మాస్టర్ ప్రదీప్

సాకి: ఆ పసిప్రాణం నిలిచిందంటే మీ చలవేగా మాస్టారూ
ఆయువు పోసే గుణ ముందంటే దేవుడు మీరే మాస్టారు

రచన: ఎ.ఎం.రత్నం, శివగణేష్ **6** గానం: కళ్యాణి, సుజాత, శ్రీరామ్ నారాయణ, శ్రీరామ్‌పార్థసారథి

ఆ: అతిశయ పరిణయం ఆనంద
పరిణయం అరుదైన పరిణయమే (2)
అందాల పరిణయం అపూర్వ
పరిణయం అర్థమున్న పరిణయమే
అ: ఇదియె ఇదియె అగ్ర ఘట్టం ఇకపై
ఇకపై ఉగ్రఘట్టం (2)
తీయనైంది అగ్రఘట్టం ముందువుంది
ఉగ్రఘట్టం (2)
పరిణయమొక జూదఘట్టం దైవమాడు
మాయఘట్టం
యవ్వనాన మొదటి ఘట్టం జీవితాన
మధుర ఘట్టం
అర్ధరాత్రి ఖైది నీవోయి అర్ధరాత్రి ఖైది
నీవోయి
అర్ధరాత్రి ఖైది నీవోయి
తెల్లవార్లు కొల్లగొట్టి పోవోయ్
అర్ధరాత్రి ఖైది నీవోయి అర్ధరాత్రి
ఖైది నీవోయి
పట్టెమంచం గుట్టు కనవోయ్
మూగ భాష బాసలను వినవోయ్
ఇది తియ్యనైన రోజు మది
మరువలేని రోజు ॥అతి॥
చ1. ఆ:వాత్సాయనా కామసూత్రం
వివాహితులకు దివ్యమంత్రం
లాలించే పతి రాకను చూసి మదిలో
కలవరమేలా (2)
సౌఖ్యం రాతిరిలోనే కాదు ఇద్దరి
ఒద్దిక నుంది
అ: కాపురంలో జడివానొస్తే చినదానా
నువ్ గొడుగుగ మారు
ఆ: అలివేణి మగనికి తోడై ఇంటికి
వెలుగై మసలుకో నీవు
ఇ: అలివేణి మగనికి తోడై
ఇంటికి వెలుగై మసలుకో
నీవు ॥ఇదియె॥
చ2.ఆ: పురుష లక్షణం వంటలో
చూపు భార్య మెచ్చితే
కలుగును కైపు
అ: కాళ్ళ నొప్పితో శ్రీమతి వుంటె
మెల్లగ పదములు పట్టు
అలిగిన సతినే నవ్వించేందుకు
చిలిపి జోకులు చెప్పు
అనునిత్యం భార్యను చూసి
సుందరివంటూ కీర్తన పాడు
॥అనునిత్యం (2)॥
ఆ: ఇహామెంచి పలికిన వేళ అసత్యం
కూడా సత్యమగునంట ॥అతి॥

రచన:ఎ.ఎం.రత్నం, శివగణేష్ **7** గానం: బాలు, సాధనా సర్‌గమ్

ప/అ:చెలియా కుశలమా నీ కోపాలు కుశలమా (2)



మన్మదమాసం మన్మధమాసం
మనదమాసం
ఆ: ఇది మన్మధమాసం మన్మధమాసం
మన్మధమాసం మన్మధమాసం
మన్మధమాసం
అ: ఇది మన్మధమాసం మన్మధమాసం
మన్మధమాసం
సిరి వెన్నెల విరియు
మల్లెలమాసం మన్మధమాసం
ఆ: ఇది పన్నెండు మాసములలో
పరువపు మాసం
ఇది ఒకరి ఒడిలో ఒకరు ఒదుగు
వలపుల మాసం
మన్మధమాసం
అ: సిరిమల్లెల మంజుల
మన్మధమాసం (2)
ఆ: తనువు తాకిన వూరెరిగె
మనసు తాకినా వూరెరుగదులే
తనువు ... తనువు తాకిన
అ: వూరెరిగె ఆ: వూరెరిగె
మనసు తాకిన
అ: వూరెరుగదులే
ఆ: మనసు తాకిన
వూరెరుగదులే ॥ఇది॥

రచన:ఎ.ఎం.రత్నం, శివగణేష్ **3** గానం: బాలు, సాధనా సర్‌గమ్

ప/అ: చెలియా కుశలమా నీ
కోపాలు కుశలమా (2)
ఆ: ప్రియుడా కుశలమా నీ
తాపాలు కుశలమా (2)
గురువా కుశలమా
కుశలమా ఏకాంతం
కుశలమా కుశలమా
ఇల్లు వాకిలి కుశలమా నీ
పెరటి తోట కుశలమా
పూల పందిరి కుశలమా నీ
కొంటె అల్లరి కుశలమా
ప్రియుడా కుశలమా నీ
తాపాలు కుశలమా
చ/అ: చెలియా నిను వీడి నేను
మతిలేక తిరిగితి పగలు
ఏడ్చిన సిగ్గు అంటు
చీకటింట్లో ఏడ్చితి ॥పగలు॥
ఆ: ప్రియుడా నిను ద్వేషించి
మోడు నేనైపోతిని విరహ
వేదన తాళలేక చిక్కి శల్యం
అయితిని ॥విరహ॥
అ: కొత్త పువ్వులు పాత
దండలో చేరేనా
ఆ: కొత్త ముడులను పాత
తాళికి వేయరాదా
అ: జీవితం ఓ వలయమై మొదటి
చోటికి తిరిగిరాదా
ఆ: జీవితం ఓ వలయమై మొదటి
చోటికి తిరిగిరాదా ॥చెలియా॥



కవితల కందని అందాలు
నా మనుసుకు వేసెను బంధాలు
ఆ: మదనుడి శరముల మహిమలు తెలియక
సతమత మయినది నా హృదయం
అ: చెదిరిన కలలను కనులకు ఎదురుగ
నిజముగ నిలిపెను ఈ ఉదయం
ఆ: కళ్యాణి రాగం పలికించు వేగం గోపాలబాలా ॥హంపీ॥
చ:ఆ: హద్దే తెలియని ఆకాశం
స్వార్థం ఎరుగని నీ స్నేహం
కర్ణుని మించిన నీ త్యాగం
నా మనసును మీటెను అనురాగం
అ: జిలిబిలి పలుకుల పగడపు పెదవుల
కిలకిల నగవులు నీ సొంతం
ఆ: తొలకరి చినుకుల తడిసిన సొగసులు
కలవర పడినవి నీ కోసం
అ: ఆ జంట యాగం జరిపించకుండా జాగేల బాలా. ॥హంపీ॥

రచన: కులశేఖర్ **7** గానం: రవివర్మ, సుధ

ప:అ: కన్యాకుమారి వచ్చి కన్ను కొట్టింది హోయ్ (2)
నా బ్రహ్మచర్యమంత దిమ్మతిరిగి పోయింది
ఆ: కిల్లాడి కిట్టయ్యొచ్చి కిల్లాడి కిట్టయ్యొచ్చి
కిల్లాడి కిట్టయ్యొచ్చి బుగ్గ నొక్కిండు
నా కన్నె సోకులన్ని విల్లురాయ మంటుండు ॥నా కన్నె॥
అ: అబ్బా ఏం సిగ్గురో
ఆ: ఇంకా నే మొగ్గరో
అ: అబ్బా ఏం జాణరో



రచన: కులశేఖర్ **2** గానం : నిహాల్

ప: నీలో నాలో ఊపిరి అమ్మరా
ఏ మాటలకీ అందని జన్మరా ॥ఏ మాట॥
ఆ దివిలో దేవతలో పంపిన దీవెన అమ్మేరా
ఈ యిలపై కాలిడిన అమృత వాహిని అమ్మేరా
మమతల సన్నిధి అమ్మేరా
మనుజుల పెన్నిధి అమ్మేరా ॥నీలో॥
చ:1: పాలబువ్వ తినిపిస్తూనే జాబిలమ్మ
అవుతుందమ్మా
వేలుపట్టి నడిపిస్తూనే పూలబాట
అవుతుందమ్మా
జాలిజల్లు కురిసే వేళ
మేఘమాలికవుతుందమ్మా
జోలపాట పాడే వేళ హాయి
రాగమవుతుందమ్మా
లోకాలు చూపించు కనుపాప అమ్మేరా
శోకాలలో నీకు ఓదార్పు
అమ్మేరా ॥లోకాలు॥ ॥ఆ దివిలో॥
చ:2: ఉగ్గుపాలు తాగిస్తూనే ఊసులెన్నొ
చెబుతుందమ్మా
చిట్టికథలు వినిపిస్తూనే నీతులెన్నొ
చెబుతుందమ్మా
ఊరువాడ తిప్పేవేళ యేనుగమ్మ
అవుతుందమ్మా
ఇరుగు పొరుగు చూసేవేళ దిష్టి
చుక్క అవుతుందమ్మా
ఈ జన్మలో నీకు తొలి చెలిమి అమ్మేరా
ఏ పుణ్యమోగాని నీ కలిమి అమ్మేరా
॥ఈ జన్మ॥ ॥ఆ దివిలో॥

రచన:కులశేఖర్ **3** గానం : చక్రి

ప: ఏమయింది నీకు నను వీడిపోయినావూ
న్యాయమేనా నీకు చితి చెలిమి కోరినావూ
చూపు లేని కన్నులా శ్వాసలేని గుండెలా
నీవులేని నేనెలా నేనెలా ॥ఏమయింది॥
చ: ఎందుకమ్మా చెప్పలేదు గుండె లోపల వేదనా
ఎంతకాలం దాచినావో గొంతు చాటున రోదనా
నీ నీలి కంటిలో నలక పడితే రుధిర మవదా నా ఎద
బంధమే మరిచావులే మృత్యువే కొలిచావులే
కరిగి పోయిన కలల బొమ్మా ॥ఏమయింది॥

రచన: ఎ.ఎమ్.రత్నం, శివగణేష్ **4** గానం: శంకర్ మహాదేవన్, శైలజ

ప/అ: నాదిరి దిన్నాన నాదిరి దిన్నా
అరె నీ పేరు చెప్పు మైన
నాదిర్ దిన్నా నాదిర్ దిన్నా
ఆగవేఁ ఆగమన్నా
లవ్ చెక్ వన్... లవ్ చెక్
టూ... లవ్ చెక్ త్రీ...
అరె వేటగాడు నేననననే
కొల్లగొట్టు కేటుగాడు
నేననననే ॥నాదిరి॥

ఆ: ఏదేదేదో చేశావు నువ్ నన్నేతాకి
అమ్మమ్మమ్మో ఓరినాయనో
అ: మెల్లంగా నిన్ను నేను మోసి మోసి
వెళతాలే మాయం
చేసి ॥లవ్ చెక్ వన్॥

చ/ఆ: తక తక ధీం జతియే
నన్ను ఆపే
ఈ యువతి నిప్పునీకై వేచే
అ: రాతిరి విరిసే పరిమళ
కుసుమం
నీ అందం నాలో మురిసి
మెరిసే భ్రమరం

చ/ఆ: ఓ... నిను మించే రంగులో
మెరుపూ లేరెవరూ
నీ రంగు చూసి ఒడిలో వాలే
వసంత ఋతువూ
అ: ఈ మెరుపు వెలుపు జతగా
వెలిసే
ఆ: వేరెవరొ మనని దూరం చేయ
ఇది దేవుని తీర్పే కాదా
అ: రా రా రా రా కౌగిట చేర
నవ చరితను
వ్రాయ ॥లవ్ చెక్ వన్॥

రచన: ఎ.ఎం.రత్నం, శివగణేష్ **5** గానం: హరిణి, కార్తీక్

ప/ఆ: అరె అక్షరాలు రెండైన
చెడ్డమాట శిష్య ఏవిటో
చెప్పమందువా (2)
అది నిన్ను నన్ను కాచి
వేయు వేడి మాట శిష్య
ఏవిటో చెప్పమందువా
అ: గుండె పిండుతుంది నన్ను
చంపుతుంది
అది ఏమిటో చెప్పవా
గురువా
ఆ: రోజా నిద్ర మాని ఇక దీక్షబూని
అది నేర్చుకుంటే చాల సులువే
అ: గురుదక్షిణ నీకెంత కావాలి
మగువ ॥అరె॥



చ/ఆ: శివుని తపసు భంగ
పరచిన దివ్యమైనమాట
అది పున్నమి చంద్రుని
నిప్పని చెప్పే రమ్యమైన
మాట
అ: చంద్రుణ్ణి నిప్పుగ పోల్చే
అది ఏమి మాట
అది నువ్వే నాకు చెప్పక
పోతే నా బ్రతుకుతంట
ఆ: తలచుకుంటె హృద
యాన్నైనా వణికించే
మాట రే పగలు వ్రతమే
వుంటే ఫలియించు మాట
అ: చెప్పండి గురువా
చెప్పండి గురువా
నేనింక తాళలేకపోతున్నా
ఆ: అరె అక్షరాలు రెండైన
చెడ్డమాట శిష్యా ఏమిటో
చెప్పమందువా
అ: నీ పేరు చెప్పి కొబ్బరి
కాయలు కొడతాను
గురువా చెప్పవా చెడ్డ
మాట ॥రోజా॥

తిప్పించే మాట
నవకవులందరిలో కవితావేశం
పొంగించు మాట
అ: అది ఏమి మాయ మంత్రం
వేసేటి మాట
నే జగమే మాయని సోలి
పోకముందే చెప్పు ఆ మాట
ఆ: యాపిల్ పండారంభించిన
విలువైన మాట
ఆదామ్ ఈవు ముచ్చటించిన
అందాల మాట
అ: చెప్పండి గురువా
ఆ: చెప్పను శిష్యా కంగారు
పెట్టమాకు
అ: నీ పేరు చెప్పి కొబ్బరికాయలు
కొడతాను గురువా
చెప్పవా చెడ్డమాట
నీ బట్టలను పదినెలలు
ఉతుకుతాను గురువా
చెప్పు ఆ మంచి మాట
ఆ: నే చెప్పనోయి అది చెప్పనోయి
నువ్వు కాకా పట్టినా శిష్యా
'ప్రే'తో ఆరంభించి 'మ'తో
అంతమౌను ఏమిటది
చెప్పుకో శిష్యా ॥నే చెప్పనోయి॥

చ 2/ఆ: యువతి వెంట
యువకులనెపుడూ



చ: ఎంత భారం మోసినావు చిన్ని రెక్కల మీదుగా
ఎంతగానో అలసినావు బ్రతుకు సంద్రం ఈదగా
నీ చిట్టి మనసే కలత పడితే కుమిలి పోదా నా ఎద
ఆశలే అడియాసలై ఊహలే ఉరితాడులై
ఇంత ఘోరం చేసినావా ॥ఏమయింది॥

రచన: కులశేఖర్ **4** గానం : చక్రి, కౌసల్య, మాస్టర్ ప్రదీప్

సాకి: ఆ పసిప్రాణం నిలిచిందంటే మీచలవేగా మాస్టారూ
ఆయువు పోసే గుణ ముందంటే దేవుడు మీరే మాస్టారు
ప: ఆనందమే మా సొంతమే ఆనందమే మా సొంతమే
అంబరమందుకొంటు పాడాలి ఖవ్వాలీ
అందర మొక్కటంటు తుళ్ళింత లవ్వాలీ ॥అంబర॥
మనసే ఆశల పల్లవి పలికే కమ్మని స్వరమై ॥పల్లవి॥
బ్రతుకే ఊహల నందన వనమై అందిన వరమై ॥నందన॥
హోలీ పండుగ నేడే నంటు రంగులు జల్లాలి
లోకం మొత్తం మనదేనంటు సందడి చెయ్యాలి ॥హోలి॥ ॥ఆనందమే॥
చ:అ: ఎవరో తెలియని ఏకాకులను దరి చేర్చుకుని పెంచారే
ఆ: మనసూ మమతల మర్మం తెలిపి మాధుర్యాన్నే పంచారే
అ: ఏదో బంధం లేకుంటే మాపై ఎందుకు మమకారం
అంతా మన వారనుకుంటే ఎందుకు ఉండదు అభిమానం
నడిచే దైవం వరముగ దొరికెను మనసులు మురిసెను ॥వర॥
ఎదలో భావం పదములు తొడిగెను కవితలు చదివెను ॥పద॥ ॥హోలి॥

రచన: కులశేఖర్ **5** గానం : సుధ

ప: చలన చకితజం చలన చకితజం చలన చకితజం జంజం
చలన చకితజం చలన చకితజం చలన చకితజం జంజం
జగతి చరితలో భరత ఘనతని పసిడి వన్నెతో రాద్దాం



ప్రగతి పథములో జగతి ప్రథములై కలసి అడుగులే వేద్దాం
అంత ఒక్కటే మనమంత ఒక్కటే ॥అంత॥
అంత ఒక్కటే మనమంత ఒక్కటే
ఎదలో కలలా ఎగసే అలలా ॥ఎదలో॥
సొగాలి నేడే పారే యేరులా ॥జగతి॥
చ: ఏళ్ళూ పూళ్ళూ గడచిన తరగని వేద నిధానం మనదేగా
కుళ్ళూ కుట్రా గట్రా ఎరగని గొప్ప వివేకం మనదేగా
పంచమ వేదం మనదేగా
వంచన తగదని అనలేదా ॥పంచమ॥
నిత్యం సత్యం చెప్పాలంటూ నీతి న్యాయం చుట్టాలంటూ
మానవ జీవన శైలిని తెలిపిన అనుభవ ఖ్యాతిక మనదేగా ॥జగతి॥
చ: గాంధీ, నెహ్రూ, ఇందిర మొత్తం ఇక్కడ పుట్టిన వారేగా
శాంతి నివాసపు సుందర స్వప్నం చిగురులు తొడిగినదిచటేగా
రాజ్యం భోజ్యం మనదేగా
రాజు పేద ఒకటేగా ॥రాజ్యం॥
రామరాజ్యం మనదేనంటూ ఇంతకు మించిన మంచేదంటూ
మానవ జీవన శైలిని తెలిపిన అనుపమ ఖ్యాతిక మనదేగా ॥జగతి॥

రచన: కులశేఖర్ **6** గానం: ప్రమోద్, కౌసల్య

ప:అ: హంపీ బొమ్మను మించే సొగసుందే ప్రియురాలా
హంసే దిమ్మెర పోయే నడకుందే జవరాలా
ఆ: మువ్వ మువ్వ గోపాలా ముదిరే విరహాలా
సువ్వి సువ్వి సువ్వాలా గడసరి సరసాలా
అ: వయ్యారి అందాలు ఊగెను ఉయ్యాల ॥హంపీ॥
చ:అ: కన్నులు వెన్నెల దీపాలు
చెంపలు కెంపుల రాగాలు




నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం చేసిన
రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావికొండలరావు**

రాసిన వ్యాసమిది



# 'కుటుంబ హాస్యం' చదలవాడ



సినిమాల్లో కొందరు నటులు పేర్లతో ప్రకాశిస్తారు;

కొందరు ఇంటిపేర్లతో ప్రసిద్ధులవుతారు.

రామారావు, రంగారావు, నాగయ్య మొదలైన వారి పేర్లు ప్రఖ్యాతం.

ముక్కామల, గుమ్మడి, ధూళిపాళ మున్నగు వారు ఇంటి పేర్లు చెబితేనే బాగా తెలుస్తారు.

హాస్యనటుల్లో శివరావు, రాజబాబు, పద్మనాభం పేర్లతోనే ప్రఖ్యాతి పొందితే రేలంగి "గృహనామం" తోనే తెలుస్తారు గాని, వట్టి వెంకట్రామయ్య అంటే తెలియదు.

అలాగే చదలవాడ కుటుంబరావు.

చదలవాడగానే పేరు.

ఒకే శైలి, ఒకే ధోరణి, ఒకే మాట - వాటిని పట్టుకునే పాప్యులర్ అయినాడు. నాటక రంగం మీద పాత్రలు ధరించి అనుభవం సంపాదించి, సినిమాల్లో ప్రవేశించాడు కుటుంబరావు. కె.యస్.ప్రకాశరావు "దీక్ష" (1951) తొలి చిత్రం కావచ్చు. లేదా ఆ చిత్రంతో తెలిసి వుండొచ్చు. అప్పుడే విజయా సంస్థలో చేరి నెలజీతం మీద కొంతకాలం పని చేశాడు. జ్ఞాపకం వున్న వాళ్లకి, 'పాతాళ భైరవి'లో రెండు మూడు వేషాల్లో కనిపిస్తాడు. 'పెళ్లి చేసిచూడు'లో ధూపాటి వియ్యన్న (రంగారావు)కి నౌకరు. "ఇక అక్కణ్ణుంచీ, నౌకరంటే నేనే... ఏదైతేంలే, నా పరసనాలిటీకి మారాజు యేషాలిస్తారా - అనుకునే వాణ్ణి'' అని చెప్పారు కుటుంబరావు. ఐతే, అతను అనుకున్నట్టు కాకుండా మారాజు వేషం వొచ్చింది ఓ సినిమాలో. అంటే బాగా డబ్బున్న జమీందారుపాత్ర. సూర్యకాంతం భార్య. 'పరివర్తన' 'ఇలవేలుపు', 'నిరుపేదలు' వంటి సినిమాల్లో నౌకరు పాత్రలే. అంచేత ఒక్కసారి జమిందారు డ్రస్సు, టోపీ అవీ చూసి, కుటుంబరావు మురిసిపోయి, "ఇంక మనకి మారాజు యేషాలు కూడా రావచ్చులే, మన పరసనాలిటీ అట్టాంటిది!'' అని కిచకిచమని నవ్వారు. కుటుంబరావు నవ్వు తమాషాగా వుండేది. నోటినుంచి శబ్దం ఎక్కువగా రానీకుండా, ఒళ్లంతా కదిలిస్తూ నవ్వేవారు. తాను నవ్వడం సరదా, నవ్వించడం సరదా. ఆ జమిందారు పాత్ర డైలాగులు గంభీరంగానూ, క్లాస్‌గానూ వుంటే, కుటుంబరావు తన యాసతోనూ, పద్ధతిలోనూ చెబుతూ వుంటే - డైరెక్టరు "అలా నాటు భాష మాట్లాడకూడదు కుటుంబరావుగారూ! పట్టిపట్టి డైలాగులు చెప్పండి, క్లాస్‌గా నటిస్తూ నవ్వించాలి'' అన్నాడు. కుటుంబరావు అదోలా డైరెక్టరు వేపూ, సూర్యకాంతం వేపూ చూశాడు. "నా బాష నాది. మీ యేషం కోసం నా బాషెట్టా మారుద్ది? నా ఫాన్స్‌లు ఒప్పుకోరే. నువ్వు సీరామచంద్రుడి

## 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రంలో చదలవాడ నటించిన ఓ హాస్య దృశ్యం




**నాగేశ్వరరావు ఉద్యోగం కోసం 'అందాలు - అలంకారాలు' అనే కంపెనీకి వస్తాడు. అతన్ని సోఫాలో వెయిట్ చేయమంటారు. అక్కడ ఆఫీసులో ఇద్దరు ఉద్యోగస్తులు ఉంటారు. ప్రకటనలు (అల్లు రామలింగయ్య) సెంటు బాటిల్ చేతబట్టుకుని మంచి స్లోగన్ కోసం తెగ ఆలోచిస్తూ ఉంటాడు. అమ్మకాలు (చదలవాడ) తెగ లెక్కలు వేస్తూ ఉంటాడు.**

**అల్లు** : (పాడతాడు) సెంటు భూమిలేకున్నా సెంటు మాత్రం ఉండాలి. పూసుకున్న వారికే దేశంలో పరపతి

**చదలవాడ** : (లెక్కల్లోంచి బయటపడి) ఏమిటేమిటి?

**అల్లు** : పూసుకున్న వారికే 'దేశంలో పరపతి'. భేష్, ప్రయాస పెట్టకుండా ప్రాసపడ్డది. ఏమోయ్ మిస్టరు అమ్మకాలు, ఈ ప్రకటన గేయంతో ఎన్ని గ్రోసులు అమ్ముకుంటావో అమ్ముకో (అంటూ సెంటు సీసా అతని చేతికి ఇస్తాడు).

**చదలవాడ** : (సీసా వాసన చూసి) అబ్బ ఇది సెంటా?

**అల్లు** : మరి ఇంకేమిటి?

**చదలవాడ** : డీసెంటు! (సారూ అంటూ నాగేశ్వరరావు వద్దకు లేచి వెళ్లి) సారూ గుడ్‌మార్నింగ్ సార్! (సెంటు పూస్తాడు)

**నాగేశ్వరరావు** : ఏమిటిది?

**చదలవాడ** : బలే సెంటు లెండి... ఎక్సలెంటు.

**నాగేశ్వరరావు** : నాకెందుకు?

**చదలవాడ** : (పాడుతూ) పూసుకున్న వారికే పరపతి. ఇక చెప్పండి సార్... ఎన్నిగ్రోసులు కావాలో... స్టాకు రెడీగా ఉంది సార్.

**నాగేశ్వరరావు** : నేను సెంటుకొనడానికి రాలేదండి.

**చదలవాడ** : అయితే మరి ఎందుకు వచ్చినట్టు?

**నాగేశ్వరరావు** : ఉద్యోగం కోసం వచ్చానండి.

**చదలవాడ** : ఓహో (వెక్కిరింతగా అని ఇతనొస్తే నీ ఉద్యోగానికి ముప్పు అనే ధ్వనితో, అల్లుతో) ఏవోయ్ మిస్టర్ ప్రకటనలూ, విన్నావా?

**అల్లు** : (అసూయతో) విన్నా, వినకున్నా, ఇట సున్న కదా ఉద్యోగం!

**ప్యూన్** : (వచ్చి, విసుక్కుంటూ) (చదలవాడతో) వారికెందుకయ్యా, మీసోది? మీ పని మీరు చూసుకోండి.

యేషం ఇచ్చినా నేనిట్టాగే మాట్టాడతా. ఆ బాషలంతా నాక్కుదరదు. ఇష్టం వుంటే ఏపించుకో, లేదంటే ఎళ్లగొట్టు, పోతా" అన్నారు చదలవాడ. రైటరూ, డైరక్టరూ వాళ్లవాళ్ల తలలు పట్టుకున్నారు. ఇద్దరూ రాజీకొచ్చి చదువురాని వాడు కింద స్థాయి నుంచి పైకి వచ్చినవాడూ - అని ఆ పాత్రని తీర్చి, "మీ భాషలోనే కానీండి" అన్నారు. కుటుంబరావు కిచకిచమని నవ్వి - "చూశా! ఆ పాత్ర దగ్గరికి నేనెళ్ల లేదు. అదే, నా దగ్గరకొచ్చింది" అన్నాడు ఘనంగా చూస్తు.

'పెద్దమనుషులు' లోని కౌన్సిలర్ అవతారం పాత్ర. 'పెళ్లినాటి ప్రమాణాలు'లో 'అమ్మకాలు' పాత్ర, 'మాయాబజార్'లోని లంబు పాత్రల్లో చదలవాడ మెరిశాడు. సంభాషణలు చెప్పి నవ్వించాడు. "నీ శాసతరం సొంత తెలివి లేని వాళ్లకు... మాకు కాదు. తసమదీయులు వచ్చేది అటునుంచి దవారం అటే వుండాలి" అన్న సంభాషణ ఒక్కటి చాలు - లంబు పాత్ర తెలియడానికి.

చదలవాడ చాలామందికి బాబాయ్. ఆ వరసపెట్టే పిలిచేవారు. "అందరూ బాబాయ్ అని పిలవడం బాగానే వుందనుకో - ఆడ కూతుళ్లు కూడా అట్టాగే పిలుస్తున్నారే - అదే నా బాధ - అచ్చరం మార్చి 'బావోయ్' అని పిలవొచ్చుగా, ఈళ్ల సొమ్మేం పోయింది" అని షూటింగులో వున్న హీరోయిన్ల దగ్గరే అనేవాడాయన - తాను నవ్వుతూ, వాళ్లని నవ్విస్తూ.

యల్.వి.ప్రసాద్‌గారి షూటింగులో వున్నాడు చదలవాడ. షాటులో అతనికి డైలాగు లేదు. ఇంకెవరో మాట్లాడుతున్నారు. ప్రసాద్‌గారు "కుటుంబరావ్ - ఆయన డైలాగ్ చెబుతూ వుంటే అలా, డల్‌గా నించుంటావేంటి - రియాక్షన్ ఏదీ? " అన్నారు తీవ్రంగానే. "ఉండదండి " అని బదులు చెప్పాడు కుటుంబరావు - ఠపీమని. "ఏం?" "నాకు ఇచ్చిన అగ్రిమెంటు కాగితాల్లో "టు యాక్ట్ ఇన్ ది పిచ్చర్" అనే రాసి వుందండీ - రియాక్సన్ ఇవ్వాలని రాసిలేదు!" అని చెప్పేసరికి, ప్రసాద్‌గారితో సహా అందరూ పకపకా నవ్వారు అతని సమయస్ఫూర్తికి. సమయం, సందర్భం దొరికితే చాలు - ఏదో జోక్ విసుర్తూనే వుండేవారు ఆయన. సినిమా నటీనటులందరూ ఒక వేడుకలో పాల్గొనడానికి వెళ్లి రైలు దిగారు. నడకలో కుటుంబరావు కాస్త వెనకబడ్డారు. ఒక యువకుడు పరకాయించి చూసి, "మీరూ సినీ

### శ్రీశ్రీ కి చదలవాడ సూచన




'పంతాలు-పట్టింపులు' సినిమాలో శ్రీశ్రీ 'ఇనుకోరా ఈ మల్లన్నమాట ఇనుకోరా' అనే ఓ తాగుడుపాటనురాశారు. ఆ పాటను ఆయన రాస్తున్నప్పుడు పక్కనే చదలవాడ కుటుంబరావు కూడా ఉన్నారు. ఓవైపు శ్రీశ్రీ పాటరాయటం, సంగీత దర్శకుడు పెండ్యాల స్వరకల్పన చేయటం ఏకకాలంలో జరుగుతుంది. మొదటి చరణంలో 'ఈ బతుకుందే ఎంతో బరువు' అని రాశారు శ్రీశ్రీ. 'ఎంతో బరువు' బదులు 'మాసెడ్డ బరువు' అంటే బావుంటుందని సూచించారు చదలవాడ. "ట్యూన్‌లలో భంగం రాకుంటే నా అభ్యంతరం లేదు" అని అన్నారు శ్రీశ్రీ. పెండ్యాల 'ఓకే' అన్నారు. దాంతో శ్రీశ్రీ సరే అన్నారు.

**(శ్రీశ్రీ సినీగీతాల సంకలనం 'పాడవోయి భారతీయుడా' నుంచి)**



'పెళ్లిచేసి చూడు' సినిమాలో ...

యాక్టరే గదండీ'' అని అడిగాడు. "ఆ ముందెళ్తున్నారు చూడు - ఆళ్లు సినీ యాక్టర్లు. నేను శనీయాక్టర్నీ'' అని కిచకిచమని నవ్వారు - ఆయన.

ఒక షూటింగ్ లంచ్‌టైములో, "భోజనాలు వచ్చాయా?'' అని ఎవరో మేనజర్ని అడిగారు. "వచ్చేస్తాయండీ - బండెళ్లింది'' అన్నాడు మేనేజరు. చదలవాడగారు కిచకిచమన్నారు. "చూశా! సినిమావోళ్లూ రాచ్చసులే. ఆ రోజుల్లో బకాసురుడికీ ఆళ్లకి భోజనాలు బళ్ల మీదెళ్లేవి. ఇవాళ సినిమా వోళ్లకీ బళ్లమీదనే భోజనాలు!'' అని మేనేజర్‌తో సహా, నవ్వించి, తానూ నవ్వారు.

ఒక సందర్భంలో సరదాగా మాట్లాడుతూ, "ఇదిగో! ఈ సినిమాలకి రాకముందు అనుకునే వాణ్ణి. 'ఎన్నాళ్లుంటార్లే - ఈ రేలంగి, రమణారెడ్డీ, శివరావూ ఈళ్లంతా. మనం గనుక రంగంలో కాలు పెడితే, అంతా ఇంటికెళ్ల వలసిందే' అని. మరి ఇంతకాలం అయిందా నేను ఏషాలు ఏస్తున్నానా - ఆళ్లు అట్టాగే వుండారు - మనమే ఇంటికెళ్ళాల్సినట్టుంది'' అని, చిరువేదాంతిలా చెప్పారు. 'అహంకారం' కూడదన్నట్టుగా! ఆయనది గొప్ప వ్యక్తిత్వం. జోక్స్ చెయ్యడమే గాని ఎవరి మీదనో చెప్పుకోడం, ఈర్ష్యలూ, అసూయాలు ఏమీ వుండేవి కావు. తన పనేదో తాను చేసుకోవడం తప్ప - ఇంకెందులోనూ జోక్యం చేసుకునే వారు కాదు - జోక్స్‌తో తప్ప. అదే ఆయన 'జోకొ'యం.

ఆయన మృతి కూడా జోకా, నిజమా అన్నట్లు అయిపోయింది. 'అర్ధరాత్రి' (68) సినిమా షూటింగులో రాత్రంతా పాల్గొని, అందర్నీ తెగ నవ్వించి, ఇంటికెళ్లారు. పొద్దునే వేరే షూటింగుకి వెళ్లాలని, స్నానం చేసి పడకుర్చీలో పడుకున్నారు. కారు కోసం నిరీక్షిస్తూ. కారొచ్చింది. అంతకు ముందే ఆయన 'వేరే కారు'లో వెళ్లిపోయాడని, మనమడికేం తెలుసు? "తాతయ్యా కారొచ్చింది'' అని లేపుతున్నాడు. కుటుంబరావు లేవలేదు.... ఆరిపోయే ముందు దీపం మరింత కాంతితో వెలుగుతుంది. అలా క్రితం రాత్రంతా, అన్ని జోకులతో నవ్వించిన ఆ దీపం, తెల్లారేలోగా ఆరిపోయింది! ఇహ నవ్వులు వద్దని, ఇహలోకం చాలించిన చదలవాడ పాతసినిమాలో కనిపించి - ఒక్కసారి చలింపజేస్తారు.

# 'మాయాబజారు' చిత్రంలో చదలవాడ నటించిన ఓ హాస్య సన్నివేశం

**చిన్నమయ్య (రమణారెడ్డి) రాక్షసులకు విద్య నేర్పుతుంటాడు. అటెండెన్సు పిలుస్తూంటాడు. లంబూ, జంబూ అని మూడుసార్లు పిలిచాక లంబూ (చదలవాడ) జంబూ (నల్లరామ్మూర్తి) నెమ్మదిగా పలుకుతారు.**

చదలవాడ : వై జియా
నల్ల : వై గురూ హ, హ (ఆవలిస్తాడు)
రమణారెడ్డి : ఊ, బుద్ధిగా నే చెప్పినట్లు చదువుకున్నారో మీకు వాక్శుద్ధి చేస్తాను. లేదా ఘటోత్కచులు వారు వచ్చి మీకు దేహశుద్ధి చేస్తారు.
చదలవాడ : అగ్గీ, బుగ్గీ కాకయ్యా, నీ చదువుతో మా చావు మూడిందిలే
నల్ల : (కసిగా) చెప్పవయ్యా, చెప్పు.
రమణారెడ్డి : (చదువు చెపుతూ) జే భ్యాం భ్యస్
చదల, నల్ల : జే బయాం బస్సు
రమణారెడ్డి : శివశివ శివ శివ
చదల, నల్ల : శివ శివ శివ శివ



రమణారెడ్డి : ష్
చదల, నల్ల : ష్
రమణారెడ్డి : ఒరేయ్ లంబూ భ్యాం
చదలవాడ : బయాం
రమణ : భ్యస్
నల్ల : బస్సు
రమణారెడ్డి : శివశివశివ
చదల, నల్ల : శివ శివ శివ
రమణారెడ్డి : ఊ (హూంకరిస్తాడు)
చదల, నల్ల : ఊ (అనుకరిస్తారు)
రమణారెడ్డి : పేరుకి అగ్రనాయకులు, ఆ మాత్రం అనలేరూ, నోరు తిరగదూ.
చదలవాడ : నోరు తిరక్కపోతేనే జియ్యా, మేమే తిరుగుతాం.
(గిర గిర గిరకీ ఉరికీ.... అంటూ తిరుగుతారు.
ఇంతలో **ఘటోత్కచుడు** (ఎస్.వి.రంగారావు) వస్తాడు. కొద్దిసేపయ్యాక విద్యాభ్యాసం కొనసాగుతుంది.)
రమణారెడ్డి : జంబూ పాండవులు అస్మదీయులు. అంటే మనవాళ్లు... ఊ చెప్పు.
నల్ల : పా.... ఆ ఆ ఆండవులు అసమదీయులు
రమణారెడ్డి : వీడు నాకే విద్య నేర్పుతున్నాడు నాయకా. అస్మ అనమనండి.
నల్ల : ఎందుకూ, ఆ మాటతో మన వాళ్లని తెలుసుకుంటాం నాయకా!
రంగారావు : చాలు, చిన్నమయ్యా! పాండిత్యం కంటె జ్ఞానమే ముఖ్యం. వేసుకో వీరతాడు!
నల్ల : (కులుకుతూ) వెయ్యి
రమణారెడ్డి : ఒరేయ్ లంబూ, పాండవులు అస్మదీయులు, మరి వారికి విరోధులు కౌరవుల్ని ఏమనాలో చెప్పు.
చదలవాడ : తసమదీయులు... తసమదీయులు.
రమణారెడ్డి : ఓరి నీ తెలివీ నువ్వూ!.... అస్మదీయులకు విరుగుడు తస్మదీయులని వీడు పుట్టించాడు ప్రభూ.
రంగారావు : అవునవును. ఎవరూ పుట్టించకుండా మాటలెలా పుడతాయి? వెయ్ వీడికి... రెండు.
రమణారెడ్డి : రెండా!? (అని ఆశ్చర్యపడి) వెయ్
(అని చదలవాడకు నమస్కారం పెడతాడు).

# పాషాణ హృదయుల శాపనానికి ఘనీభవించిన వీణ

అది పెళ్ళిమండపం...!
ఆ రోజుల్లో పెళ్ళిళ్ళంటే ఐదేసి రోజులు చేసేవారు...
ఇంట్లో పెళ్ళయితే ఊరంతటికీ పండగే...
పెళ్ళయిపోయింది!!
ఇక మొగపెళ్ళివారు కాళ్ళు కడుక్కుని... బంతి భోజనాలు ప్రారంభించారు
గుమ్మడికాయ పులుసు ఘుమ ఘుమలు
అప్పడాల కరకరలు...
బూరెల బుస బుసలు...
ఆవ పెట్టిన పులిహోర ఘాటు...
ఆ పందిట్లో నేతి ఝూరీ చెంబుతో ఓ తొమ్మిదేళ్ళ కుర్రాడు 'త్రిపాద' నక్షత్రంలా తిరిగేస్తున్నాడు - ఎక్కడ బూరెకి బొక్క పెట్టినా నేతిని వొంపేస్తూ-నింపేస్తూ...
భోజనాలయ్యాయ్!... గోవిందనామ స్మరణా అయిపోయింది!!
తాంబూలం సెక్షన్! అంతేగద...
ఆత్మకింపయిన భోజనం
తర్వాత కప్పురవిడెం!...
ఓ పెద్దాయన నోటికి బీడా బిగించీ... 'రేయ్ అబ్బాయ్ ఇలా రారా' అని కుర్రాణ్ణి కేకేశాడు!!
కుర్రాడొచ్చీ... 'చెప్పండి!!' అన్నాడు వినయంగా
"కమ్మటి నేతితో కడుపు నింపేశావ్!... ఇపుడు కమ్మటి పాటొకటి అందుకోరా!..." అన్నాడు అంతే
కుర్రాడు నేతి చెంబు గట్టుమీద పెట్టి...
రెండు చేతులూ
కట్టుకునీ
'నీల మేఘశ్యామా!...' అంటూ బిళహరి రాగంలో మొదలెట్టాడు. కళ్యాణ మండపం కళకళలాడిపోయింది... ఆ పాట ఆ కుర్రాడి గొంతులోంచి మొదలై... పెళ్ళి మండపం చుట్టు ప్రదక్షణ చేసి తాళం వేస్తున్న పెద్దవాళ్ళ పాదాలకు నమస్కరించి... రూపాయి బిళ్ళలాంటి ముత్తయిదువుల కుంకుం బొట్టు చుట్టూ తిరిగి... తాంబూలపు పళ్ళెంలోని జాజికాయ జాపత్రినీ తడిమి.. కొత్త పెళ్ళికొడుకు మీసాలట్టుకుని వేళ్ళాడీ... కొత్త పెళ్ళి కూతురు లోలకుల్లో ఉయ్యాలూగి... ఆ పిల్ల కళ్యాణ తిలకంలో కలిసి పోయింది!!

ఆ కుర్రాడి పేరు **గుమ్మలూరి వెంకటశాస్త్రి...**
ఆ పెద్దాయన పేరు.. **వాసా అప్పయ్యగారు...**
అంతే... ఆ తొమ్మిదేళ్ళ కుర్రాణ్ణి తన శిష్యుడిగా ప్రకటించేసి... తీసుకుని చక్కా పోయాడాయన.

గురువుగారి వాత్సల్యం... స్వయంకృషితో గుమ్మలూరి శాస్త్రిగారు త్వరలోనే ఇటు గానం... అటు వీణా వాదనంలో నిష్ణాతులై పోయారు... వాసా అప్పయ్యగారికి ఈ శిష్యుడంటే పరమ ప్రీతి. అలాగే శిష్యుడికి గురువుగారి మీద అపారమైన భక్తి... ఎక్కడ సంగీత పోటీలు జరిపినా... శిష్యుణ్ణి వెంటపెట్టుకెళ్ళి... బహుమతుల్ని పట్టుకొచ్చేసేస్తారు గురువుగారు. వీరి గురు-శిష్య సంబంధం చాలామందికి కన్నుల పండుగగానూ... కొందరికి మాత్రం కంటగింపుగానూ ఉండేది...!
ఓ రోజు సంగీత పోటీలో... పాల్గొని సరిగ్గా ప్రాక్టీసు చెయ్యని 'హరికాంభోజి' రాగంలోని 'రామా నను బ్రోవరా...' కీర్తన పాడుతూ... స్వరకల్పన ఏ చోట వెయ్యాలో సందేహిస్తూ పాట ఆపేస్తే.. సభలోని

వారు "ఏం నాయనా వెనక ముక్క రాకనా... ముందు ముక్కతోచకనా..." అని వేళాకోళం చేస్తే... వెంటనే గురువుగారు తన శిష్యుడి ఆంతర్యాన్ని గ్రహించి... "అబ్బే అదేం కాదర్రా... ముందు 'గరి' నిలుపా... వెనుక 'దని' వెసులా అని సందేహిస్తున్నాడు" అని సమాధానం చెప్పగానే... గురువుగారు అందించిన కిటుకు అందుకునీ 'పమగరి-రామా నను బ్రోవరా' అని స్వరకల్పన చేసి ఆ రోజు వీణతో పాటు, పాటకి కూడా ప్రథమ బహుమతి పొందాడు... ఇదీ గురు-శిష్య సంబంధం...!

స్ఫురద్రూపం, సుకుమార గాత్రం ఉన్న గుమ్మలూరి శాస్త్రిగారిని బొబ్బిలి రాజావారు... భామవేషం వెయ్యాల్సిందిగా ఆజ్ఞాపించారు... మనసులో అయిష్టంగా ఉన్నా రాజాజ్ఞ గనుక... భామ వేషం ప్రాక్టీసు చెయ్యాల్సి వచ్చింది. దాంతో సంగీత సాధన మూలపడింది!... ఓ రోజు గురువుగారితో చెప్పి బాధపడి "నేనీ వేషాలెయ్యనండి రాజా వారు ఏమి చేసినా సరే...!" అని కళ్ళనీళ్ళు పెట్టుకుంటే... శాస్త్రిగారి ఆత్మాభిమానానికి, సంతోషపడి... "మరేం పర్లేదునాయనా రాజాజ్ఞ అయ్యాక వెయ్యకపోతే ఈ సంస్థానంలో బతగ్గలమా... నువ్వేం బెంగ పెట్టుకోకు... నీ సంగీతం నిన్ను విడిచి ఎక్కడికీ పోదు..."

అని చీకట్లో మామిడి తోటల్లో రహస్యంగా వీణ నేర్పేవారు... రాజుగారికి తెలీకుండా!!

గురువుగారి వాత్సల్యాంబుధిలో మునిగిపోయిన గుమ్మలూరి శాస్త్రిగారు గురువుగారి మీద ఆ చిన్నతనంలోనే రెండు సంస్కృత శ్లోకాలు రాశారు...

1. **సంగీత శాస్త్రతత్వజ్ఞం - సత్యసంధం దయానిధిం**
**అప్పయాఖ్యాగురం వందే - వాసాన్వయ సుధాకరం**
2. **సంగీత శాస్త్రార్థరసానుభిజ్ఞ ముత్ఫుల్ల నీ లోత్పల పత్రనేత్రం**
**దయాలసన్మానస పద్మసంస్థం - వాసాప్పయాఖ్యాం**
**గురుమాశ్రయామి.**

అలాగే శాస్త్రిగారు 'పల్లవోల్లాసిని' అనే ఉత్కృష్ట సంగీత గ్రంథం ఒకటి రాశారు - ఉదాహరణకి పల్లవోల్లాసినిలో 'ముక్తాయి' అనే పదానికి అర్థం ఇలా చెప్పారు..." పాడేటప్పుడు గానీ వాయిద్యాన్ని వాయించేటప్పుడుగాని చివర మనం ఏ అక్షరాలను పాడి పల్లవి ఆరంభిస్తామో ఆ అక్షరాలకు 'ముక్తాయి' అని పేరు!"

బొబ్బిలివారి ఆస్థానంలో ఆయన కళాకారుడిగా ఉంటున్న రోజుల్లో... ఒక రాత్రి భోగం మేళం పెట్టించారు రాజావారు...

**గుమ్మలూరి శాస్త్రిగారి**
**కాలం-వివరాలు-ఫోటో అలభ్యం...**
**ఆయన ఆత్మకి నా నమస్కారం**
(డాక్టర్ సి.విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలూ సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)
-భరణి

**తనికెళ్ళ భరణి**



పెద్దవాళ్లంతా హాజరయ్యారు... విలాసినులు అలంకరించుకుని నాట్యానికి సిద్ధమయ్యారు... మధువు ఏరులై పొంగుతోంది!! మత్తెక్కిన కళ్ళతో రాజావారు... చప్పట్లు కొట్టీ... 'ఎవరక్కడ' అన్నారు. ఎవరెవరో ఎక్కడెక్కడో ఉన్నారు.

"చిత్తం ప్రభూ..." అన్నాడు సేవకుడు

"వెళ్ళి శాస్త్రిగారిని పిల్చుకురండి" రాజాజ్ఞ!

"కాని వారు..." నసిగాడు సేవకుడు

"వెళ్ళి పిల్చుకురా... వారు ఈ మేళంలో వీణవాయించాలి... ఇది మా శాసనం!!"

...సేవకుడు వెళ్ళి... రాజావారు చెప్పిన విషయం చెప్పాడు!

ఆ క్షణంలో అభిమానధనుడైన శాస్త్రిగారి మొహం జేవురించింది!!

ఆగ్రహంతో ఉడికిపోతూ... "నా వంటి సంగీత విద్వాంసుణ్ణి... మేజువాణీలో వీణ వాయించమంటాడా...! వెళ్ళి చెప్పు... గుమ్మలూరి శాస్త్రి వీణ వాయించడం మర్చి పోయాడు అని... మళ్ళీ మాట్లాడితే చచ్చిపోయాడు అని...!!!"

అంతే మళ్ళీ శాస్త్రిగారెన్నడూ వీణ ముట్టుకోలేదు!!

కళాకారుడు నిరంకుశుడు మరి!!!

✪

ఈ ఆర్టికల్‌పై మీ అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి నేరుగా తెలియజేయండి. ఆయన అడ్రసు:
'సౌందర్య లహరి'
8-3-678/6,
ప్రగతినగర్
హైదరాబాద్ - 500 045

# పిల్ల (జెల్ల) కాయల స్పెషల్



"మా ఇంటి కొస్తావా నాకో కొత్త తమ్ముడు పుట్టాడు.... చూద్దువు గాని...."
"ఫస్ట్ నువ్వే మా ఇంటికి రా.... నాకో కొత్త అమ్మ పుట్టింది..."



"ఆరోజు అలా ఎందు కేడ్చానో తెలీదు గానీ తల్చుకుంటే ఇప్పటికీ భలే సిగ్గేస్తూ ఉంటుంది".
"ఎప్పుడూ...."
"అదే.... నేను పుట్టినప్పుడు".



'నమస్తే డాక్టర్ ... వన్ ఇయర్ క్రితం నాకు న్యుమోనియా వచ్చినప్పుడు వైద్యం కోసం మీ దగ్గరికి వచ్చాను. తడికి, తేమకు దూరంగా ఉండమన్నారు'.
"అవునవును.... గుర్తొచ్చింది. ఇప్పుడు ఆరోగ్యంగానే ఉన్నట్టున్నారు.... ఏంటి ప్రాబ్లెమ్?"
"స్నానం చేయటం ఎప్పుడు మొదలు పెట్టచ్చో కనుక్కుందామని".





"అమ్మా... చిన్నతమ్ముడు నిజంగా స్వర్గం నుంచే వచ్చాడా?"
"అవున్రా..."
"అయితే తప్పు దేవుడిది కాదన్నమాట"
"అంటే"
"వీడిగోల భరించలేక దేవతలే వీడిని యిక్కడికి విసిరేసి వుంటారని అనిపించిందమ్మా... అందుకని...."



"భారతదేశం ఎందుకు ముందుకు పోలేక పోతోంది?".
"హిమాలయాలు అడ్డుగా వున్నాయి కదా టీచర్...".



ఇంగ్లీషు భాష నేర్పే కోచింగ్ సెంటర్ దగ్గర సైను బోర్డులో యిలా రాసి వుంది.
"ఇఫ్‌యూ ఆర్ వీక్ ఇన్ ఇంగ్లీష్ ... వుయ్ విల్ ఇంప్రూవ్ యువర్ వీక్‌నెస్"



".... హిమాలయాలు ఎక్కడున్నా యిరా?".
"తెలీదండీ...".
"తెలీదా... బెంచీ ఎక్కు.... బెంచీ ఎక్కు ... వెధవ అప్పటికి గానీ తెలీదు నీకు".
'బెంచీ ఎక్కినా కనపడటం లేదు సార్....'.



"చూడమ్మా.... బయట నిచ్చెన పడిపోయిన చప్పుడయింది..." వంటింట్లోంచి అరిచింది తల్లి.
"అవునమ్మా...".
"మీ నాన్నగానీ పడలేదు కదా...." మళ్ళీ కంగారుగా అడిగింది తల్లి.
"లేదమ్మా... ఇంకా గోడమీదే వేళ్ళాడుతున్నారు...".

# పిల్ల (జెల్ల) కాయల స్పెషల్



"టిచర్... టీచర్ ఈ సారి నాకో చిన్నతమ్ముడు పుడతాడు...."
"తమ్ముడే పుడతాడని నీకెలా తెలుసు?"
"అప్పుడే మర్చిపోయారా టీచర్... క్రితంసారి మా అమ్మకి వంట్లో బావుండనప్పుడు .... నాకో చిన్న చెల్లెలు పుట్టలేదూ?"
"అవునూ.... పుట్టింది... అయితే మళ్ళీ మీ అమ్మకు వంట్లో బాగా లేదా?"
"లేదు టీచర్... ఈ సారి మా నాన్నకి వంట్లో బావుండలేదు...."



"ఇదిగో... పిల్లలూ మీకో చిన్న లెక్క యిస్తున్నాను. ఇంట్లో ఐదుగురు పిల్లలు వున్నారను కుందాం. వాళ్లమ్మ దగ్గర నాలుగే నాలుగు బంగాళ దుంపలు వున్నాయనుకుందాం... అవి వాళ్ళకి సమానంగా పంచాలి. ఎలా పంచ గలుగు తుంది?"
"ఏముంది టీచర్.... బంగాళాదుంపల్ని బాగా వుడకబెట్టి మెత్తగా చేసి చిదిపేసి పంచెయ్యటమే....".





ఇద్దరు చిన్న పిల్లలు జైలు కెళ్ళిన వాళ్ళ వాళ్ళ తండ్రుల గురించి యిలా గొప్పలు చెప్పు కుంటున్నారు.
"నీకు పసిఫిక్ మహాసముద్రం తెలుసుకదూ అంత పెద్ద సముద్రం.పట్టేలా కన్నం చేసింది ఎవరనుకుంటున్నావ్.... మా నాన్నే...." చెప్పాడు మొదటి కుర్రాడు.
రెండో కుర్రాడు ఓ క్షణం సేపాగి అన్నాడు.... "డెడ్‌సీ గురించి నువ్వెప్పుడయినా విన్నావా? దాన్ని చంపింది ఎవరనుకున్నావ్? మా నాన్నే...."



"నువ్వు సబ్బుతో మొహం కడుక్కోలేదని మీ అమ్మకు ఎలా తెలిసిందంటావ్?"
"సబ్బుని తడి చేయటం మర్చిపోయానురా..."



"నేను సూర్యుడి దగ్గరకు వెళతాను అలాంటి యాత్ర చేస్తే నాకు మన దేశానికీ ఎంతో పేరు ప్రఖ్యాతులు వస్తాయి".
"వేళాకోళాలాడుతున్నావా..... సూర్యుడా మజాకా? నువ్వు సూర్యుణ్ణి చేరుకునేలోపే మాడిమసై పోతావ్ అక్కడ ఎంత వేడిగా వుంటుందో తెలుసా నీకు?"
"నేనేం పిచ్చాణ్ణి కాదు సార్... అందుకే రాత్రిపూట వెళ్తా.."



"మీరు కొత్తగా కట్టుకున్న యిల్లు ఎలా వుందే"
"చాలా బావుందే" నేను రాసుకోటానికి పడుకోటానికి నాకో గది వుంది. మా చెల్లాయిలకి కూడా ఎవరి గదులు వాళ్ళకి వున్నాయ్. ఎటొచ్చీ మా అమ్మకే ప్రత్యేకంగా ఏ గదీ లేదు.... మా నాన్న గదిలోనే పడుకుంటోంది పాపం....'.




# నటిస్తే కిలకిల పాడితే గలగల

హిందీ చిత్రరంగంలో హాస్యానికి సంబంధించిన నటులెందరైనా ఉండవచ్చు కానీ నటీమణులలో చెప్పకోదగినవారు శుభాఖోటే, టున్‌టున్ మాత్రమే! శుభాఖోటే కంటె టున్‌టున్ తెరజీవితం సుదీర్ఘమైనది. శుభాఖోటేను గుర్తుపట్టలేనివారు చాలామంది ఉంటారు కానీ టున్‌టున్‌కి మాత్రం ఒక్కసారి చూస్తే చాలు కలకాలం గుర్తుండిపోతుందామె. కారణం - స్థూలకాయం. మొఖంలో కనబడే అమాయకత్వం. ...అందుకే గయ్యాళి పాత్ర వేసినా ప్రేక్షకులెవ్వరూ ఆమెను తిట్టుకోరు. పైగా తెరమీద కనబడడం తరువాయి... గొల్లున నవ్వేస్తారు.

టున్‌టున్ ఆమె అసలు పేరు కాదు. హాస్య నటీమణిగా మారిన తర్వాత పెట్టుకున్న పేరది. 'హాస్య నటీమణిగా మారిన తర్వాత' అంటే ఆమె చిత్రరంగానికి హాస్యపాత్రలతో పరిచయం కాలేదా? అన్న అనుమానం వస్తే అది కరెక్టే. ఆమె గాయని అవుదామనే చిత్రరంగానికి ప్రవేశం చేసింది. గాయనిగా తన అసలుపేరే ఉపయోగించింది... ఉమాదేవి అని. పూర్తిపేరు ఉమాదేవి ఖత్రి. ఆమె మాతృభాష పంజాబీ...

# టున్‌టున్



## జీవితంలో కొన్ని మైలు రాళ్ళు

ఉమాదేవి ఉత్తరప్రదేశ్‌లో ఓమారుమూల గ్రామంలో పుట్టింది. చిన్నప్పుడే తల్లిదండ్రులిద్దరూ పోయారు. మేనమామ దగ్గిర పెరిగింది. చిన్నప్పటినుండీ మగరాయుళ్ళా తిరిగేది. వాళ్ళది ఛాందసపు పంజాబీ కుటుంబం. ఆడపిల్లలకు చదువెందుకనుకునే వారు. అలాంటి దశలో తనంతట తానే హిందీ చదవడం, రాయడం నేర్చుకుంది. కాస్త ఉర్దూ, ఇంగ్లీషు కూడా నేర్చుకుంది. ఎన్ని నేర్చుకున్నా ఆమె మనసంతా పాటలు పాడడం మీదే ఉండేది. రేడియోలో వినబడే సినిమాపాటలు కంఠతా పట్టి, పాడుతుండేది. సినిమాపాటల మీద గల విపరీతమైన వెర్రి ఆమెను బొంబాయి రైలెక్కి అదృష్టాన్ని పరీక్షించుకోమంది. అంతే రైలెక్కేసింది ఉమాదేవి. అప్పుడామె వయసు 13 ఏళ్ళు మాత్రమే!

తొలిసారిగా 1947లో నజీర్ "వామాజ్ అఙ్రా" సినిమాకు పాటపాడే అవకాశం వచ్చింది. అందులో పాడినందుకుగాను అప్పట్లోనే 200 రూపాయలిచ్చారు. కానీ ఉమాదేవికి సంతోషం కలగలేదు. కారణం నౌషద్‌అలీ సంగీత దర్శకత్వంలో పాడే అవకాశానికై ఆమె తహతహలాడుతోంది. అప్పటికీ, ఇప్పటికీ కూడా ఆమె దృష్టిలో సంగీతదర్శకుడు అనే పేరుకు నౌషద్ ఒక్కడే అర్హుడు. మీ ముందు పాడి చూపించే అవకాశం ఇమ్మని ప్రాధేయపడగా, పడగా నౌషద్ సరేనన్నాడు. ఆ 13 ఏళ్ళ పిల్ల నూర్జహాన్ పాడిన 'ఆంధియాఁ గమ్‌కీ యూ చలీ, బాగ్ ఉజడ్ కే రహ్‌గయే' పాడసాగింది. అది వింటూనే మధ్యలోనే నౌషద్ ఆపమన్నాడు. ఉమాదేవి ఉలిక్కిపడింది. 'నీ సత్తా నాకు తెలిసిపోయింది. ఛాన్సు ఇస్తున్నా' అన్నాడు నౌషద్. అన్నమాట నిలబెట్టుకున్నాడు. తను చేసే ప్రతీ సినిమాలో కనీసం ఓ రెండు పాటలు ఆమెకోసం అట్టేపెట్టేవాడు. ఆమె నౌషద్‌ను అన్నగారిగా భావించింది. రాఖీ కట్టింది. నౌషద్ కూడా ఆ అన్నాచెల్లీ అనుబంధాన్ని గౌరవించాడు. స్వంత అన్నగారిలా ఆమె మంచీచెడూ కనిపెట్టి చూసుకున్నాడు.



ఎ.ఆర్.కర్దార్ అప్పట్లో పెద్ద దర్శకనిర్మాత. హోలీ (1940), స్వామి (1941) బాప్‌రేబాప్ (1955), సంజోగ్ (1943), షాజహాన్ (1946), దర్ద్ (1947), దాస్తాన్ (1950), దిలేనాదాన్ (1953), దోఫూల్ (1958), దిల్‌దియా దర్ద్‌లియా (1966) ఇలా ఎన్నో విజయవంతమైన చిత్రాలు నిర్మించిన స్టూడియో అధినేత. ఆయన సినిమాలకు నౌషద్ సంగీత దర్శకత్వం వహించేవాడు. ఉమాదేవి వాయిస్ నచ్చిన నౌషద్ కర్దార్‌కి రికమెండ్ చేశాడు. కర్దార్ వెంటనే రూ॥500/- ల జీతంపైన ఆమెతో అగ్రిమెంటు కుదుర్చుకున్నాడు. ఆ అగ్రిమెంటు అప్పట్లో ఒక వరంలాగేతోచింది ఉమాదేవికి. కర్దార్ సినిమాలలో నౌషద్ సంగీతంలో అద్భుతమైన పాటలు పాడింది. ఆమె పేరు దేశమంతా మారుమ్రోగింది. ఏపాటి అనుభవం, శాస్త్రీయ నేపథ్యం లేకుండా పాడుతోందని విమర్శకులు వెక్కిరించినా శ్రోతలు ఆమెను ఆదరించారు. కానీ కర్దార్‌తో చేసుకున్న అగ్రిమెంటు ఆమెకు గుదిబండగా మారింది. వేరేవారికి పాడకూడదన్న నిబంధనవల్ల ఆమె ఎన్నో ఛాన్సులు పోగొట్టుకుంది. వాటిల్లో 'మహల్' ఒకటి ఉమాదేవికి నష్టం, లతకు లాభదాయకంగా పరిణమించింది. 'ఆయేగా, ఆయేగా ఆనేవాలా' పాట లతకు దక్కింది. అప్పటినుండీ గాయనిగా లత స్థానం సుస్థిరమైంది. ఆమె ధాటికి ఉమాదేవి వెనుకంజ వేయవలసివచ్చింది.

ఉమాదేవి గానకౌశలానికి ముగ్ధులయిన వారిలో మన సాలూరి రాజేశ్వరరావు ఒకరు. ఎస్.ఎస్.వాసన్ తమిళం హిందీలో తీసిన 'చంద్రలేఖ'(1948) సినిమాకు సంగీత దర్శకత్వం వహిస్తూ దానిలో ఏడు పాటలు పాడడానికి ఉమాదేవిని ఆహ్వానించారు. వాటిల్లో మూడు పాటలు - 'సాజన్ రే ఆజారే' 'మాయిరీ మైతూ', 'మన్‌భావన్ సావన్ ఆయా రంగ్ జమానే' శాస్త్రీయసంగీతంపై ఆధారపడినవి. తను శాస్త్రీయసంగీతం అభ్యసించలేదు. కాబట్టి పాడలేనంటూ ఉమాదేవి జంకింది. రాజేశ్వరరావు గారు నీకేం ఫర్వాలేదు నేనున్నానంటూ పాడించారు. ఉమాదేవి పాటల్లో 'చంద్రలేఖ'లో పాడిన ఏడు పాటలూ అత్యుత్తమమైనవంటారు సంగీత ప్రియులు. కానీ ప్రతీ విజయానికీ ఓ మూల్యం చెల్లించవలసి ఉంటుంది. అగ్రిమెంటుకు విరుద్ధంగా ఇతరులకు పాడినందుకు ఆగ్రహించిన కర్దార్ జీతం ఆపేశాడు. ఆమెచే పాడించడం మానేశాడు. అక్కడి నుంచీ ఉమాదేవి స్వర జీవితానికి తెరదిగింది.

ఉమాదేవిగా 'టున్ టున్' పాట అనగానే వెంటనే గుర్తుకు వచ్చేది - "కర్దార్ తీసిన 'దర్ద్' సినిమాలోని 'అఫ్‌సానా లిఖ్ రహీ హూఁ'". దేశ విభజనకు ముందు రోజుల్లో సినీ గాయనీమణులుగా రాజ్యం ఏలిన జోరాబాయి అంబాలేవాలీ, నూర్జహాన్, షంషాద్‌బేగం ఒకరకమైన నాసికాధ్వనితో పాడేవారు. ఉమాదేవి కూడా అదే స్టయిల్లో పాడిందీ పాట. బ్రహ్మాండమైన హిట్ అయింది. అలాగే సురైయా తో కలిసిపాడిన 'యే కౌన్ చలా'. దర్ద్ పాట హిట్ కావడంతో నౌషద్ ఆమెకు మరిన్ని ఛాన్సులు ఇచ్చాడు. 'అనోఖీ అదా'లో 'కహీఁ జియాడోలే', 'దిల్‌కో లగాకే కుఛ్ భీనపాయా' వంటి పాటలు ఎంతో ప్రజాదరణ పొందాయి. 'దిల్లగీ, 'చాంద్‌నీ (చాంద్‌నీ రాత్‌హై, దేఖీ క్యా రాత్‌హై), 'రాత్', 'నాటక్' -ఇలా ఎన్నో మంచి సినిమాలు, గుర్తుంచుకోదగిన పాటలు పాడింది. ఇంత చక్కటి గాయని తన గాత్రమాధుర్యానికి కాకుండా స్థూలకాయానికి గుర్తుండిపోవడం ఓ దురదృష్టం.



లతా మంగేష్కర్, ఆశాభోంస్లేల పాటలు విన్నాక ప్రేక్షకులు, సినీనిర్మాతలూ తక్కిన వారిని పట్టించుకోవడం మానేశారు. దేశ విభజన కారణంగా చిత్ర పరిశ్రమ సంక్షోభంలో పడింది. ఉమాదేవికి పాడే ఛాన్సులు తగ్గిపోయాయి. లతాతో పోటీ పడలేకపోవడం ఒక కారణం కాగా శరీరంలావెక్కడం మరో కారణం. ఏంచేయాలో తోచక తన రాఖీ సోదరుడు నౌషద్‌ను సలహా అడిగింది. అప్పుడు నౌషద్ 'బాబుల్'(1950) సినిమా తీస్తున్నాడు. 'నీకు మంచి టైమింగ్ ఉంది. కామెడీకి పనికొస్తావు. గాయనిగా రిటైరై హాస్య నటిగా పునర్జన్మ ఎత్తు' అని సలహాయిచ్చాడు. తన సినిమాలో హాస్యపాత్ర ఇచ్చాడు. ఆ పాత్ర పేరు 'టున్ టున్'. ఇక అదే ఆమె తెరనామధేయం అయిపోయింది.



హాస్యనటీమణిగా టున్‌టున్ వందలాది పాత్రలు చేసింది. భారీ శరీరాన్ని ఈడ్చుకునివస్తూ, గొంతు చించుకుని అరుస్తూ, అప్పుడప్పుడు తన అభిరుచిని గుర్తుకుతెచ్చేలా పాటలు పాడుతూ, గయ్యాళి భార్యగా హీరోని ప్రేమించే అమాయక యువతిగా, స్టూడెంటుగా ఇలా ఆమె వేయని వేషంలేదు. ముఖ్యంగా 'ఆర్‌పార్', 'మిస్టర్ అండ్ మిసెస్ 55', 'ప్యాసా', 'మోమ్‌కీ గుడియా'లో ఆమెపాత్రలు బాగా గుర్తుండి పోతాయి. ఆమె భారీ శరీరాన్ని ఆధారం చేసుకుని సినిమా రచయితలు అనేక సన్నివేశాలు సృష్టించారు. ఒక సినిమాలో ఇంటికి ఎవరోవస్తే యజమాని 'రామ్‌కలీ' అని తన పనిమనిషిని పిలుస్తాడు, 'రామ్‌కలీ' అనేది గ్రామీణ యువతులు సాధారణంగా పెట్టుకునే పేరు. కలీ అంటే మొగ్గ అనే అర్థం ఉంది. పనిమనిషి వచ్చి గుమ్మంలో నిలబడుతుంది. చూస్తే టున్‌టున్. అతిథి ఆశ్చర్యపడతాడు- 'కలీ(మొగ్గ) ఇలా ఉంటే పువ్వెలా ఉంటుందో!?' అని!

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

## భూతవైద్యంలో తన అనుభవాల్ని జంఘాలశాస్త్రి చెబుతున్నాడు...

"కొంతకాలం క్రితం దేశమంతా తిరుగుతూ ఒక ఊరు వెళ్ళాను. అక్కడ మారీచశాస్త్రి అనే భూతవైద్యుణ్ణి కలిశాను. అప్పుడు నా వయసు పదహారు. నా వైఖరిని బట్టి నా వంటి దేశదిమ్మరి తనకు శిష్యుడుగా ఉండదగ్గ వ్యక్తి అనుకుని "కొన్నాళ్ళు నా వద్దనే ఉండరాదా?" అన్నాడు. సరేనన్నాను. మర్నాడే భూతవైద్యశాల తెరిచాం. రెండు బుట్టలతో నూలుదారాల ముళ్ళు, మూడు పళ్ళికలతో తాటాకుల ముక్కలు, రెండు మూకుళ్ళతో బూడిద, మూతలేని దేవదారు పెట్టెలో కొన్ని రాగిరేకులు, రెండు ముంతలలో పసుపు, వెదురుగొట్టంలో ఎర్రని అక్షింతలు - ఇవీ మా వైద్యశాలలో మందులు. తాటాకు, నూలుదారం అంటే వాటిమీద పేషెంట్లకు గౌరవం ఉండదని గురువుగారు కొన్ని వింతపేరులు కల్పించాడు.



# దెయ్యం చిరునామా...

# సాక్షి



కవిశేఖర
పానుగంటి
లక్ష్మీనరసింహారావు

వైద్యశాలలో సర్జరీ విభాగం కూడా ఉండాలి కాబట్టి రెండు చీపురు కట్టలు, వేపబెత్తాల కట్ట, దూలగొండి ఆకు, నూగుతో కలిపిన విభూతి, రెండు జతల ఇనుపగోళ్ళు, గట్టిబిరడాలు గల సీసాలు (భూతాన్ని వాటిల్లోకి ఆకర్షించి మూత పెట్టేయడానికి), ఒక పట్టుకారు, వీటికి కూడా గంభీరంగా అనిపించే పేర్లు పెట్టడం జరిగింది. చీపురుకట్ట పేరు కాంతా కరవాలం. వేపబెత్తం పేరు బాలబుద్ధిఉద్దీపని. దూలగొండిబూడిదెకు ఉగ్రనారసింహం. ఇనపగోళ్ళకు కాళికాదంష్ట్రాలు. సీసాకైతే మరీ పెద్దపేరు -క్షోణీకుక్షినిక్షేపకము. (అంటే భూమి కడుపులో దాచేది అని తెలుగర్థం). పటుకారుకి వీరాంజనేయం.

డాక్టర్ల క్లినిక్‌లో శరీరభాగాలకు సంబంధించిన మ్యాప్‌లు అవీ ఉండడం రివాజు కాబట్టి మేం కూడా నాలుగుగోడల మీద అమ్మవారి విగ్రహాలు వేయించాం. బాల ఒకపక్క. బగళ ఇంకోపక్క. మహిషాసురమర్దని, మళయాళభగవతి (వేరే రాష్ట్రపు దేవతలైతే మరింత మోజు అన్నారు గురువుగారు) ఎదురెదురు గోడలు అలంకరించారు. ఇవి కాకుండా గురువుగారి గురువుగారైన గుంటుపల్లి గురులింగదేవర విగ్రహం ఓ మూల పెట్టాం. తర్వాత నేలను కూడా విడిచిపెట్టలేదు. వేర్వేరు భూతాలకు వేయవలిసిన వేర్వేరు ముగ్గులు బొమ్మలు అక్కడక్కడ సుద్దతో వ్రాయించాం. ఇవికాక తాళపత్రగ్రంథం ఒకటి అద్దాల పెట్టెలో అలంకారంగా పెట్టాం. దాంట్లో ఏముందో నాకు తెలీదు. మా గురువుగారికి తెలుసునో తెలియదో నాకు తెలియదు.



మా గురువుగారు నడివయస్సు వాడు. పివ్వళ్లబస్తా. పాషాణప్రతిమ. నల్లని గరుసుగడ్డం. పత్తికాయల వంటి కనుగుడ్లు. తుట్ట పెదాలు. భయంకర స్వరూపం. ఒక్క భార్యను కట్టుకుని లొడితెడు సంసారంలో గుడుగుడు గుంచం ఆడటం ఇష్టం లేక బ్రహ్మచారియై లోకం మీద విరుచుకుపడ్డాడు. భూత భేతాళ పిశాచాలతో తను చేసిన బాహాబాహీ కుస్తీపోటీల గురించి ఒళ్లు గగుర్పొడిచేట్లు వర్ణింపగలడు. ఒకసారి ఒక రజక స్త్రీ పిశాచ నిర్మూలనానికి దాని ఇంటికి పోయి ప్రత్యేక శ్రద్ధతో పనిచేస్తూండగా ఆ పిశాచం దాని భర్త రూపం ధరించి వెనుకపాటున వచ్చి ఎర్రగా కాలిన ఇస్త్రీ పెట్టెను వీపుపై అంటించడం వల్ల ఆ మచ్చ ఇప్పటికీ మొండిచేట అంత మిగిలింది.

ఆ రోజు మా క్లినిక్‌లో కూచుని ఉండగా పనిపాటలు చేసుకునే ఒక స్త్రీ వచ్చి, "నా సవతి నన్ను పీక్కు తింటోంది. జుట్టు పీకుతోంది. ఇలాగైతే నాకు నెత్తి మీద వెంట్రుకలు నిలుస్తాయని నమ్మకం లేదు." అంది. మా గురువు ఆమె చేతి నందు కున్నాడు. "శాస్త్రీ, చూశావా, భూతనాడి తర్జనిపై ఎంత విసరుతోందో" అంటూ కాస్సేపు అలానే ఉంచుకుని, తర్వాత ఆమె చేతిని నా చేతిలో పెట్టాడు. నేనూ కాస్సేపు పట్టుకున్నాను కానీ నాకేమీ తెలియలేదు.

నేను చేయి వదిలేసిన తర్వాత మా గురువుగారు ఆ అమ్మాయిని ఎగాదిగా పరీక్షించి "శాస్త్రీ, ఈమెకు కార్పాసక లతాబంధం, శాంకరాంగరాగలేపనం కావాలనుకుంటాను" అన్నాడు. అంతంత పెద్ద మాటలను ఎన్నడూ వినని ఆమె బెంబేలు పడి, "ఏదో ఒక గట్టిపని చేస్తే గానీ ఇల్లు నిలిచే సాధనం లేదండి" అంటూ కన్నీరు పెట్టుకుంది. గురువుగారి మాటల కర్థం తెలిసినవాడిని కాబట్టి ఓ ముళ్ల నూలుపోగు, బూడిదె ఇచ్చి ఆమెను పంపించాను.

ఆమె అటు వెళ్లగానే, ఇటు ఒక వ్యాపారస్తుని తల్లి వచ్చింది. మనవరాలిని వెంటబెట్టుకుని వచ్చి తన గాథ చెప్పింది. "ఈ అమ్మాయిని మేనత్త కొడుకుకి ఇచ్చి పెళ్లి చేద్దామనుకున్నాం. కానీ అతను చనిపోయాడు. ఇంకోడికి ఇచ్చి పెళ్లి చేశాం. కానీ సంసారం చేయడానికి వీల్లేకుండా ఉంది. చచ్చి పోయిన మేనత్తకొడుకు దయ్యమై దీనిని పట్టుకున్నాడు. మొగుడి వద్ద పడుకోనివ్వడు. దెయ్యం సోకి ఇది చేసే హడావుడికి భర్త హడిలిపోయి దగ్గరకే రావటం లేదు. మీరేదైనా చేసి ఆ దెయ్యాన్ని వదలగొట్టాలి" అంది.

గురువు ఆ అమ్మాయి చేయి పట్టుకోగానే ఆమె వాలుచూపులతో అతనికేసి చూసి కాస్త ఇకిలించింది. నేను తెల్లబోయి చూస్తూండగా గురువుగారు 'ఈ ఇకిలింపు పిశాచలక్షణం సుమా' అని నన్ను ఊరుకోబెట్టారు. తర్వాత ఆ ముసలామె కేసి చూసి, "ఈ భూతం హోత్తు, హూత్తు లతో పోదు. ఈమెను కొంతకాలం పాటు భర్త దగ్గరకు పంపకండి. ప్రతీ రాత్రీ ఏడుగంటలకు ఇక్కడకు తీసుకురండి. ముగ్గులో కూచోబెట్టి తాడన పీడనాలు ఆచరించి, జుట్టుపట్టుకుని ఒక జాము సేపు రాపాడిస్తే గానీ ఈ వికారం పోదు" అన్నాడు. ఆ మాటలు వినగానే ఆ అమ్మాయి కిసుక్కున నవ్వింది. 'వెకిలి దెయ్యంలే' అని గురువుగారు నన్ను ఊరుకోబెట్టారు.

మళ్లీ ముసలావిడ కేసి తిరిగి "ప్రస్తుతానికి గ్రంథపత్ర శకలం ఒకటి, హేమ రజం కొంత ఇస్తాను రేపు మళ్లీ రండి" అన్నారు. గురువు గారి మాటలకు అర్థాలు తెలిసినవాణ్ని కాబట్టి ఓ తాటాకు ముక్క, కాస్త పసుపు పొట్లం కట్టి ఇచ్చాను. పసుపు మొహానికి రాసుకోమని, తాటాకు కొప్పులో పెట్టుకోమని చెప్పాను.

ఆ తర్వాత ఒక పండితుడి భార్య పదహారు సంవత్సరాల వయస్సు ఉన్న పిల్లను వెంటబెట్టుకుని వచ్చింది. "ఇది నా చెల్లెలు. ఇంకా వ్యక్తురాలు కాలేదు. భర్త రెండవ పెళ్లివాడు" అని ఏదో చెబుతూండగానే మా గురువుగారు ఆ పిల్లను లాక్కొని ఒళ్లో కూచోబెట్టుకున్నాడు. అది చూస్తేనే నాకు ఒళ్లు

చచ్చినట్టయింది. ఆ పిల్ల ఒళ్లోంచి లేచిపోవటానికి ప్రయత్నించినా గురువుగారు వదల్లేదు. ఫట్, ఫట్ అని ఏదో ఒక మంత్రం చదివి హడావుడి చేసి కాస్సేపయ్యాకనే వదిలిపెట్టాడు. "గ్రంథశకలత్రయం ఇయ్యి" అనడంతో మూడు తాటాకులు ఇచ్చాను. "ఇవెందుకు? వీటినేం చేయాలి? నా నమస్యకు ఇదేం పనిచేస్తుంది?" అని కాస్త తెలివిగా అడిగింది ఆ పిల్ల. గురువుగారికి భయం వేసింది. "వీటిని పొత్తికడుపుకు కట్టుకుని పడుక్కో. మళ్లీ రానక్కరలేదు" అంటూ ఆమెను తరిమేసాడు.



ఆ సాయంత్రం ఒక దొరగారు వచ్చాడు. "మా వీధిలో ఒక బాలెంతరాలు చనిపోయింది. దుష్టనక్షత్రంలో పోవడం వల్ల ఆ ఇల్లు కూడా వదిలిపెట్టారు. ఇప్పుడామె బ్రహ్మరాక్షసి అయింది. మొన్న మా పనివాడు ఆ ఇంటి వేపు వెళితే ఆ బ్రహ్మరాక్షసి వాడి వీపుమీద చరిచింది. దెబ్బకి వాడు వనిమానేసి పారిపోయాడు. అప్పటినుండి నాకు పనివాడు లేకుండా పోయాడు. మీరేదైనా చేసి ఆ ఇంట్లోంచి భూతాన్ని పోగొట్టాలి" అని బతిమాలాడు. "పోనీ నన్ను వెళ్లి చూడమంటారా" అని అడిగేను నేను.

దొరగారికి కోపం వచ్చింది. "అంత సులభంగా అయిపోయేదయితే మాకాపాటి ధైర్యం లేదనుకుంటున్నావా" గురువుగారయితే ఆయన సంగతి వేరు" అన్నాడు కోపంగా.

"అబ్బే మీరు మా శిష్యుడిని తక్కువ అంచనా వేయవద్దు. భూత విద్యారహస్యాలలో నేను బాగా ట్రయి నింగు ఇచ్చాను. (అంతా అబద్ధం. ఆయన దగ్గర నేను చేరి రెండు రోజులు కూడా కాలేదు) ఇతని చేత నేను ఆ పిశాచానికి ఓ లెటరు పంపించి దాని పద్ధతేమిటో తెలుసుకుంటాను. అంతగా అవసరమైతే నేనే వస్తాను. ముందుగా నేనే వెళ్లడం మర్యాద కాదు. దొరలకు తెలియని మర్యాద లేమున్నాయి. "అంటూ ఆయన్ని కూడా ఉబ్బేయడంతో ఆయన" సరే మీ శిష్యుణ్నే పంపండి అంటూ ఊరుకున్నాడు.




ఆ రోజు రాత్రి పదకొండు గంటలకు ఆ వీధికి బయలుదేరాను. ఎవరూ లేరు. చీకటి. శ్మశానంలో నడుస్తున్నట్టుంది. ఆ దొరగారు చెప్పిన ఇల్లు దగ్గరకు చేరేసరికి రివ్వు, రివ్వుమనే విసురుతో, రయి రయి మనే ధ్వనితో ఎదురుగా దెయ్యం వచ్చి దబాలున గుండెమీద కొట్టింది. కెవ్వుమని కేక వేసాను కానీ దెబ్బ తగలడంతోనే రెండు చేతులతో గట్టిగా నా గుండెలకు ఆ దెయ్యాన్ని అదిమిపట్టు కున్నాను. చేతుల కింద భూతం పీకుతున్నా, వెర్రిపట్టు పట్టి పరుగు, పరుగున గురువుగారింటికి వచ్చి ఆయన్ని నిద్రలేపి చెప్పడంతో ఆయన అదిరిపడ్డాడు. సీసాలో పెడదామంటూ సీసా రెడీ చేసి చేతుల పట్టు వదిలి చూస్తే, ఏముంది? ఒక పెద్ద గబ్బిలం. తుర్రున ఎగిరి, మళయాళ భగవతి విగ్రహం మీద వాలింది.

మేమిద్దరం తెల్లబోయి చూశాం. భగవతి గబ్బిలాన్ని ఏమీ చేయదేమిటాని. పైగా ఈ గబ్బిలం ఎక్కడనుండి వచ్చిందాని. "నిన్ను కొట్టినప్పుడు అది బ్రహ్మరాక్షసి స్వరూపంతోనే ఉంది, కానీ కామరూపిణి కాబట్టి నువ్వు పట్టుకోగానే రుపిపక్షి (గబ్బిలానికి కూడా పేరు మార్చాడు మా గురువు) అయిపోయింది. కానీ మామూలు జనానికి ఇదంతా అర్థం కాదు.

ఎవరికీ చెప్పక" అన్నారు గురువుగారు.

మా గురువుగారి వద్ద పనిచేయడం వలన నాకు తెలిసివచ్చినదేమిటంటే ఇలాటి దయ్యాలు లేవు. మన బుద్ధులే దయ్యాలు. ఇవి దైవభక్తిచే, విద్యచే పోవలసినవే కానీ మంత్రించిన మినుపగింజలచేత, చీపురుకట్టల చేత, పాత చెప్పులచేత వదలవు. దుర్మార్గులైన మనుష్యుల కంటె మించిన పిశాచాలు లేవు" అని జంఘాలశాస్త్రి అనగానే వాణీదాసుడు లేచి తన అభిప్రాయాన్ని చెప్పాడు.

"శరీరం లేని జంతువులు, శక్తులు ఉండవచ్చు. అంతమాత్రం చేత అవిలేవని చెప్పలేము. దయ్యాలు లేవని చెప్పలేం కానీ అవి మనకే అపకారమూ చేయలేవని మాత్రం చెప్పగలం. ఉపకారం చేయాలన్నా, అపకారం చేయాలన్నా ఆ అధికారం భగవంతుడికే ఉంది కానీ ఇటువంటి వాటికి ఉండదు. దయ్యాలు మనల్ని బాధించేవి కావు. అంతమాత్రం చేత అవి లేవనని చెప్పలేం. ఉంటే ఉండవచ్చు."

దాంతో జంఘాలశాస్త్రి రుసరుసలాడుతూ లేచాడు. "దయ్యాలు లేవని నేను ఖచ్చితంగా చెప్పగలను. అవి ఉన్నాయని అనుకునే కేసులలో మేధా సంబంధమైనదో, జన్యుసంబంధ మైనదో ఏదో ఒకరోగం ఉంటుంది. అవి లేని చోట్ల మోసం ఉంటుంది.నేను మా గురువుగారిని విడిచిపెట్టడానికి కారణమైన ఒక సంఘటన చెబితే మీకు బాగా అర్థమవుతుంది.

"ఓ సారి ఆ ఊళ్లోనే పడమటివీధిలో ఒక బాలవితంతువుకు కామినీ పిశాచం ఆవేశించిందని మా గురువుగారిని పిలిపించారు. ఆమె చేసిన వేషాలు చూసి తీరాలి. మూడు మేజువాణులంత కలకలం. పాటలు, అభినయం, అంతలోనే మొగ్గలు. గంతులు. చావుకేకలు. "ఈ కామినీపిశాచం క్రితం జన్మలో వేశ్య తెలుసా?" అన్నారు గురువుగారు. అంతలోనే ఆ అ పిల్ల, ఓం నారాయణాయ విద్మహే' అని స్వరయుక్తంగా పలకడంతో మా గురువుగారు ఖంగుతిని తన తప్పు కప్పిపుచ్చు కోవడానికి "వేశ్య జన్మకు ముందు వైదిక బ్రాహ్మణుడి జన్మ అయివుండాలి" అన్నాడు. మళ్లా ఏమనుకున్నాడో ఏమో, "ఎవడైనా బ్రాహ్మడు దానిని ఉంచుకుని మోహం వదలక ఆ దెయ్యానికి దెయ్యం పట్టాడేమో" అన్నాడు.

ఈ వ్యాఖ్యానాలన్నీ విని ఒళ్లు మండిందేమో ఆ పిల్లో, పిల్లను పట్టిన దెయ్యమో ఎగిరి నన్నో తన్ను తన్నింది. నాకు కళ్లవెంబడి నీళ్లు వచ్చాయి. నువ్వేం బాధపడొద్దు. ఇదేముంది... ఆ మధ్య నేను వీరాంజనేయం (అంటే పటుకారు) పట్టుకుని ఒక భూతం మీదకు వెళ్లగా అదే నా చేతిలోంచి దాన్ని లాక్కుని నా పన్ను ఊడలాగింది. దీన్ని ఎలా వశపరుచుకోవాలో నాకు తెలుసు. ఉగ్రనారసింహం (దూలగుండ పొడి) ఒంటి నిండా పూసేస్తే మనజోలికి రాకుండా ఉంటుంది. అంటూ గురువుగారు హాం, హూం అంటూ మీద కెళ్లబోయాడు.

అంతలో ఆ అమ్మాయి గొంతు మార్చి "ఖబర్‌దార్, చలేజావ్, నైతో మార్ డాల్తా" అంటూ అరిచి పందిరిమంచం స్తంభం ఊడదీసి మీదికి వచ్చింది. గురువుగారు మరింత గందరగోళం పడ్డారు. "చూసావా? తురకదయ్యం కూడా పట్టింది. మనసులోకి ఒక దయ్యానికి దారిస్తే అన్ని రకాల దయ్యాలు వచ్చి చేరతాయి. ఇలాటప్పుడు ఏం చేయాలంటే ఆ దయ్యాలకు వాటిలో వాటికి కలహం పెట్టాలి. అప్పుడప్పుడు ఒకదానితో మరోటి కొట్టుకుని చివరికి అన్నీ పారిపోతాయి. వాళ్లకు ఎలా గొడవలు పెట్టాలా అని ఇంటికి వెళ్లి ఆలోచిద్దాం రా." అన్నారు. కానీ నా ఆలోచన మరోలా ఉంది.

అప్పుడామె బంధువులు ఎవరూ దగ్గర లేరు. వచ్చినవాళ్లందరినీ కరవడం, రక్కడంతో ఆమెంటే భయపడి, ఇంటికి కాస్త దూరంగా ఒకగదిలో ఆమెను పెట్టేసి విడిగా ఉంచారు. భోజనం కూడా పనివాళ్లచేత పంపుతున్నారు. "వాళ్లవాళ్లు ఎవరూ లేరు కాబట్టి మనిద్దరం కలిసి నాలుగు తందాం అన్నాను నేను. ఆమె చేతిలో దెబ్బతిన్న కోపం నాకింకా పోలేదు మరి".

కానీ గురువుగారికి ఆవిడంటే భయమో, ఏమో 'పోదాం పద' అన్నారు. దారిలో ఆ అమ్మాయి తండ్రి కనబడితే "రాత్రికి జంఘాలశాస్త్రిచేత తీర్థం పంపుతాను" అని చెప్పాడు.

గురువుగారి ఆదేశం కదా, ఆ రాత్రి తీర్థం తీసుకుని వెళ్లాను. చుట్టుపట్ల ఎవరూ లేరు. తలుపు ఓరగా వేసి ఉంది. నిద్రపోతోందేమో, లేపుదామా వద్దా అనుకుంటూ తలుపు కన్నంలోంచి చూసాను. మా మీద నమ్మకం పోయిందేమో మరి మరో భూతవైద్యుడిని పిలిచినట్టున్నారు. అతను ఆమె ముంగురులు చేత్తో పట్టుకున్నాడు. పక్కన బల్లమీద భూతాన్ని దింపడానికి సీసా రెడీగా పెట్టుకున్నాడు. మంత్రాలు జపిస్తున్నా డులాగుంది, ఆమె అల్లరి చేయకుండా బుద్ధిగా కూచుంది.

వీడెవడో మా గురువుకంటె గట్టివాడులా ఉన్నాడు, ఇతని శిష్యరికం చేస్తే మంచిదేమో ననుకుంటూండగానే ఆ సీసా మూతతీసి ఆమె బుగ్గలకు రాసాడు. అత్తరు వాసన గదంతా పాకింది. దీనికి వాడు పెట్టిన పేరేమిటాని ఆలో చిస్తూండగానే మంత్రాలు జపిస్తున్న మూతిని పొడుగుచేసి ఇంగ్లీషు సినిమాల లోగా ఒక శృంగార చేష్ట చేశాడు. ఆమెకు కోపం వస్తుందోమోనని నేను అనుకుంటూండగానే కిల కిల నవ్వుతూ విరుచుకు పడింది. వాడిపని అయి పోయిందిరా అను కుంటూ నేను పరుగెత్తుకుని వచ్చేశా.

గురువుగారికి అన్నీ వివరంగా చెబితే ఆయన గుచ్చిగుచ్చి చాలా అడిగేరు. ఆమె శరీరంలోని భూతం బయటకు వచ్చి ఉండవచ్చని తీర్మానించారు. 'వాడికి జందెం ఉందా? తురకగడ్డముందా?' అని ఎన్నో ప్రశ్నలు అడిగేరు. నేను సరిగా చెప్పలేకపోయినందుకు విసుక్కున్నారు. మర్నాడు వాళ్లింటి దాసి వచ్చి కళ్లనీళ్లు పెట్టుకుని నిలబడగానే ఆయన బాధపడ్డాడు. "చూశావా, నా మంత్రం ఫెయిలయిన మొదటి కేసు ఇదే. నువ్వు చెప్పినప్పుడే అనుకున్నాను. ఆ మూడు దయ్యాలు కలిపి ఆమెను చంపుకు తిని వుంటాయని. తెల్లవారేసరికి నా అనుమానం నిజమయింది. అన్నాడు.

ఆ ముసల్ది కంగారు పడింది. "అమ్మాయిగారు చచ్చిపోలేదండి. మా అబ్బాయి కూడా ఆ ఇంట్లోనే పనివాడిగా పనిచేస్తున్నాడు. వాణ్ని లేపుకుని ఇంట్లోంచి పారిపోయిందండి. ఇక నన్ను చూసేవాళ్లెవరని నేను ఏడుస్తున్నానండి." అంది.

అదీ జరిగిన సంగతి. ఆ బాలవితంతువును పట్టిన దెయ్యమేమిటో నాకు అర్థమయ్యాక నేను తక్షణం మా గురువుగార్ని వదిలిపెట్టి ఇల్లు చేరుకున్నాను.

-కమ్యూనికేటర్ ఫీచర్స్





**తె**లుగు సినీసంగీతంతో పరిచయమున్న వారందరికీ వి.ఎ.కె.రంగారావు గారి పేరు సుపరిచితమే. సంగీత, నృత్య విశ్లేషకునిగా రంగారావు ఒకతరం వారిని ప్రభావితం చేసారనడం అతిశయోక్తి కాదు. బొబ్బిలి రాజవంశానికి చెందిన శ్రీ రంగారావు 40 దేశ, విదేశ భాషలలో 42 వేల 78 ఆర్.పి.యమ్ రికార్డులు సేకరించడమే కాక 1960లలో ఆంధ్రపత్రిక వీక్లీలో "సరాగమాల" శీర్షిక ప్రారంభించి సినీసంగీత విశ్లేషణకు శ్రీకారం చుట్టారు. 'సరాగమాల' తర్వాత 'మలయమారుతం' (ఆంధ్రప్రభ వారపత్రిక) 'హంసధ్వని' (ఆంధ్రజ్యోతి వారపత్రిక) 'వినవేడుక' (జ్యోతి మాసపత్రిక) 'ఆనందలహరి' (విజయచిత్ర) వంటి శీర్షికల ద్వారా తెలుగువారికి మంచి అభిరుచి మప్పడమే కాక సంగీతాన్ని ఎలా ఆస్వాదించాలో నేర్పారు. ఇవే కాక 'స్క్రీన్' వార పత్రికలో 'సౌండ్స్ ఆఫ్ మ్యూజిక్' అనే పేరుతో ఇతర భాషల రికార్డుల గురించి కూడా వ్యాఖ్యానించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ రంగారావు వ్యక్తిత్వంలో సంగీతవిశ్లేషణ ఒక పార్శ్వం మాత్రమే. 70వ పడిలో పడిన శ్రీ రంగారావు ఇప్పటికీ తన అభిమానులను అలరిస్తున్నారనడానికి నిదర్శనం - ఏడాదికి పైగా ఆయన 'వార్త' దినపత్రికలో నడుపుతున్న వీక్లీ కాలమ్ "ఆలాపన". 19-11-2001 నాటి 'ఆలాపన'లో ఆయన వ్రాసిన వ్యాసంలో కొంత భాగాన్ని తీసుకుని హెడ్డింగ్ మార్చి ఇక్కడ పొందుపరుస్తున్నాం. ప్రగాఢమైన ఇష్టాయిష్టాలు ప్రకటించే నిర్భీతి, ఎకడమీషియన్స్ చేసే ఆర్భాటానికి ఒళ్ళు మండి, నాకు చదువులేదు పొమ్మనే తలతిక్కా, కంటబడిన ప్రతీదానిని సూక్ష్మంగా పరిశీలించే శక్తి - ఇవన్నీ రంగారావు శైలి తెలియనివారికి కూడా ఈ చిన్న వ్యాసంలోనే కనబడతాయి.

'హాసం'పై వారు వెలిబుచ్చిన భావాలను ఆశీస్సులుగా భావిస్తూ సంగీతాభిమానులకు ఉపయుక్తంగా ఉంటుందని నమ్ముతూ ఈ వ్యాసాన్ని పునర్ముద్రించడానికి అనుమతించిన 'వార్త' యాజమాన్య సంపాదక వర్గానికి కృతజ్ఞతలు తెలుపుతున్నాము.

# సంగీత విశ్లేషణల తీరూ తెన్నూ...

"శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి గారు నామకరణం చేసిన 'సరాగమాల' ముళ్లపూడి - బాపు సిఫారసుతో ఆంధ్రపత్రిక వీక్లీలో సంపాదకుడు శివలెంక రాధాకృష్ణ మున్నుడితో ప్రారంభించినప్పుడు -- దాదాపు నలభై ఏళ్ల కిందట -- చుక్కల్లో చూపులున్న వారెందరో ముక్కున వేలేసుకొన్నారు, సినిమా పాటలను పరిచయం చేయడానికొక శీర్షిక కూడానా అని. నేను వ్రాసిన ఏ సంగీత శీర్షికా సినిమా పాటలకే పరిమితం కాలేదు. సంగీత సరఫరాకు ఆనాటి ఒకే ఒక సాధనం గ్రామఫోన్ రికార్డులు. వాటిపై వచ్చిన అన్నిరకాల సంగీతం గురించీ వ్రాశాను.

సినిమా పాటలు, ప్రైవేటు గీతాలు, నాటకాలు, శాస్త్రీయ సంగీతం, హాస్యం పేరిట పిల్లి-శునక కంపెనీలు సప్లయి చేసిన పచ్చి పడుపు కూటి ప్రహసనాలు, నిజానికి యీ చివరి వాటి రచయిత ములుకుట్ల సుబ్రమణ్యం (కాకినాడ) తలచుకొంటే, 'నీ మీద మనసాయెరా' 'విరిసెను వెన్నెల' (స్వర్ణలత పాడిన కొలంబియా రికార్డు) వంటి చక్కని లలిత గీతాలు వ్రాయగలవాడే!

అంతేకాదు. సినిమాలు విడుదలై కారణాంతరాలచేత వాటిలోని మంచి పాటలు విడుదల కాకపోతే వాటి విడుదలకు ప్రోత్సహించినదీ యీ శీర్షికే (అసలు "చివరకు మిగిలేది" పాటల విడుదల చేయించటానికని నేను అప్పుడు ఉంటున్న బొబ్బిలి నుంచి పనిగట్టుకు మద్రాసు వచ్చాను). ఇలా విడుదలైనవే "రారా నా స్వామి రారా' (భానుమతి: విప్రనారాయణ) 'నిత్యవినోదం', 'ఏ దారి చనునో' (ఎల్.ఆర్.ఈశ్వరి, పి.బి.శ్రీనివాస్ - పి.సుశీల: పెళ్లి తాంబూలం).

నవ్వబడిన నేనే పండాను. ఇప్పుడు పెద్ద చదువులాళ్లే యీ సినిమా పాటల మీద 'తిరిగి వెతుకులాటలు' సాగిస్తున్నారు. పైడిపాల 'తెలుగు సినిమా పాట' ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం దయ వలన ముద్రణకు నోచుకొంది. ఎవరికైతే ఆ పుస్తకం ఆ పొడి అక్షరాల భిక్ష పెట్టిందో, వారి నిర్దయ, నిర్లక్ష్యం, బద్ధకం, భయం వలన రెండోకూర్పు బయటికి రాకున్నది.

ముసల్ది పొయ్యి రాజెయ్యక పోతే ఊరూ వాడా పస్తులుండేనా! మరొక చరిత్ర తయారయింది. దీనికర్త డాక్టర్ బి.ఎన్.శేఖర్, అనపర్తి. నేను యిరవై పేజీలు చదివాను. తెలియని విషయాలు తెలుసుకొన్నాను. ఆ యిరవై పేజీల్లో ఒక్క తప్పు కనిపెట్టలేక పోయాను. అది ప్రజలకు అందివస్తే తెలుగు సినిమా పాట పునాదులు, అంతస్తులు, నగిషీలు, వాటి మేస్త్రీలు, వడ్రంగులు, వెల్లకారులూ ప్రజలకు మరింత సన్నిహితులౌతారు.

'సరాగమాల' తరువాత అందేవ్ రాజమండ్రి నుంచి వచ్చిన ఒక చిన్న సైజు పత్రికలో పాప్ సంగీతం గురించీ, భారతీయ సంగీతంపై దాని ప్రభావం గురించీ వ్రాశారు. ఆ పిమ్మట శ్రీమతి మీరా మోహన్‌కృష్ణ 'స్వరమాధురి' (సినిమా రంగం: జీవిజి సంపాదకుడు) తెలుగు సినిమా పాటల గురించి వ్రాశారు.

ఏ రకమైనా శీర్షికైనా, ఒక్కటే, ఒక్కరే వ్రాస్తూంటే కొన్ని అన్యాయాలు జరగవచ్చు. కొందరికి బ్రహ్మరథం మరి కొందరికి దుమ్ముదులపడం జరుగుతూ ఉండవచ్చు. మంది ఎక్కువైతే -- యిలాంటి పరిస్థితులలో -- విమర్శ చక్కనౌతుంది. పలచ బడదు. వార్తలోనే నేను వి.శాంతారాం గురించి వ్రాసిన తరువాత వాసిరాజు ప్రకాశం వ్రాశారు. వార్త సిబ్బందిలోని బి.బాలసుబ్రహ్మణ్యం ఆశా గురించి వ్రాసిన తరువాత నేను వ్రాసింది ప్రచురింపబడింది. ఒకరన్న మాట మరొకరనలేదు. వారి దృక్పథాలను వారు స్పష్టపరిచారు. అభిప్రాయాలు వ్యక్తీకరించారు. తప్పుడు వివరాలివ్వనంత వరకు 'మంది' మంచే చేస్తుంది.

ఇటువంటి వాతావరణంలో సంగీత కళనూ హాస్యరసాన్నీ పంచి పెట్టడానికంటూ 'హాసం' అన్న ఒక పక్షపత్రిక పుట్టింది. దీని సంపాదకుడు 'వార్త'లో కొంతకాలం క్రిందట ఆ పా(త)ట మధురమంటూ శ్రోతలకు కమ్మని విందు భోజనమందిచ్చిన రాజా. శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి సినిమా పాటలను ప్రేమతో, వ్యయంతో సేకరించిన ఎమ్బీయస్ ప్రసాద్, కె.ఐ.వరప్రసాదరెడ్డి దీని వెనుకనున్న హార్దిక, ఆర్థిక బలాలు.

చిన్న పిల్లలు తాయిలం దాచుకుని దాచుకొని తిన్నట్టు నేను ఆ పత్రికను దిండు ప్రక్కన పెట్టుకుని కొంచెం కొంచెం రాత్రీ మధ్యాహ్నం చదువుకొంటున్నాను. ఎన్నో విషయాలు, సినిమా సంగీతం గురించే, తెలుసుకొంటున్నాను. ఈ మూడు సంచికలలోను -- అలవోకగా మాత్రమే సుమా -- చూడగా నాకు ఒక్కటే తప్పు కనిపించింది. ఫ్రాంక్ సినాట్రా పేరు వేసి బింగ్‌క్రాస్బీ ఫొటో వేయడం (అక్టోబరు 16-31, 7వ పేజి). ఆనంద సాగరంలో యిదొక చిన్న నలుసుమాత్రమే! కొనండి. కొనిపించండి. తెలుగు సినిమా సంగీతం గురించి తెలుసుకోదలచిన వారందరికీ ఎన్నో విషయాలు ఆసక్తికరంగా కంటికింపుగా చెప్పే ప్రయత్నానికి చేయూత నివ్వండి!."

-వి.ఎ.కె.రంగారావు మద్రాసు.

# న్యూస్ వ్యూస్

## శాస్త్రీయానికి జాజ్ జోడించిన ఐఎస్‌బి



హైదరాబాదులోని ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్ వారు నవంబరు 20న తమ ఎక్జిక్యూటివ్ ఎడ్యుకేషన్ ప్రోగ్రామ్ ఫస్ట్ బ్యాచ్ విద్యార్థులను ఆహ్వానించడానికి ఒక వినూత్నమైన సంగీత కార్యక్రమం ఏర్పాటు చేశారు. జాజ్ సంగీతకారుడు లూయిా బ్యాంక్స్ వేణుగాన విద్వాంసుడు రోనూ మజుందార్, తబలా వాదకుడు శుభాంకర్ బెనర్జీ, మృదంగ విద్వాంసుడు రాజేష్ రాజ్ భట్‌లను ఒకే వేదికపై తెచ్చారు. శాస్త్రీయ సంగీతం, జాజ్ మేళవించిన ఈ కార్యక్రమంలో హైలైట్ ఏది అంటే చెప్పడం కష్టమయిందట. ప్రతీ ఐటమ్ ఒక దాన్ని మించి మరొకటిగా ఉన్నాయట!

ఈ గ్రూప్‌కు నాయకత్వం వహించిన లూయిా బాంక్స్ నేపాలీ దేశస్థుడు. అసలు పేరు దాంబేర్ బహాదూర్ బుద్ధ ప్రీతి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన జాజ్ వాద్యగాడు లూయిా ఆమ్‌స్ట్రాంగ్ మీద అభిమానంతో పేరు మార్చుకున్నాడు. ఇప్పటిదాకా 7,000 జింగిల్స్ సమకూర్చాడు (మేరా భారత్ మహాన్ వాటిలో ఒకటి). అది ప్రపంచ రికార్డే! శంకర్ మహాదేవన్. కార్ల్ పీటర్స్‌తో కలిసి 'సిల్క్'అనే గ్రూపు ఏర్పర్చి తొలికానుకగా 'ప్యూర్ సిల్క్' అనే ఆల్బమ్ త్వరలో రిలీజ్ చేయబోతున్నాడు.

## శాంతారాం కు పోస్టల్ డిపార్ట్‌మెంట్ శ్రద్ధాంజలి




ఝనక్ ఝనక్ పాయల్ బాజే, నవ రంగ్ వంటి గొప్ప నృత్యసంగీత చిత్రాలు నిర్మించిన వి.శాంతారాం శతజయంతి ఉత్సవ సందర్భంగా నవంబరు 17 న పోస్టల్ డిపార్టు మెంటు వారు ఒక స్టాంపు విడుదల చేశారు.

## పండిట్, కాదు కాదు, డాక్టర్ శివకుమార్ శర్మ



ప్రముఖ సంతూర్ వాద్యకారుడు పండిట్ శివకుమార్ శర్మ తనవద్ద సంతూర్ నేర్చుకుంటున్న ఒక డాక్టరు సహాయంతో ఏయే రాగాలు ఏయే దీర్ఘవ్యాధులను నయం చేయగలవో ప్రయోగాలు చేసి చూస్తున్నారు. ఈ ఐడియా ఎందుకు వచ్చిందని అడిగితే, - ఒక సైకియాట్రిస్టు నా సిడి వినిపించి ఒక పేషంటుకు పొగతాగే అలవాటు మాన్పించానని చెప్పింది. నా కచ్చేరీలలో తబలా వాయించే అతనొకసారి తలనొప్పిగా ఉందన్నాడు. తలనొప్పి మాత్ర తెచ్చేలోపునే నేను ఆలాపన ఎత్తుకున్నాను. ఆలాపన అయ్యేసరికి మాత్ర వచ్చినా అతను అక్కరలేదన్నాడు. నా ఆలాపనతో అతనికి నయం అయిపోయిందట. అలాగే నిద్రలేమితో బాధపడే ఒక మిత్రుడు రోజూ రాత్రి తాన్‌పురా వినడంతో చక్కగా నిద్రపోగలుగుతున్నాడని చెప్పాడు. వీటన్నటినీ విన్న తర్వాత సంగీతానికి, వైద్యానికీ గల సంబంధాన్ని కనిపెట్టాలని సంకల్పించాను అన్నారు శివకుమార్ శర్మ.

హిందుస్థానీ సంగీతం

## 700 సంవత్సరాల చరిత్ర గల ఖవ్వాలీకి చిరునామా

# షెహన్ షా- ఎ - ఖవ్వాలీ -నజ్రత్ ఫతే అలీఖాన్



**సం**గీతానికి సరిగమలే తప్ప 'సరిహద్దులు' లేవు. భారత పాకిస్థాన్‌ల మధ్య 'సరిహద్దు'కు సంబంధించి వైషమ్యాలు ఉండవచ్చు కానీ సంగీతం మాత్రం ఒక్కటే. బహుశా రెండు దేశాలను ఏకం చేయగలిగేది ఒక్క సంగీతం మాత్రమేనేమో అంటే అతిశయోక్తి కాదు. మెహిదీ హసన్... నజ్రత్ ఫతే ఆలీఖాన్.... వీరంతా ఖండాంతరాలకు వ్యాపించిన కమనీయ గాయకులు.

స్వయంగా భారత ప్రధాని మెహిదీ హసన్ గజళ్ళకు పరవశులై సలాం చేశారంటే, మెహిదీహసన్ "జో హక్ పాకిస్థానియోంకో మేరీ గజలోంపే హై, వోహీ హిందుస్థానీయోంకో భీ హై" అన్నారంటే రెండు దేశాల మధ్య 'రాగబంధం' ఎంత దృఢమో అర్థం చేసుకోవచ్చు. ఆ అనురాగ బంధాన్ని మధురం చేసిన మరో గాయకుడు నజ్రత్ ఫతే ఆలీఖాన్.

పీటర్ గాబ్రియెల్ అనే సంగీతాభిమాని 'రియల్ వరల్డ్ ఎక్స్‌పెరిమెంట్స్' పేరుతో అనేక ప్రయోగాలు ప్రారంభించారు. ఆఫ్రికా, క్యూబా, లాటిన్ గీతాలకు మేళవింపు హిట్టయిన తర్వాత ఈ ప్రయోగాన్ని పాకిస్తాన్‌కి చెందిన ఖవ్వాలీ గాయకుడు నజ్రత్‌ఫతే ఆలీఖాన్, కెనడా గిటారిస్ట్ మైఖేల్ బ్రూక్ సంగీతాలను సమ్మిళితం చేసి ఆయన సంచలనం సృష్టించారు. అదే 'మస్త్‌మస్త్'! ఖాన్‌కి ప్రపంచ వ్యాప్తంగా ఎంతో పేరు సంపాదించిన ఆల్బమ్ ఇది.

సూఫీ తత్వాన్ని ప్రచారం చేసే నజ్రత్ పాట ఒక సమ్మోహన గానమే. ఎందుకంటే 'తేరే బినా' అని ఆయన గొంతెత్తితే ప్రేమికులందరూ మైమరచిపోవలసిందే. 'ట్రేసీ, షాడో, సీ ఆఫ్ వేపర్స్' ఈ పాటలన్నీ ఆంగ్లభాష మునుపెన్నడూ ఎరుగని అపురూప భావరాగ ఝురులు. ఇక నజ్రత్ ఫతే ఆలీఖాన్, బ్రూక్‌తో కలిసి రూపొందించిన "నైట్ సాంగ్" గురించి ఎంత చెప్పినా తక్కువే. ఎందుకంటే "ఆ గీతాలు... వెన్నెల వెలుగులా, తాజ్‌మహల్ అంత స్వచ్ఛంగా, గంగాజలం అంత పవిత్రంగా.... మల్లెపువ్వంత పరిమళంగా" ఉంటాయని ఇప్పటికే విమర్శకులు ఎంతో కొనియాడారు.

నజ్రత్ ఖవ్వాలీ పాట వినని వారు లేరు. ఎన్నో హిందీ చిత్రాలలో ఆయన ఖవ్వాలీ కవ్విస్తుంది. 'ఔర్ ప్యార్ హోగయా' చిత్రంలో అనురాధా పోడ్వాల్ ఉదిత్‌నారాయణ్‌లతో కలిసి ఆయన గానం చేసిన 'కోయి జానే న జానే' గీతం ఎవరు మరువగలరు?

47 సంవత్సరాలు దాటకముందే నజ్రత్ ఫతే ఆలీఖాన్ ప్రపంచ సంగీతాభిమానులను అలరించడం ఆయన సంగీతం యొక్క ప్రత్యేకత అనే చెప్పాలి. నజ్రత్ ఖవ్వాలీ గాయకుడుగా మారిన వైనం చాలా విచిత్రంగానే జరిగింది. ఎలా అంటే - పాకిస్థాన్‌లో ఉస్తాద్‌ఫతే ఆలీఖాన్ సుప్రసిద్ధ ఖవ్వాలీ గాయకుడు. దాదాపు 700 సంవత్సరాల ఖవ్వాలీ వారసత్వానికి ఉస్తాద్ వారసుడు. ఆయన తన కొడుకు నజ్రత్ ఉన్నత చదువు చదివి మంచి డాక్టర్‌గా పేరు తెచ్చుకోవాలని అభిలషించారు.



## ఖవ్వాలీ అంటే...

ఖవ్వాలీలు సాముహిక భక్తిగీతాలు. తుకారాం అభంగాలలా, రామదాసు కీర్తనలలా, సిక్కుల శబద్‌లలా, ముస్లిములకు ఖవ్వాలీలు, కల్బనాస్‌లు ఉన్నాయి. తొలి ముస్లిమ్ మ్యూజికాలజిస్టుగా ప్రఖ్యాతి కెక్కిన అమీర్ ఖుస్రో (1234-1324)నే ఖవ్వాలీ సృష్టికర్తగా చెప్పుకోవాలి. సితార్, తబలా వాయిద్యాలు, తరానా శైలి గాత్రం, సర్ఫర్దా, జిలఫ్ రాగాలు ఇవన్నీ అమీర్ ఖుస్రో సృష్టిలో భాగాలే. అతని పూర్వీకులు టర్కీ దేశానికి చెందిన వాళ్లు. ఉత్తరప్రదేశ్‌లో పుట్టి అరబిక్, పెర్షియన్ అభ్యసించి, హిందూ గురువుల వద్ద సంగీతం నేర్చిన ఖుస్రో తనను తాను 'హిందూ టర్క్' అభివర్ణించుకునే వాడు. హిందూ భజనల ధోరణిల్లోనే ముస్లిములకై ఖవ్వాలీని కూర్చాడు.

ఖవ్వాలీలు పూర్తిగా మతపరమైనవే అనడానికి లేదు. ఆధ్యాత్మిక కీర్తనలనవచ్చు. ఇస్లామ్‌లోని మార్మికవాద (మిస్టిసిజమ్) కవిత్వంపై ఆధారపడిన ఈ గీతాలకు ఆధారం - ఖాల్స్ అనే ప్రవక్త వచనాలు. వాటిని గాయకబృందం పాటల రూపంగా పదేపదే పాడడం వల్ల వినేవారికి తన్మయత్వం కలిగి, హల్ స్థాయి (సైకాలజీలో ఆల్ఫాస్టేట్ అంటారు)కి వెళతారు. ఆ స్థాయిలో విన్న పాటలు మనసులో హత్తుకుని పోయి ఆ రాగాలు వెంటాడుతాయి.

### బావుల్

ఖవ్వాలీలో బృంద గాయకుడు ఒక అంశాన్ని ఎత్తుకుంటాడు. సాధారణంగా అది ఏక వాక్యంలో ఉంటుంది. దాన్ని సహగాయకులు అందుకుంటారు. తర్వాత అందరూ కలిసి అలాపించడంతో ఒక రిథమ్ ఉంటుంది. అది శాస్త్రీయ సంగీతంలో కనబడే తాళం వంటిది కాదు. పసిపిల్లవాడిని నిద్ర పుచ్చడానికి కొట్టే 'చిచ్చి' లాటిది. ఖవ్వాలి నుండి పూర్తి ఆధ్యాత్మికపరమైన ఖయాల్ పుట్టింది. ఖవ్వాలీ నుండే హిందూ, ముస్లిమ్ ఆధ్యాత్మికతలను మేళవించిన 'బావుల్' గీతాలు పుట్టాయంటారు. బెంగాల్ ప్రాంతంలో గోపీ యంత్రా (ఏక్‌తారా లా వుంటుంది) మీటుతూ భక్తిగీతాలు పాడే సంచార గాయకులను 'బావుల్' అంటారు. ఒక బావుల్ ఇంటి పక్కగా పాడుకుంటూ వెళితే ఆ ఇంట్లో వాళ్లకి కనీసం వారం రోజులపాటు మనశ్శాంతి లభించేదని ఉస్తాద్ ఫయాజ్‌ఖాన్ అనేవారు. ఖవ్వాలిని హిందీ సినిమాలు అనేక రకాలుగా (ప్రేమను వెలిబుచ్చడానికి కూడా) ఉపయోగించుకున్నాయి.

## ఫతే ఆలీ ఖాన్‌కు వారసురాలు...?

పాకిస్తానీ గాయకురాలు అబీదా పర్వీన్ పాడిన ఆల్బమ్ "బుల్లే షా"ను టైమ్స్ మ్యూజిక్ వారు ఇటీవలే విడుదల చేశారు. గంభీరస్వరంతో, భక్తిభావంతో పాటలు పాడే అబీదాను నస్రత్ ఫతే ఆలీఖాన్ వారసురాలిగా పరిగణిస్తారు కొందరు. బుల్లే షా తత్త్వగాయకుడిగా ప్రసిద్ధుడైతే నస్రత్ ఫతే ఆలీఖాన్ ఖవ్వాలీ గాయకుడిగా సుప్రసిద్ధుడు. పంజాబ్, సింధ్ ప్రాంతాల మాండలికాలలో అబీదా పాడిన సూఫీ, జానపద గీతాలు నిండిన ఈ ఆల్బమ్‌తో ఆ ఖ్యాతి మరింత పెరుగుతుంటున్నారు విమతర్శకులు.



అయితే సాయంత్రం వేళల్లో ఉస్తాద్ తన శిష్యులకు ఖవ్వాలీ పాఠాలు బోధిస్తున్నప్పుడు తలుపు చాటుగా చేరి నస్రత్ తండ్రి వివరించే గీతాలు వినేవారు. మరో వైపు పగలంతా పాఠశాలకు వెళ్లేవారు. ఓ రోజు ఉస్తాద్ కంటబడ్డాడు నస్రత్. చెవులు మెలివేసినంత పనిచేశారు ఉస్తాద్. "ఒరేనాన్నా.... ఈ ఖవ్వాలి తిండి పెడుతుంది కాదనను. కానీ నువ్వు డాక్టరు కావాలిరా. పదిమంది రోగులకు జబ్బు నయం చేస్తుంటే నేను కళ్లారా చూసి ఆనందించాలిరా, ఈ పాట వదిలెయ్‌రా. ఏడువందల సంవత్సరాలుగా మన ఇంట పాట మోగుతోంది. కానీ నువ్వు డాక్టర్ అవ్వాలిరా... ఇదేరా నా కోరిక'' అని కొంచెం సీరియస్‌గా చెప్పారు. నస్రత్ తండ్రి మాట కాదనలేక పోయారు. పాఠాలన్నీ శ్రద్ధగా చదువుతూనే మరో వైపు ఖవ్వాలీని నాన్నగారు లేనప్పుడు సాధన చేసేవారు.

1964లో నస్రత్ జీవితం అనూహ్యమైన మలుపులకు లోనైంది. ఆ సంవత్సరమే ఉస్తాద్ ఫతే ఆలీఖాన్, అంటే నస్రత్ తండ్రి మరణించారు. అప్పటికి నస్రత్ హైస్కూలు చదువు ప్రారంభించాడు. తండ్రి చనిపోయిన పదోరోజు నస్రత్‌కి ఓ కల వచ్చింది. ఆ కలలో తన తండ్రి తన కోసం వెతుక్కుంటూ వచ్చి నస్రత్ గొంతును ప్రేమతో నిమిరారు. తెల్లారిన తర్వాత తనకేదో కొత్త శక్తి వచ్చినంత సంబరపడిపోయాడు. తనకు తెలీకుండానే ఖవ్వాలి ప్రవహించసాగింది. అలా అని నస్రత్ చదువుకు స్వస్తి పలకలేదు. ఒక వైపు తండ్రి కోరిక మేరకు మెడిసిన్ చదువుతూనే తండ్రి వారసత్వాన్ని నిలబెట్టడానికి సాధకుడయ్యాడు. పదిహేనేళ్ల ప్రాయానికే నస్రత్ గాయకుడిగా మంచి పేరు తెచ్చుకున్నారు.

పాకిస్థాన్‌లో ఆయనకు తిరుగులేదు. రిషికపూర్ వివాహ సమయంలో పాడడానికి రాజకపూర్ ఆహ్వానించడంతో భారత్ కూడా ఆయనకు బ్రహ్మరథం పట్టింది. హిందీ చలన చిత్రాల్లో ఖవ్వాలీ సంప్రదాయంలో పాటలు రావడం మామూలే. ఎ.ఆర్.రెహ్మాన్ వంటి సంగీత దర్శకులు ఖవ్వాలి బాణీలను విడివిగా వాడడంతో భారతీయ సంగీతాభిమానులకు మరింత చేరువయ్యారు. జావేద్ అఖ్తర్ తో కలిసి సంగమ్ అనే ఆల్బమ్ రిలీజ్ చేశారు కూడా. ఇక మైఖేల్ బ్రూక్‌తో కలిసి ఆయన 'రియల్ వరల్డ్ ఎక్స్‌పెరిమెంట్స్' ద్వారా ప్రపంచ సంగీతాభిమానులకు సన్నిహితమయియిన నస్రత్ ఫతే ఆలీఖాన్ 1997 ఆగస్టు 16 న కిడ్నీ ఫెయిల్యూర్ కారణంగా లండన్ లో మరణించారు. కథ కంచికి పోయినా కథ వాసన మిగిలుంటుంది అన్నట్టు నస్రత్ భౌతికంగా మన మధ్య లేకపోయినా ఆయన గానం మనచుట్టూ పరిభ్రమిస్తూనే, పరిమళిస్తూనే ఉంటుంది.

-సి.హెచ్.లక్ష్మి

## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక



మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

**1. కలత (పరవశం... చెలియా)**
ఎ) అశాంతి  సి) కలలోని స్త్రీ
బి) కలవరింత  డి) కన్నీరు

**2. రారాజు (పరవశం.... పరవశం)**
ఎ) రాత్రికి రాజు  సి) రాజ్యంలేని రాజు
బి) రవి వంటి రాజు  డి) రాజులకు రాజు

**3. నడిజాము (పరవశం... పరవశం)**
ఎ) మిట్టమధ్యాహ్నం  సి) జాము (ఏడున్నర గంటలు) మధ్య ఉండే సమయం,
బి) అర్ధరాత్రి,  డి)తొలిపొద్దు

**4. ధాత్రి (లిటిల్ హార్ట్స్... భారతి జాతి)**
ఎ) ఒక మహర్షి పేరు  సి) గొడుగు
బి) భూమి  డి) ఒక సంవత్సరము పేరు

**5. శుకపిక (లిటిల్ హార్ట్స్.... భారత జాతి)**
ఎ) చిలుక కోయిల  సి) మహర్షులు
బి) కీటకములు  డి) చిలక - గోరువంక

**6. శరము (లిటిల్ హార్ట్స్ .... హంపీ)**
ఎ) యుగము  సి) శూలము
బి) విల్లు  డి) బాణము

**7. నిధానం (లిటిల్ హార్ట్స్ ... చలన)**
ఎ) నెమ్మది  సి) పద్ధతి
బి) నిధి  డి) విలువైన దానం

**8. చకితము (లిటిల్ హార్ట్స్ ... చలన)**
ఎ) ఆశ్చర్యపడునది  సి) నవ్వించునది,
బి) భయపడునది  డి) కదలునది

**9. రుధిరము (లిటిల్ హార్ట్స్....చలన)**
ఎ) సాహసము  సి) ఎర్రనిది
బి) ధైర్యము  డి) పాలు

**10. స్వస్తి (లిటిల్ హార్ట్స్....చలన)**
ఎ) ఆశీర్వచనము  సి) ముగింపు
బి) ప్రారంభము  డి) గుర్తు

### జవాబులు

1) a 2) d 3) c
4) b 5) a 6) d
7) b 8) b 9) c
10) a

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : రహనా హై తేరే దిల్ మే

బ్యానర్: పూజా ఎంటర్‌టైన్‌మెంట్

గీతరచన : సమీర్

సంగీతం : హారీస్‌జైరాజ్

పాడినది : సోనూనిగమ్,కవితా కృష్ణమూర్తి

అభినయించినది : మాధవన్, దివ్యామీర్జా

# ముఝుకో కహానా







మన తెలుగులో వచ్చిన 'దానవీర శూర కర్ణ'ని 'డివియస్ కర్ణ'గా 'శ్రీ సీతారాముల కళ్యాణము చూతమురారండి'ని 'యస్ యస్ ఆర్ కె సి ఆర్'గా మనం పిల్చుకునేవాళ్ళం అలా 'రహనా హై తేరే దిల్‌మే' సినిమాను నిర్మాతలే అంత పెద్దపేరు పెట్టి పిలువలేక కాబోలు, RHTDM గా వ్యవహరిస్తున్నారు. తెలుగులో వచ్చిన 'చెలి'కి ఇది హిందీ రూపాంతరమే కాబట్టి కథ గురించి పెద్దగా ముచ్చటించుకోనక్కరలేదు. తెలుగు పేరుకు, హిందీ పేరుకు పోలిక లేదనుకునేవారికి చిన్న సమాచారం -'ముఝే కుఛ్ కహనా హై' సినిమా డివిడి రిలీజ్ చేసినప్పుడే నిర్మాత వాసు భగ్నానీ దాంట్లో ఒక ట్యూన్ చొప్పించడం జరిగింది. సమీర్ రాసిన ఆ ట్యూన్ పేరు 'రెహనా హై తేరే దిల్ మే'. పాడినది బాబుల్ సుప్రియో. ముఝే కుఛ్ కహనాహై హిట్ కావడంతో భగ్నానీ ఈ పేరుతో సినిమా తీయడానికి సిద్ధపడ్డాడు.

పీచుమిఠాయి రొమాంటిక్ సినిమాలు హిట్ అవుతున్నాయన్న ధైర్యంతోనే భగ్నానీ సౌత్ ఇండియన్ హీరో మాధవన్ హీరోగా తీసుకుని, మోడల్‌గా పనిచేసే దియా మీర్జాను హీరోయిన్‌గా పరిచయం చేసేశాడు. సయీఫ్ అలీ మాత్రం పాతవాడే. సంగీతం అందించిన హారిస్ జయరాజ్ కూడా కొత్తవాడే. కొత్తవాడే కానీ సినిమాలో పాటలన్నీ ఏ.ఆర్. రహమాన్ టచ్‌తో ఉన్నాయని అంటున్నారందరు. ముఖ్యంగా 'బోలో బోలో'లో 'ముస్తఫా' ఛాయలు ఉన్నాయని పసిగట్టారు. ఏ.ఆర్. రహమాన్ స్టయిలును అరువు తీసుకున్నా, దానిలో కృతకృత్యుడయినందుకు హారీస్‌ను అభినందించాలి.

టైటిల్ సాంగ్‌ను తీసుకుంటే కవితాకృష్ణమూర్తి పాటపాడిన విధానం, ముఖ్యంగా ఆలాపన, సోనూ నిగమ్ కంటె మెరుగ్గా ఉందని విమర్శకుల అభిప్రాయం. పాటలో కూడా మంచి ఊపుందని ఒకసారి విన్నా తెలుస్తుంది. పాట చూద్దామా...







## పాట

అ: ముఝే కహ్‌నా తుఝ్‌సే హై కహ్‌నా
ముఝే రహ్‌నా రహ్‌నా తేరే దిల్ మేఁ రహ్‌నా
జానేజాన్ అబ్ దర్ద్-ఎ-జుదాయీ
సెహ్‌నా సెహ్‌నా ముఝ్‌కో నహీ సహ్‌నా ॥కహ్‌నా॥
రహ్‌నా హై రహ్‌నా హై
తేరే దిల్ మేఁ రహ్‌నా హై
బేకరార్ దిల్‌హై ప్యాసీ రైనా హై

ఆ: ఇక్ పల్ కహీఁ నా ముఝ్‌కో చైనా హై
కిస్‌నే కియా హై యే జాదూ
హోనే లగీ వో బేకాబూ
మైఁ బాంకే దీవానీ ఫిర్‌తీ హూఁ
క్యోంకిక మైఁ తో న జానూ ॥కహ్‌నా॥

అ: తుమ్ జో కహో తో జానేజాఁ
తారే తోడ్ కే మైఁ లావూ

ఆ: ఇక్ అజ్‌నబీ సే ముఝ్‌కో ఐత్‌బార్ క్యోం హై
హర్ ఘడీ ఖుమారీ క్యోం హై
ధడ్‌కన్ బతా

అ: దిల్‌బర్ అబ్ తో మేరీ జాఁ బస్ గయీ హో తుమ్
మాంగా మైనే జిస్‌కో జానేమన్ నహీ హో తుమ్

ఆ: కిస్‌నే కియా హై యే జాదూ...

అ: యే దిల్ తోడా జో తూనే
జీతే జీ న మర్ జావూఁ
సిల్‌సిలా యే కైసా హై జో టూటా నహీఁ
ఆంఖే బోల్తీ సైఁ లేకిన్ హోంఠ్ బేజుబాన్
మై తో ఝూమూ ఇన్ ఝూమ్‌తీ బహారోం మేఁ
ఢూండ్‌తే తుఝే నజ్రే రాత్ దిన్ నజరోం మేఁ

ఆ: కిస్‌నే కియా హై యే జాదూ...

## స్వేచ్ఛానువాదం

అ: చెప్పాలి చెప్పాలి, నీతో చెప్పాలి
ఉండాలి ఉండాలి నీ హృదయంలో
ఓ నా ప్రాణమా, చెప్పాలి చెప్పాలి
నీ వియోగదుఃఖం భరించడం నాతో కాదని
శాంతిలేని మనసనీ
దాహంతీరని రాత్రనీ

ఆ: ఊరట లేదు నాకు నిముసమైనా
ఎవరేసారో ఈ మంత్రం
వశం తప్పుతోంది శరీరం
పిచ్చిదానిలా తిరుగుతున్నా అటూఇటూ
దేనికోసమో తెలియని ఆరాటంతో

అ: ఓ నా ప్రాణసఖీ చెప్పు
తారలు తెంపి నీకై తేనా?

ఆ: కొత్తవాడిపై ఇంత నమ్మక మెందుకే?
ప్రతి ఘడియలో ఈ మత్తెందుకే?
ఓ నా గుండె సవ్వడీ, నీవేనా చెప్పవే!

అ: ఓ నా ప్రేయసీ, ప్రాణానికి ప్రాణానివయ్యావ్
నే వరించిన జవరాలివి నీవయ్యావ్
నా గుండె ముక్కలు చేశావ్
బతికుండగానే నా చావును కొనితెచ్చావ్
ఎడతెగని మన కథ ఇలాగే సాగనీ
పెదాలు పెగలకున్నా కళ్ళబాస సాగనీ
తూగే వసంతంలో నన్నూ ఊగనీ
రాత్రీపగలూ నీకై చూపులతో వేగనీ

---

ఈ పాటలో వచ్చే కొన్ని మాటలకు అర్థం గురించి చెప్పుకోవాలంటే - జాన్ - ప్రాణం, దర్ద్ - బాధ, జుదాయీ ( విడిపోవడం, సహ్‌నా - భరించడం, కరార్ - చిత్తశాంతి, బే చేరిస్తే లేదు అనే అర్థం వస్తుంది. బేకరార్ అంటే శాంతి లేని అని అర్థం. ('దూర్‌కా రాహీ'లో కిషోర్‌కుమార్ పాట 'బేకరార్ దిల్ తూ గాయేజా' వినేవుంటారు) పల్ - కంటిరెప్పపడే కాలం, అంత చిన్నదన్నమాట, (పల్ పల్ దిల్‌కే సాథ్ తూ రహ్‌తీ హో అనే పాట గుర్తుందా?) ప్యాస్-దాహం, ప్యాసా అంటే దప్పిగొన్నవాడు (ఆ పేరుతో గురుదత్ సినామా వచ్చింది) రైన్ అంటే రాత్రి దాన్నే పాటల్లో రైనా అనేస్తారు. ('పరిచయ్'లో రైనా బీత్ జాయే శ్యామ్ న ఆయే అనే పాట గుర్తుండే వుంటుంది. రాత్రి గడిచిపోతోంది, కృష్ణుడింకా రాలేదని విరహగీతమన్నమాట) చైన్- అన్నా శాంతి, సౌఖ్యం అని అర్థం. కాబూ అంటే కంట్రోలు. బేకాబూ అంటే కంట్రోలు లేకపోవడం. బాంకే - అందమైన అనే అర్థంతోబాటు వంకర అని కూడా అర్థముంది. అజ్‌నబీ మాట చాలా పాటల్లో వస్తూనే ఉంటుంది. అపరిచితుడు అని అర్థం. ఐత్‌బార్ అంటే నమ్మకం విశ్వాసం, ఖుమారీ-మత్తెక్కించే, ధడ్‌కన్ - గుండెసవ్వడి, సిల్‌సిలా (అమితాబ్, రేఖా, జయాభాదురి నటించిన సినిమా కారణంగా ఈ మాట అందరికీ తెలిసి ఉండవచ్చు) అంటే కంటిన్యూకావడం, సీరియల్ అన్నమాట! నజరే అంటే - చూపులు!

ఈ మాటలన్నీ అర్థం అయినా కాకపోయినా వినడానికి హాయిగా ఉండే పాట ఇది!




'మ్యూజిక్' అనే ఆంగ్ల పదానికుండే స్పెల్లింగ్‌లోని 'ఎమ్-యు-యస్-ఐ-సి'లో 'ఎమ్' అంటే మెలోడీ అని, అది గనుక మిస్సయితే 'యు బికమ్ సిక్' అనీ కొందరంటారు సరదాగా! అదొక చమత్కారంగా తీసుకున్నా సరే నిజంగా అదే నిజం!! కొన్నికొన్ని అనుభవం మీదనే తెలిసొస్తాయని, ఈ మాట కూడా ఆ కోవలోనిదేనని అనుభవం మీదనే ఒప్పుకుంటారు కూడా!! అటువంటి అనుభవం మీద అర్థమయ్యే మెలోడీకి పెద్దపీట వేసిన చిత్రాలలో భరణీవారి 'చండీరాణి' కూడా ఒకటి.



# చండీరాణి



ఈ చిత్రానికి కథ, దర్శకత్వం: భానుమతి, నిర్మాణం, కూర్పు: పి.రామకృష్ణ, మాటలు, పాటలు: సముద్రాల, సంగీతం: కీ॥శే॥ సుబ్బరామన్, విశ్వనాథ్ ఈ చిత్రంలోగల 8 పాటలలో 3 పాటల గురించి.



ఈ వయార మీ విలాస మోహో - రాజ రాజా నీదెరా ॥ఈ వయార॥
నీటూ గోటూలా తరితీపి మాటలా ॥నీటు గోటు॥
సయ్యాటలోన సాటిలేని
జాణనోయి రాజా - ఏలరా ॥సయ్యాట॥ ॥ఈ వయార॥
ఓ వెన్నెల రేడా - ఓ - ఓ నా వన్నెల రేడా - ఓ - ఓ
వయసూ మనసూ వలపూ వగలూ కనరా - కొనరా రాజా. ॥వన్నెల రేడా॥

ఈ పాటను ఎ.పి.కోమల పాడగా, రీటా అభినయించింది. హిందుస్థానీ సంప్రదాయంలో మారూబేహాగ్ అనే రాగం ఒకటుంది. వసంత్ దేశాయ్ సంగీతాన్ని ఇచ్చిన 'గూంజ్ ఉఠీ శహనాయీ' సినిమాలో 'తేరే సుర్ ఔర్ మేరే గీత్' పాట దానికి మంచి ఉదాహరణ. మన 'చెంచులక్ష్మి' సినిమాలో 'నీల గగన ఘనశ్యామా' అనే పాటను కూడా చెప్పుకోవచ్చు. ఇవి కేవలం ఆ రాగం ఇలా ఉంటుందని తెలుసుకోడానికి మాత్రమే. ఆ రాగంలో కొంత భాగాన్ని, యమన్ రాగంతో కలుపుతూ 'ఈ వయార మీ విలాసమోహో రాజ రాజా' పాటని స్వరపరిచినట్టు అనిపిస్తుంది. అది కూడా మొదటి చరణం వరకే!

ఈ పాట దొరికితే విని చూడండి. 'ఈ వయార మీ విలాస మోహో' అని వింటున్నప్పుడు ఒక విలాసిని వగలొలికించే విధంగా నడుస్తూ వస్తున్నట్టు అనిపిస్తుంది. దృశ్యానుభూతి కలిగేలా స్వరకల్పన చేయగల ప్రతిభకు తార్కాణంగా ఈ పాటను ఉదహరించవచ్చు.

కిలాకిలా నవ్వులా - కురిసే లేవెన్నెలా
కలిసే కన్నులా - తొలివలపే తూలే ॥కిలా కిలా॥
మిలమిల తారకలా - అందాలూ చూడ
జాబిలి మబ్బులలో - దోబూచులాడె
బెదిరీ నా మనసూ - ఉయ్యాల లూగె ॥బెదిరీ॥
నా వలపే సోలి - చేజారిపోయే ॥కిలా కిలా॥
పవలూ రేలెప్పుడూ - నీ స్మరణే ఆయే
గాలీ మేడలలో - కాపురమైపోయే
మనసూ నీ చెలిమీ - మరువా లేదాయే ॥మనసూ॥
నా కథయే - వింతగాథై పోయే ॥కిలా కిలా॥

ఈ పాటకు ఆలాపన, అభినయం భానుమతే! ఈ పాటను ఆలపిస్తున్న కొద్దీ ఇందులోని డెప్త్‌ని ఆస్వాదించగలుగుతాం. అందుకు కారణం ఆధార రాగమైన దర్బారీకానడ! ఆ రాగాన్ని ఎంత ఆలపిస్తూ ఉంటే గుండె అంత బరువవుతూ ఉంటుంది. రసావిష్కరణలో గుండె ఎంత బరువెక్కితే ఆత్మానందం అంతగా కలుగుతూ ఉంటుంది. కావాలంటే 'బైజూ బావ్ రా'లో 'ఓ దునియాకే రఖ్‌వాలే' పాటని ఆలపించుకుంటూ అదే మూడ్‌లో ఉండండి-తెలుస్తుంది. కొంతమంది ఈ 'కిల కిలా నవ్వులా' పాటలో 'కురిసే లేవెన్నెలా' అనే లైనుని 'వెన్నెల కురిసిందిలే' అనే అర్థం వచ్చేట్టు 'కురిసేలే-వెన్నెలా' అని పాడతారు. 'లేవెన్నెల' అంటే లేత వెన్నెల... అంచేత ఈ అర్థంలో పాడాలి. ఈ పాట కొంత కష్టపడితే బైట దొరుకుతుంది. సంపాదించి వినండి. భానుమతి ఒకవైపు ఆ అర్థం వచ్చేట్టుగాను, మరోవైపు బ్రీతింగ్ స్పేస్‌కు వీలు కలిగేట్టుగాను ఎలా పాడిందో తెలుస్తుంది.

అ॥ ఓ - తారకా ఓ
ఆ॥ ఓ - జాబిలి ఓ
అ॥ ఓ తారకా నవ్వులేలా నను గనీ
ఆ॥ అందాలు చిందెడి - చందమామ నీవనీ
ఓ - జాబిలీ - ఓ - ఆ తారకా నవ్వునోయీ నినుగనీ
అ॥ వినూ వీధిలోని - తారాకుమారీ
కుమారీ దరి చేరనౌనా - యీ చందమామా
ఆ॥ చేరువే తారా రేరాజుకూ
ఓ... ఆ తారకా నవ్వునోయీ నినూగని-
అ॥ మనోగాథ నీతో నివేదించలేనూ-
నివేదించకున్నా జీవించలేనూ
ఆ॥ నెరజాణవేలే - ఓ జాబిలీ
ఓ... ఆ తారకా నవ్వునోయీ నినూ గనీ
అ॥ తొలిచూపులోనీ - సంకేతమేమో -
చెలీ నవ్వులోనీ ఆ శిల్పమేమో
ఆ॥ నీ నవ్వు వెన్నెలే - ఓ జాబిలీ
ఓ... ఆ తారకా నవ్వునోయీ నినూగనీ



మిశ్రయమన్ రాగచ్ఛాయలలో స్వరపరచబడిన ఈ పాటలో హవాయిన్ గిటార్ వాద్యం అడుగడుగునా మాధుర్యాన్ని వినిపిస్తూ ఉంటుంది. పాట మొదట్లో వచ్చే సాకీలో గల 'నవ్వులేలా' అనే పదం వద్ద మంద్ర స్థాయిలో వినిపించిన ఘంటసాల గళ పరిమళాన్ని జ్ఞాపకాల దొంతర్లతో అనుభూతి పరంగా ఆవహింప చేసుకోగలిగితే శరీరం రోమాంచితం అయిపోతుంది. మొజాయిక్ ఫ్లోర్ మీద మంచుగడ్డలా, పట్టుదారంపై మంచి ముత్యంలా జాలువారే గమకాలతో ఎప్పుడూ విలక్షణంగా భాసించే భానుమతి స్వరమాధుర్యం - ఈ పాటలో అంత దగ్గరి గమకాలు లేకపోయినా - సుస్వరానికి పరవశించగల ప్రతి హృదయాన్నీ పులకరింప జేస్తుంది. రచనలోనూ, స్వరరచనలోనూ పవిత్రత తొణికిసలాడే ఈ పాటకి ముగింపులో వచ్చే మ్యూజిక్ - ఆ తర్వాత ఇంకోచరణం ఉందేమో - అందుకు ఇది ఇంటర్‌లూడేమో అనే భావన కలిగించి అతి ఆశ్చర్యకరంగా ముగుస్తుంది. ఈ పాటను ఎన్.టి.ఆర్., భానుమతి అభినయించారు.

ఒకవైపు ద్విపాత్రాభినయాన్ని, మరోవైపు దర్శకత్వాన్ని ఏక కాలంలో చేయడమనే ప్రక్రియను ఓ సాహసంగా, ఓ రికార్డుగా భావిస్తున్న ఈ తరం వారికి - ఇవన్నీ 'చండీరాణి' చిత్రంలో... ఆనాడే... అంటే 1953లోనే భానుమతి చేశారని, అదీ మూడు భాషలలో చేశారని తెలిస్తే ఆనాటి కళాకారులను గొప్పవారుగా ఈనాటికీ ఎందుకు చెప్పుకుంటున్నారో కొంత అర్థమయ్యే అవకాశం ఉంది.

ఈ చిత్రానికి సంగీతం: సి.ఆర్.సుబ్బరామన్ - విశ్వనాథ్ అని టైటిల్స్‌లో వేశారు. నిజానికి 'చండీరాణి' ముహూర్తంతో మొదలైన తర్వాత సి.ఆర్.సుబ్బరామన్ మరణించారు. ఆయనకు అసిస్టెంట్‌గా పనిచేసిన విశ్వనాథ్ ఈ చిత్రాన్ని పూర్తి చేశారు. మొత్తం స్వరరచనా బాధ్యతనంతటినీ తానే అయి స్వీకరించినా "ఇది గురువుగారి సినిమా... ఆయన పేరు వేయడమే ధర్మం. అందుకని ముందు ఆయన పేరే వేయండి" అంటూ పట్టుబట్టీ మరీ ఆయన పేరుని వేయించారు విశ్వనాథ్. ఈ రోజులలో అంతటి నైతిక విలువలను చూడగలమా!?

ఆ విశ్వనాథ్ ఎవరో గాదు.... తర్వాత రోజుల్లో తన సంగీత ఝరితో దక్షిణ భారతదేశాన్ని ఓ ఊపు ఊపేసి ఇళయరాజా వంటి సంగీత దర్శకులకు ఆరాధ్య దైవంగా గౌరవాలనందుకున్న - ఎమ్.ఎస్.విశ్వనాథనే !!

# ఆడియో చాట్



రత్నమాలలో ఏ.ఎన్.ఆర్

16-30 నవంబరు సంచికలోని 'ఆడియోచాట్ 'లో భానుమతిగార్కి మధుసూదన శర్మగారి విజ్ఞప్తి చూశాను. నాకు తెల్సినంత వరకూ ఆయన ఆశ నెరవేరే అవకాశం లేదు. ఎందుకంటే భానుమతి గారికి వారి అభిమాను లంటేనూ, వారి విజ్ఞప్తులంటేనూ ఏమాత్రం పట్టింపు లేదు. దీనిని ఒక సందర్భంలో శ్రీ వి.ఎ.కె. రంగారావుగారు ధృవపర్చారుకూడా!

★ ఇంకో కారణం ఆవిడ అశ్రద్ధవల్ల 'రత్నమాల' నెగెటివ్ కాలిపోయిందన్నది.

ఇదీ రంగారావుగారు ఒక సందర్భంలో వ్రాసినదే! పోతే సంగీత ప్రియులెవరి దగ్గరైనా 'రత్నమాల' లో అన్ని పాటలూ ఉండవచ్చుగాని (నావద్ద చాలా పాటలు ఉన్నాయి) అందులోని అపురూపమైన యుగళం "ఓ ప్రేమాధారా, నా జీవన తారా" అన్నది (ఘంటసాల, భానుమతి) దొరకదు. కారణం - ముందు అనుకోకుండా ఆఖరు నిముషంలో ఆ యుగళం చిత్రంలో యిరికించడమే! ఈ సంగతి ఘంటసాల సతీమణి చెప్పారు. ఎక్కడైనా ఈ యుగళం దొరికితే నాలాంటి ఎందరో సంతోషిస్తారు. ప్రేమ, చండీరాణీల లభ్యత విషయంగూడా అనుమానమే! హెచ్.యమ్.వి. గారు పూనుకుంటే అవుతుందేమో!

డి.ఎస్.శంకర్,
వక్కలంక. వయా ముక్కామల

★ 'రత్నమాల' నెగిటివ్ కాలిపోలేదని, అశ్రద్ధవలన పొడిపొడిగా రాలిపోయి నాశనమైపోయిందని శ్రీ వి.ఎ.కె.రంగారావు 26వ తేదీన 'హాసం' ఆఫీసుకు వచ్చినపుడు తెలిపారు.
- ఎడిటర్, హాసం



డుతా తీయగా' కార్యక్రమం ద్వారా పరిచయమై సుమారు 40 సినిమాలలో మంచి మంచి పాటలు పాడిన పార్థసారథి హైద్రాబాద్ అమీర్‌పేట ప్రాంతంలో కీర్తన డిజిటల్ రికార్డింగ్ థియేటర్‌ను నెలకొల్పాడు. ఈ థియేటర్‌లో లేటెస్ట్ సౌండ్ స్కేప్ రెడ్, ఓ టూ ఆర్ మిక్సర్, జెనలెక్స్ స్పీకర్స్ ఉన్నాయి. వీటి ద్వారా ఆడియోకి సంబంధించిన డబ్బింగ్, రికార్డింగ్, రీరికార్డింగ్, మిక్సింగ్ వంటివి ఏవైనా సరే చేసుకోవచ్చు. యస్పీ బాలసుబ్రహ్మణ్యం చేతుల మీదుగా నవంబర్ 22వ తేదీన ప్రారంభమైన ఈ 'కీర్తన డిజిటల్ రికార్డింగ్ థియేటర్' బిజీ రికార్డింగ్ థియేటర్‌గా మారిపోయింది. ఆదిత్య మ్యూజిక్ వారికోసం బాలూ పాడిన విష్ణు సహస్రనామం, భజగోవిందం ఆడియోలు జి.యస్.కె.మెలోడీస్ వారి రాముని భక్తిగీతాల ఆడియో వంటివి రికార్డింగ్ వ్యవహారాలను పూర్తిచేసుకున్నాయి. అతిత్వరలో కొన్ని సినిమాలకు సంబంధించిన పాటల రికార్డింగులు కూడా ఈ థియేటర్‌లో జరగబోతున్నాయని గాయకుడు పార్థసారథి తెలిపారు.



న్నాళ్లక్రితం 'మహతి' కంపెనీవారు యస్.రాజేశ్వరరావు హిట్స్ పేరుతో ఒక ఆడియో క్యాసెట్ విడుదల చేశారని, రెండు, మూడు రివ్యూలు చదివి, ఆ క్యాసెట్ కోసం చాలా ప్రయత్నించగా (తిరుపతి, నెల్లూరు, మద్రాసు, విజయవాడలలో) ఎక్కడా ఏ ఆడియో షాపులోనూ దొరకలేదు. ఇప్పుడు ఆ క్యాసెట్ లభించే అవకాశం ఎక్కడైనా, ఎలాగైనా ఉందా? దయచేసి తెలుపగలరు. కె. మైథిలి,
W/o.కె.మురళీమోహన్, C2-88, Dos Colony, Sullurupet-524121. NELLORE (Dt.) మీరు అడిగిన క్యాసెట్ సికింద్రాబాద్‌లోని 'సంగీత్ సాగర్' షాపులో ఉంది. దాని పేరు మిల్లీనియమ్ సీరిస్ క్లాసిక్స్ - యస్.రాజేశ్వరరావు. వారి అడ్రస్: సంగీత్ సాగర్, 1-7-293/1, ఎం.జి.రోడ్., సికింద్రాబాద్ -500003, ఫోన్ నం. 7816186. ఈమెయిల్: **WWW.SANGEETSAGARONLINE.COM** వాళ్ళకి రాసి తెప్పించుకోండి. మీ ఉత్తరం మా ఆఫీసుకి అందేరోజుకి వారి దగ్గిర 5 క్యాసెట్లు మాత్రమే ఉన్నాయి. మీకు క్యాసెట్లు చేరాలంటే ఏ పద్ధతిని వారు సూచిస్తారో ఫోన్ ద్వారా అడిగి తెలుసుకోవచ్చు. ఫోన్‌లో మాట్లాడాలనుకుంటే సంగీత్ సాగర్ ఫ్లోర్ మేనేజర్ దేవరాజ్ గార్ని కాంటాక్ట్ చెయ్యండి. ఎంతో బాధ్యతతో సమాధానం చెప్తారాయన.



ఎంబరు-జనవరి అనగానే అయ్యప్ప భక్తుల సీజన్‌గా మారిపోయింది. ఎక్కడ చూసినా అయ్యప్ప దీక్షను స్వీకరించిన భక్తులు, పందిళ్ళు, భజనలు... వీటిని దృష్టిలో ఉంచుకొని యస్.వి.యస్.మీడియా విజన్‌వారు 'అయ్యప్ప భజనలు' అనే ఆడియో క్యాసెట్‌ను రూపొందించారు. సుమారు గత 18 నెలలుగా తెలుగు, తమిళ, మలయాళ రంగాలలో విడుదలైన డివోషనల్ క్యాసెట్లను ఓ 650 దాకా పరిశీలించి వాటికి భిన్నంగా తయారు చేసిన క్యాసెట్ ఇదని, ఇప్పటిదాకా 10,000 క్యాసెట్లకు ఆర్డర్ ఉందని, తామే స్వంతంగా మార్కెట్ చేసుకొందామని నిర్ణయించుకోవటం వలన మార్కెట్ సర్వే చేయగా 35,000 క్యాసెట్ల దాకా డిమాండ్ ఉంటుందని తేలిందని క్యాసెట్‌ను రూపొందించిన శ్రీ సీతారామ్ చెబుతూ కావాలనుకున్నవారు ఎక్కణ్ణించి అయినా 98490-33830 కి ఫోన్ చేసి ఆర్డరివ్వవచ్చునని తెలిపారు.



కర్‌గా, సింగర్‌గా అందరికీ పరిచయమున్న విజయలక్ష్మి పాడిన 'ఎన్‌జాయ్' ఆడియో క్యాసెట్ అతిత్వరలో విడుదల కాబోతోంది. సుశీల, జమునారాణి, జిక్కి, ఎల్.ఆర్.ఈశ్వరి పాడిన 'ఉత్తేజిత గీతాలు' ఈ క్యాసెట్‌లో చోటు చేసుకోబోతున్నాయి. అవి: ముముము ముద్దంటే చేదా, నాగమల్లి కోనలోన, మావ మావా, ఛాంగురే బంగారు రాజా, లేలేలే నా రాజా, మసక మసక చీకటిలో, తీస్కో కోకోకోలా, మాయదారి సిన్నడు మనసే లాగేసిండు. ఈ పాటల ట్యూన్‌ని యధాతథంగా ఉంచి వెస్టర్న్ టైప్ రీమిక్స్ చేయటం ఈ క్యాసెట్ ప్రత్యేకత. పబ్లిసిటి కోసం ఈ పాటలతో పాటు వీడియో ఆల్బమ్ కూడా రూపొందుతూ ఉండటం మరో విశేషం.

# 1-15, నవంబరు 2001 సంచికలో శ్రీ దివాకరబాబు రాసిన 'హ... హో!' కథకు వచ్చిన స్పందన



దివాకరబాబు గార్కి...

హాసంలో మీ 'హ... హో!' చదివాను. కన్నీళ్ళు వచ్చాయి. నవ్వించినందుకా? ఏడిపించినందుకా? క్షణం సేపు అర్థం కాలేదు. 'నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి.' అన్నారు ఆత్రేయగారు. నవ్వించి ఏడిపించి కన్నీళ్ళు తెప్పించి ఆత్రేయగారి పాటలోని పంక్తిని గుర్తుచేశారు.

మీరు హాస్యాన్ని పండించటంలో దిట్ట అయివుండి మరో హాస్య రచయిత కీ॥శే॥ జంధ్యాలగారిని మెచ్చుకోవటంలో మీ మాగ్నానిమిటీ తెలుస్తోంది. జంధ్యాలగారికి ఇంతకంటే ఘనమైన నివాళి మరొకటి వుండదు.

హాస్యబ్రహ్మ జంధ్యాలగారిని హాస్యం కోసం దేవతలు తీసికెళ్ళిపోయారు అనడం అతిశయోక్తి అయినా జంధ్యాలగారి అస్తమయంతో కలత చెందిన మనసు వూరట పొందటానికి ఎంతగానో సహకరిస్తుంది.

హాస్య సంగీతాల సమ్మేళనం 'హాసం'లో మీరు మరిన్ని రచనలు చేస్తారని ఆశిస్తూ...

**3. శోభన్ (హెడ్ మాస్టర్)**
**తాడేపల్లి గూడెం, తాళ్ళముదునూరు పాడు,**
**వెస్ట్‌గోదావరి జిల్లా.**

**1-15** నవంబరు 01 'హాసం'లో మీ రచన 'హ... హో!' చదివాను. నవ్వులో శివుడున్నాడురా... అంటూ చాలా ఆసక్తికరంగా మొదలు పెట్టి చివరకు వచ్చేసరికి జంధ్యాలగారి 'అన్యాయనిష్క్రమణ' దగ్గరకు తీసుకెళ్లి మా గుండెలు పిండేశారు కదండి బాబు! ఒక నిమిషం దేవతలంతా పాశం విసిరి జంధ్యాలను హత్య చేసింది నిజమేనేమో! అనిపించింది. ముళ్ళపూడి గారి స్టయిలు, ఆత్రేయగారి 'మనసు'లోకి దూసుకెళ్ళే ప్రక్రియలు ఒకేసారిగా చూపించ గలగడం వీరిద్దరిని అభిమానించే మీకే సాధ్యం. నారదుడు పరమశివుడుతో అంటున్నట్లుగా వ్రాసిన మీ పలుకులు అక్షర లక్షలు విలువ చేస్తాయి. "నవ్వు అన్నది కేవలం ఒక మాటగా మిగిలి పోయింది. ఎవరి పెదాల మీద కనిపించనంత అపురూపమైపోయింది దేవా"... అని నారదుడు చాలా చాలా ఫ్రాంక్‌గా చెప్పాడు. శివుడు దగ్గరనుంచి బ్రహ్మ దగ్గర నుంచి చల్లగా జారుకున్నదానికి మీరు చూపిన కారణాలు ఒకింత నవ్వించాయి. దేవతల కమిటీ హాల్లో దేవతల గొణుగుళ్ళు. నవ్వా? అంటే ఏంటి?... అనేవి కొద్ది కాలంలో మన భూలోకంలో కూడా వినగలుగుతామేమో! చివరకు జంధ్యాలగారు దేవతలకు చెప్పినట్లు

*నవ్వడం ఒక భోగం...*
*నవ్వించడం ఒక యోగం...*
*నవ్వలేక పోవడం ఒక రోగం...*

మీరు సినిమాలకే కాక ఇలా మమ్మల్ని పత్రికల ద్వారా పలకరిస్తూ వుండండి. మీరు ప్రయోజన వాక్యంలో 'హాసం' గురించి వ్రాసింది కూడా బాగుంది.

**జి. ప్రభాకర్ రావు, ఇ.ఇ.**
టి.యస్. భవన్, హైద్రాబాద్.

✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉

సెంటిమెంట్, కామెడీల
సవ్యసాచి దివాకరబాబు గార్కి,
నమస్సులతో...

ఏంటి సార్ ఇది? మీ రేదో నవ్విస్తారని ఆశగా చదువుతూ పోతే పిల్లోడికి అద్దంలో చందమామని చూపించినట్లు చేశారు. ఇంతకీ మీరు దుఃఖాన్ని సిరాగా చేశారా ఏంటి?

అప్పటి వరకు నవ్వించి, కవ్వించి, 'నవ్వు'పై స్వర్గం దాక తీసికెళ్ళి, ముల్లోకాలు ముచ్చటగా తిప్పి, ముక్కోటి దేవతలకు దూరమైన 'నవ్వు'కి మన అందరి ఆరాధ్యదైవం 'జంధ్యాల'ను బలి చేస్తారా? హిమాలయ శిఖరాగ్రం దాకా తీసికెళ్ళి టక్కున తోసేస్తారా?

నిజంగా గుండె కలుక్కుమనేలా చేశారు సారు. హాస్యబ్రహ్మని మీ రెంత ఆత్మీయంగా తలచుకోకపోతే ఇంత హృద్యంగా రాయగలరు?

'హ... హో!' అని రాసి ఏడ్పించినందుకు, మహానుభావుడ్ని ఇంకెవరూ ఇంతలా నిర్వచించేలా ఆస్కారం లేకుండా రాసినందుకు మిమ్మల్ని ఏం చేయాలి?

మీ ప్రీతి పాత్రులు
**రవి, రఫీ.** గూడూరు.

✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉ ✉

శ్రీ దివాకర బాబు గారికి,
'హ...హో!' కథ వ్రాసినందుకు మీకు నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి!

ఎంత మంచి కథ వ్రాసారు? ఎంత గొప్పగా వ్రాసారు? ఆంధ్ర దేశమంతటా ఉన్న వేలాది 'జంధ్యాల'గారి అభిమానులలో నేనూ ఒక దానను. కథ పూర్తి చేసేసరికి నా కళ్ళనిండుగా నీళ్ళొచ్చాయి! కానీ వెంటనే జంధ్యాల గారి సూక్తి ముక్తావళి- 'నవ్వడం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేక పోవడం ఒక రోగం' చదువుకొని కన్నీటిని తుడుచుకొని మొదట్నుంచీ మీ కథ మళ్ళీ మరోసారి, ఇంకోసారి మూడోసారీ చదివాను... కలలో సైతం, కడు దుఃఖాల్లో కూడా నవ్వించే హాస్యం జంధ్యాలగారిది. ఆయన సినిమాలు ఒక్కోటి ఎన్నిసార్లు చూశానో! 'శ్రీవారికి ప్రేమలేఖ'లో డైలాగులన్నీ ఇంచుమించుగా నాకు కంఠస్థం! ఎంత త్వరగా తీసుకుపోయారు పాడు దేవుళ్ళు...! అవును మీరు రాసింది నిజం... ఎంత ప్రయత్నించినా వాళ్ళు పొందలేని వరం నవ్వు... అందుకే,

"ముక్కోటి దేవతలు ఒక్కటైనారు!
చక్కన్ని నవ్వును కొల్లగొట్టారు..."

అభిమానులందరి హృదయాలలోనూ జంధ్యాలగారు చిరంజీవి... ఆచంద్రతారార్కం ఉంటారు.

శతకోటి నమస్సుమాంజలులతో,
**వై.యస్. నాగమణి,** సికింద్రాబాద్

వచ్చిన ఉత్తరాలలోపై నాలుగు బాగున్నాయని వాటిలో 3. శోభన్ (హెడ్ మాస్టర్) రాసిన లెటర్ బహుమతికి అర్హమైనదని దివాకరబాబు తెలిపారు

ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలలపాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాము. తక్కిన ముగ్గురికీ 'హాసం' 1-15 డిసెంబరు, 2001 సంచికను సముచితంగా పంపుతున్నాము.

1-15 నవంబరు, 2001 సంచికలో దివాకరబాబుగారి అడ్రసుని యిస్తూ ఆయన ఇంటిపేరుని 'అక్షరాజ్యం' అని పొరపాటుగా పేర్కొనటం జరిగింది. దానిని **'అక్షరాలయం'**గా గమనించమని మనవి.

**— ఎడిటర్**

# ఉడ్‌హౌస్ ఫర్ యూ



# ముసలి విగ్గూ... గోల్డెన్ లెగ్గూ...



వారం రోజులుగా మెస్‌లో ఒకరినొకరు చూసుకుంటున్నా వాళ్లు మాట్లాడుకోవటం అదే మొదటిసారి. "మీ పేరు వాణి కదూ'' అని మాధవ్ పలకరించాడు.

"అవును. కానీ మీకెలా తెలుసు?"

సమాధానంగా 'ఇవన్నీ నాకు తెలియకుండా ఉంటాయా' అన్న స్టయిల్లో మాధవ్ చిరునవ్వి, "మీరు డాన్సరు. 'నేటి మహిళ' నృత్య నాటకంలో కోరస్‌లో ఉన్నారు. గవర్నమెంటు కాంట్రాక్టుపైన మీ బృందం వాళ్లు ఊరూరా తిరుగుతున్నారు" అని కలిపాడు.

వాణి తన అందమైన కనురెప్పలు టపటప లాడించి, "అన్నీ నిజమే కానీ మీకెలా తెలుసు?" అని అడిగింది మళ్లీ.

"అది నా వృత్తిధర్మం లెండి" అని ఎఫెక్టు కోసం కాస్త ఆగి,

**"నేను డిటెక్టివ్‌ను" అని ఎనౌన్స్ చేశాడు మాధవ్.**

ఆ మాట చెప్పగానే అవతలివాళ్లు సాధారణంగా కనబరిచే హావభావాలు తెలుసు కాబట్టి వాణి ముందు వినయం ప్రదర్శించడానికి రెడీ అవుతున్న మాధవ్ కంగు తినాల్సి వచ్చింది. వాణి కళ్ళల్లో క్యూరియాసిటీ, ఎడ్మిరేషన్ లాటివి ఏవీ కనబడలేదు. అక్కడికి ఏ డిటెక్టివ్వూ తన డిటెక్టివ్వునని చెప్పుకోడని, అలా చెప్పుకున్నవాడిని అవతలివాళ్లు అనుమానిస్తారనీ మాధవ్ ఫ్రెండ్సు తనను అనేకసార్లు మందలించారు. కానీ డిటెక్టివ్‌నని చెప్పి కాలరెగరేసే టెంప్టేషన్‌ను ఆపుకోవడం మాధవ్ తరం కాదు. నిజానికి ప్రజలందరికి తెలిసిన అపరాధ పరిశోధక నవలల మార్కు డిటెక్టివు కాదు మాధవ్. అతనిప్పటిదాకా రక్తపు చుక్కల జోలికి పోలేదు. వేలిముద్రలు, కాలిముద్రలు ఒక్క అంగుళం కూడా కొలవలేదు. అందమైన అమ్మాయిని సెక్రటరీగా పెట్టుకోలేదు.

ఒక డిటెక్టివు కంపెనీలో అతను పని చేస్తున్నాడు. వాళ్లు సాధారణంగా సెక్యూరిటీ కేసులు, ఫైనాన్షియల్ కేసులు, డైవోర్స్ కేసులు మాత్రం చూస్తూ ఉంటారు. అందువల్ల మాధవ్ పని ఎంతసేపూ ఎవళ్లో ఒకళ్ల వెంటపడి, వాళ్లు ఎలా తిరుగుతున్నారో కనిపెట్టి రిపోర్టు రాసి ఇవ్వడమే జరుగుతుంది. ఆ సదరు వెంటాడబడే వ్యక్తి హాయిగా హోటల్లో భోజనం లాగిస్తుంటే, మాధవ్ బయట వర్షంలో, గొడుగేసుకుని అతను కారు నెంబరు నోట్ చేసుకుని, అతనెవరితో వచ్చాడో గుర్తుపెట్టుకుని అవస్థపడుతుంటాడు. కానీ డిటెక్టివ్ కుండే గ్లామరు డిటెక్టివు కుంది. అది కొంతమంది దగ్గర పనిచేయదని మాధవ్‌కి ఇప్పుడే తెలిసి వచ్చింది. పని చేయకపోయినా బావున్ను. నెగటివ్‌గా పని చేసిందనిపించింది వాణి ముఖం చిట్లించిన విధానం చూస్తే! దానికి కారణం గురించి మరీ ఎక్కువగా పరిశోధన చేసే భారాన్ని మాధవ్‌కి తప్పిస్తూ వాణి తన అభిప్రాయం హోటల్లో అందుబాటులో ఉన్న అన్నంకుండ బద్దలకొట్టకుండానే చెప్పేసింది.

"నాకు డిటెక్టివులంటే పడదు. ఇతరుల జీవితాలలోకి తొంగి చూడడం తప్ప వాళ్లు చేసే పనేమీ ఉండదు" అని ఈసడించేసింది.

మాధవ్ కలలమీద కుండెడు చన్నీళ్లు దిమ్మరించినట్టయింది. వాణిని చూసిన దగ్గర్నుంచీ అతనెన్నో ఆశలు పెట్టుకున్నాడు. ఆమెను పెళ్లాడినట్టు కలలు కూడా కనేశాడు. తనతో స్నేహం పెరిగితే అభిప్రాయం మార్చుకుంటుందని అనుకోవడం

కూడా పొరబాటని పది రోజుల్లో తెలిసిపోయింది. వాణి పాయింట్లు వాణికున్నాయి. "డిటెక్టివులు ఇంటిపట్టున ఉండేది తక్కువ. క్లయింట్లు ఏం చేస్తున్నారో చూడడంలోనే వాళ్ల బతుకంతా గడిచిపోతుంది. నేను పెళ్లాడబోయేవాడు నా కళను గౌరవించాలి. అంటే నా వంటి కళాకారుడయితే మంచిది" అని చెప్పేసింది. 'నువ్వు వృత్తి మారిస్తే పెళ్లాడడానికి అభ్యంతరం లేదు' అని సూచిస్తూ.



ఆ తర్వాత మూడు రోజులూ మాధవ్ ఆఫీసుకి వెళ్లలేదు. ఆట గానీ, పాటగానీ, నటన గానీ నేర్పుతానని ప్రకటించుకున్న సంస్థలన్నిటి చుట్టూ తెగ తిరిగేడు. వాళ్లందరూ ముక్తకంఠంతో వెలిబుచ్చిన అభిప్రాయం ఒక్కటే - మాధవ్ వీటిలో దేనికీ పనికిరాడని. ఇక వాణిని పెళ్లాడే కార్యక్రమానికి ఫుల్‌స్టాప్ పెట్టేదామని అనుకుంటూండగానే మాధవ్ మేనేజరు పిలిచి అతనికి ఒక కొత్త పని అప్పగించాడు. "నేటి మహిళ" డ్రామా ప్రదర్శించే బృందంలో ఒక నటుడి భార్యకు భర్తపై అనుమానం. ఆ బృందంతో బాటు ఊళ్లు పట్టుకుని తిరగడం ఆమెకు కుదరదు కాబట్టి అతని ప్రవర్తనను గమనించి తనకు రిపోర్టు చేయమని మాధవ్ కంపెనీ నడిగిందామె. ఆ బృందం తిరిగే ఊళ్లన్నీ తిరిగి, ప్రేక్షకులలో ఒకడిగా ఉంటూ అతన్ని గమనించాలని, వాళ్లు ఏ హోటల్‌లో దిగితే అక్కడే దిగి అతనెవరితో కలుస్తున్నాడో కని పెట్టాలని మాధవ్‌ను బాస్ ఆదేశించాడు.

మాధవ్ పొంగిపోయాడు. వాణికి ఏదో విధంగా దగ్గరగా ఉండే అవకాశం వచ్చింది కదాని. కానీ ఇబ్బంది ఏమిటంటే అతను మామూలు వేషంలో ప్రతీ ఊరికి ప్రేక్షకుడిగా వెళితే ఆ నటుడు రెండు, మూడు రోజుల్లో గుర్తుపట్టేస్తాడు. అందుకని ఊరూరికి మాధవ్ వేషం మారుస్తూ వచ్చాడు. ఓ సారి పల్లెటూరి రైతుగా, మరోసారి షావుకారుగా, ఇంకోసారి పూజారిగా, ఇంకో రోజు పీచుమిఠాయి అమ్మేవాడిగా, మరోసారి క్రిస్టియన్ ఫాదిరీగా.... ఇలా ఊరూరికీ వేషం మారుస్తూ వచ్చాడు. ఈ వేషాల వల్ల వాణి తనను, తద్వారా తన ప్రేమను గుర్తించలేకపోతోందేన్న బాధ కలుగుతున్నా వృత్తిధర్మం కొద్దీ అన్నీ ఓర్చుకున్నాడు మాధవ్.

అప్పటికే అతను ఆరువారాలుగా ఆ ట్రూపును అంటిపెట్టుకుని తిరుగుతున్నాడు. గుంటూరులో ప్రదర్శన అయిపోయి, సీట్లోంచి లేచి వెళ్లిపోతూ ఉంటే ఓ కుర్రాడు వచ్చి చెప్పాడు. 'పరమశివం గారు మిమ్మల్ని ఓసారి కలవమన్నారు' అని వెళితే 'రేపు మధ్యాహ్నం అన్నపూర్ణహోటల్లో కలిసి భోజనం చేద్దాం రండి' అన్నాడు పరమశివం.

పరమశివం ఆ డాన్సు ట్రూప్ మేనేజరు. స్వతహాగా మంచి నటుడే గవర్నమెంటు కాంట్రాక్టు సంపాదించి టూర్లు నిర్వహించేది అతనే. అతనన్నా, అతని నటనన్నా మాధవ్‌కి ఎంతో ఇష్టం. అలాటివాడు తనను భోజనానికి ఆహ్వానించాడంటే మాధవ్ పొంగిపోయాడు.

ముసలి టీచరు వేషంలో పరిచయమయ్యాడు కాబట్టి పాపం మాధవ్‌కి మర్నాడు కూడా అదే వేషంలో భోజనానికి వెళ్లవలసి వచ్చింది. తెల్లగడ్డం, మీసం అడ్డుపడకుండా అన్నం తినడం పెద్ద ఫీటే అయింది. భోజనం అయిన తర్వాత సిగరెట్టు కాలుస్తుండగా ఆ ప్రశ్న అడిగేడు పరమశివం-

"బైదివే, ఇంతకీ మాలో ఎవర్ని వెంటాడుతున్నావు, మిస్టర్?"

ఉక్కిరిబిక్కిరయి, సిగరెట్ మింగేయబోయాడు మాధవ్. గడ్డం కాలిపోతుందన్న భయంతో కాబోలు, ఆ ప్రయత్నం విరమించుకున్నాడు కానీ తమాయించుకోవడం కష్టమయింది. "మీరనేది నా కర్థం కావటం లేదు" అన్నాడు తెల్లగడ్డం ఊడిపోయిందేమో చూసుకుంటూ.

"కమాన్, బుకాయింపులు వద్దు. నువ్వు డిటెక్టివ్ అని నాకు తెలుసులే. కానీ మాలో ఎవర్ని ఫాలో అవుతున్నావో మాకెవ్వరికీ తెలియటం లేదు. దానిమీద పందాలు కూడా వేసుకున్నాం".

మిన్నువిరిగి మీద పడ్డట్టయింది మాధవ్‌కి. ఇన్నాళ్ల దాకా తనేదో మిస్టర్





ఇండియాలా వాళ్లకు కనబడకుండా వాళ్లందరినీ మైక్రోస్కోపు కింద పురుగుల్లా పరీక్షించేస్తున్నాడనుకుంటున్నాడు. చూస్తే పురుగే ఎదురు తిరిగి మైక్రో స్కోపులోంచి తనను చూస్తున్నట్టుంది. తప్పు, తప్పు... ఒక పురుగు కాదు. పురుగులన్నీ.... ఇన్నాళ్లూ మాధవ్‌కి తన మారువేషాలు వేసే సామర్థ్యం మీద నమ్మకం ఉండేది. అందునా రకరకాల మనుష్యుల వేషభాషలను, వాళ్ల యాసలను అనుకరించగలనని గర్వం ఉండేది. ఇవాళ అదంతా తుడిచి పెట్టుకుపోయింది.

పరమశివం మాధవ్‌కేసి పరిశీలనగా చూసాడు. "అవునూ, ఇవాళ నువ్వు వేసుకున్న వేషం ఏమిటి? వందేళ్లు నిండినా ఓటు వేయడానికి వచ్చిన వృదుడే?".

వెటకారం అర్థం చేసుకోలేనంత అమాయకుడు కాదు మాధవ్.




అద్దంలో తనను చూసుకున్నాడు. వందకు తక్కువగా, తొంభై ఏళ్లకి ఎక్కువగా ఉంది వేషం. గడ్డం, మీసం కాస్త ఎక్కువైపోయాయి. గడ్డివాములోంచి దూసుకువచ్చేసిన జీపులా ఉన్నాడనిపించింది.

పరమశివం ఇంకా మాట్లాడుతూనే ఉన్నాడు, "మా ట్రూపు సభ్యులందరకూ ఇదో ఆట అయిపోయింది. పై ఊళ్లో నువ్వే వేషం వేస్తావో చర్చించడంతోనే సరిపోతోంది వాళ్లకు. రిహార్సల్స్‌లో కూడా ఇదే డిస్కషన్. రాజమండ్రిలో చెవిటి పాలేరు వేషం వేసేవు కాబట్టి, ఏలూరులో కుంటి జమీందారు వేస్తావని మాణిక్యం అంటాడు. కాదు మిలటరీ వాడి వేషం వేస్తావని సుందరం అంటాడు. అసలిన్ని వేషాలేయడం ఎందుకయ్యా? మా నాటకాల్లో చూడు. టై మారిస్తే మారువేషం వేసినట్టే లెక్క. కన్నతల్లి కూడా గుర్తుపట్టడానికి వీల్లేదు. అసలు నువ్వు ఒంగోలులో వేసిన అరవ సర్వరు వేషం నీకు బాగా నప్పింది. అదే ఉంచుకోవాల్సింది. పోనీ మార్టూరులో వేసిన తాగుబోతు కుర్రాడి వేషమైనా ఉంచుకోవాల్సింది. అనవసరంగా ఇంతంత గడ్డాలు వేసుకుని తయారవ్వడం దేనికి, దురద పుడితే రూముకెళ్లేదాకా గోక్కోడానికి ఇబ్బందే కదా.... పోనీలే....నీ వేషాలు నీ ఇష్టం కానీ, ఇంతకీ నువ్వు ఎవరి వెంటపడ్డావో అది చెప్పు చాలు."

మాధవ్‌కి తన మీద తనకి కోపం దుఃఖం, రెండూ కలిసి వచ్చేస్తాయి. అంటే తను వేసే ప్రతీ వేషం వీళ్లు... వీళ్లలో ప్రతీ ఒక్కళ్లూ కనిపెట్టేస్తూనే ఉన్నారన్నమాట. ఏమనాలో తెలియక ఉక్రోషంగా, "అవన్నీ మీకెందుకు లెండి?" అన్నాడు.

"నాకెందుకేమిటి? కావాలి. నేను పందెం కడితే నాకు కాక ఇంకెవరికి కావాలి? మేమంతా కలిసి సిండికేట్‌గా ఏర్పడి డబ్బులు కలక్ట్ చేసాం. నువ్వు వెంటపడుతున్న వ్యక్తి నేను అనుకున్నవాడే అయితే నాకు రూపాయికి ఇరవై రెండు రూపాయిలు వస్తాయి. రెండు వేల రూపాయలు కట్టాను. అందుచేత, మైడియర్ డిఫెక్టివ్... సారీ, అది మేం నీకు పెట్టుకున్న ముద్దుపేరులే... వాడెవరో నువ్వు కాస్త చెప్పేసి పుణ్యం కట్టుకో" అంటూ బతిమాలేడు పరమశివం.

మాధవ్‌కి అహం పూర్తిగా దెబ్బతినిపోయింది. డిఫెక్టివ్... ఇదా వీళ్లు పెట్టుకున్న ముద్దుపేరు!?. ఛ, తనంత లోకువ అయిపోయాడా? తన మారువేషాలు పనికిరాకుండా పోయాయా? తన నిస్సహాయత, అసమర్థత మీద తనకే ఒళ్లు మండింది. లేచి నిలబడ్డాడు. వెళ్లిపోవడానికి సిద్ధపడ్డాడు. పరమశివం చేయి పట్టుకుని ఆపాడు. ఎందుకు వెళ్లిపోతావన్నాడు.

"ఉండేం చేస్తాను? నా గురించి మీకందరికీ తెలిసిపోయాక నేనుండి ప్రయోజనం ఏముంది? నేను ఫాలో అవుతున్న పెద్దమనిషి కూడా జాగ్రత్త పడతాడు. ఇన్ని వేషాలు వేయడం కూడా వేస్టు" అన్నాడు మాధవ్ నిస్పృహగా.

"మైడియర్ డిఫెక్టివ్... సారీ, మాధవ్. అదంతా నీకెందుకు? నీ బాస్ నీకేం చెప్పాడు? వెంటబడు అన్నాడు. నువ్వు వెంటనంటి ఉంటావు. నువ్వు అతన్ని పట్టుకున్నా, పట్టుకోకపోయినా నీ జీతం నీకొస్తుంది. ఈ మారువేషాలు మానేయి. మాతోబాటే ఉండు, తిను, తిరుగు. ఖర్చులన్నీ నేను పెట్టుకుంటాను. ఎందుకంటావేమో, నువ్వు నాకు అచ్చివచ్చావు. నువ్వు మాతో తిరిగినప్పటి నుంచీ అన్నీ హౌస్‌ఫుల్సే. గవర్నమెంటుతో కంట్రాక్టు వల్ల హాలు సగం నిండితేనే నాకు ఖర్చులు కిట్టుబాటవుతాయి. ఇదివరకు టూర్స్‌లో కొన్ని రోజులు హాలులో షాపు కూడా నిండేది కాదు. ఈసారి టూర్‌లో నువ్వు వచ్చిన దగ్గర్నుంచి లాభం రాని ఒక్కరోజు కూడా లేదు...."

డిటెక్టివ్‌లు మానవమాత్రులే. అందునా డిటెక్టివ్ లక్షణాలు తక్కువైన కొద్దీ మానవ లక్షణాలు మరింత ఎక్కువవుతాయి. తను అనుకున్నంత గొప్ప డిటెక్టివ్ కాదని తేలిపోయింది కాబట్టి మాధవ్ మానవ లక్షణాలనే ప్రదర్శించాడు. ప్రేయసికి దగ్గరగా, మారువేషం లేకుండా నిజ స్వరూపంలో మసలగలిగే అదృష్టాన్ని కాలదన్నుకోదలచలేదు.

"ఐడియా చూస్తే బాగానే ఉన్నట్టుంది" అన్నాడు మెల్లగా.

"బాగా...నే ఏమిటి? బ్రహ్మాండంగా ఉంటుంది. మాతోబాటు నువ్వు తిరుగుతూ ఉంటే నాకు చాలా హుషారుగా ఉంటుంది. కలక్షన్స్ బాగుంటాయని మట్టుకే కాదు, ఆ జలజ నన్ను ఏడిపించినప్పుడల్లా నీతో కాసేపు మాట్లాడి ఓ మారువేషం వేయమంటాను. హాయిగా నవ్వొస్తుంది. మనసు కాస్త తేలిక పడుతుంది..."

జలజ సంగతి మాధవ్‌కి తెలుసు. "నేటి మహిళ" హీరోయిన్. కాస్త లావుగానే ఉంటుంది. కానీ మహా పొగరు. యూనిట్‌లో అందరి మీద అధికారం చెలాయిస్తూ ఉంటుంది. అపుడప్పుడు పరమశివం మీద కూడా. ఆమె అంటే అందరికీ కోపమే. కానీ ఆర్నెల్లకు కాంట్రాక్టు రాసుకోవడం వల్ల పరమశివం ఏమీ చేయలేక పళ్లు నూరుకుంటున్నాడు. అంతా బాగానే ఉంది కానీ తను కష్టపడే వేసే మారువేషాలు వీళ్లకు నవ్వు పుట్టించడానికి పనికొస్తాయంటే ఏడుపు వచ్చింది.

"జలజ అంటే అంత కోపమైతే కంట్రాక్టు రద్దు చేయవచ్చుగా. ఆవిణ్ని కంటిన్యూ చేయడమెందుకు, ఆ బాధ మరవడానికి నా చేత మారు వేషాలేయించడం ఎందుకు?" అన్నాడు కసిగా.

"ఆవిడంతట ఆవిడ పోతానంటే తప్ప నేనేం చేయలేను. అలా రాసుకుని ఏడ్చాం కాంట్రాక్టులో... అది జలజ కాదు. నాపాటి జలగ!" అన్నాడు పరమశివం నుదురుబాదుకుంటూ. "నా ఏడుపులు నేనేడుస్తాను కానీ, ఇంతకీ నువ్వు ఎవరి వెంటబడుతున్నావో చెప్పలేదు..." అన్నాడు అనునయంగా.

తన ముసలివేషం మాట మరిచిపోయి, మాధవ్ నడుం నిటారుగా చేసుకుని కూచున్నాడు. కొన్ని స్టేటుమెంట్లు ఇచ్చినప్పుడు అది తప్పనిసరి! "నేను నా వృత్తికి ద్రోహం చేయను. మీ పందేల బేరంలోకి నన్ను ఇరికించకండి. మీతో రమ్మన్నారు, ఫైన్! అంతమాత్రం చేత నేను ఎవర్నైతే ఫాలో అవుతున్నానో వారిని కనిపెట్టి చూడడం మానను. మీ కిష్టం లేకపోతే ముందే చెప్పేయండి" అన్నాడు హుందాతనాన్ని జోడించి.

పరమశివం కంగారు పడ్డాడు. "అబ్బెబ్బే, వెధవ పందాలదేముంది. ఊరికే అడిగానంతే. దాని గురించి వర్రీ కావద్దు. ఒక్క విషయం మాత్రం చెప్పు. జస్ట్ బిట్వీన్ అవర్‌సెల్వ్స్, నువ్వు ఫాలో అవుతున్నది నన్ను మాత్రం కాదు కదా!" అన్నాడు అదుర్దాగా.

మాధవ్ పరమశివాన్ని క్రేన్‌షాట్‌లోంచి చూసినట్టు చూసి, "హు" అనేసి దర్జాగా తిరిగి చరచర నడుచుకుంటూ రూములోంచి బయటకు వచ్చేశాడు. చాలా మేజిస్టిక్‌గా వచ్చాశాననుకున్నాడు. ఆ వేళ మారువేషాల విషయంలో ఘోర అవమానం పొందినా, చివర్లో మాత్రం పరమశివాన్ని దెబ్బ కొట్టగలిగానన్న తృప్తితో నిద్రపోయాడు.

మర్నాడు రాత్రి నాటకం వేసే వేళకు స్టేజి వెనక చేరాడు మాధవ్. అసలు, సిసలు మాధవ్‌లా. అతనక్కడ చూసి వాణి తెల్లబోయింది - "మీ రెప్పుడొచ్చారు ఈ ఊరు? ఇక్కడికెలా రానిచ్చారు? వెళ్లి ఆడియన్స్‌లో కూచో"అంది గబగబా, ఆశ్చర్యం, కంగారు కలిసిపోగా. 'నేటి మహిళ' నృత్యనాటికలో ఆమె పూలబాలగా వేస్తోంది. హీరోయిన్ తోటలో తిరుగుతూ తన విరహబాధను పాట రూపంలో వెలిబుచ్చుదామనుకున్నప్పుడు పదిమంది పూలబాలలు వచ్చి వెనకాల డాన్సేడతాయి. ఆ డాన్సర్లలో వాణి ఒకరు.

నిన్నటి నుండి మాధవ్‌ను పట్టిపీడిస్తున్న సందేహం మాధవ్‌ను విడిచిపెట్టింది. తన మారువేషాలను కనిపెట్టి పందాలు వేసుకున్న ముఠాలో వాణి లేదన్న విషయం రూఢి అయిపోయిందతనికి. ఆనందం పుట్టుకొచ్చింది. అందుకే 'నువ్వు ఏదో పువ్వులా ఉన్నావనుకుంటున్నది నీ ఫీలింగయితే అయి వుండొచ్చు గానీ కాబేజీ పువ్వులా తప్ప మరే పువ్వులానూ లేవు' అని చెప్పదలిచినా చెప్పలేదు.

"వాణీ... నా హృదయరాణీ" అన్నాడు డ్రమటిక్‌గా. మనసంతా ఆనందం నిండిపోయినప్పుడు డైలాగులు అలాగే వస్తాయి.

"ష్.. రిహార్సల్స్ పక్కనెళ్లి వేసుకోండయ్యా. ఇక్కడైతే మైకు లాగేస్తుంది' అన్నాడు ప్రాంప్టింగ్ చెబుతున్నవాడు.

"ఇది డ్రామా డైలాగు కాదు. నిజమైన జీవితపు డైలాగు" అన్నాడు మాధవ్ కోపంగా అతనికేసి చూస్తూ.

"ఇంతకీ మీరు ఇక్కడకు... ఎలా?" అడిగింది వాణి లోగొంతుతో.

"వాణీ... నా హృదయరాణీ..."

"ష్... పక్కకెళ్లండయ్యా అంటే.... స్టేజీమీద చెప్పే డైలాగులు లాగవు కాని ఎదవ మైకులు పక్కన పిన్ను పడేసినా సౌండు లాగేత్తాయి...థూ"

"ఇంతకీ మీరు ఇక్కడకు... ఎందుకు?" వాణి ప్రశ్నలో కొద్ది మార్పు



చేసింది.

"ష్... ఇలా అయితే ప్రాంప్టింగ్ అయినట్టే..." ప్రాంప్టింగు చెప్పే అతని విసుగు.

ఇలాటి పరిస్థితుల్లో ప్రేమించాలంటే రోమియోకు కూడా కష్టమే! ఒక పక్క ప్రాంప్టింగు వాడి గోల.... మరో పక్క స్టేజి మీద హీరోయిన్ జలజ ఖయ్‌మని పాట ఎత్తుకుంది. వాణి చూడబోతే ఆశ్చర్యాంబుధిలోంచి బయట పడలేక పోతోంది. ఇంకో పక్కనుంచి ఓ కుర్రాడు గబగబా వచ్చి "సైడ్‌వింగ్‌లో గొడవేంటని జలజగారు కోపంగా చూస్తున్నారు. ఎవరయ్యా నువ్వు?" అంటున్నాడు.

ఇక మాధవ్ ఓర్చుకోలేక పోయాడు. వాణిని పక్కకు లాక్కెళ్లాడు. "వాణీ, నేనింక మారు వేషాలు మానేస్తాను. నన్ను పెళ్లి చేసుకోవూ?" అని అడిగేసాడు. తెల్లబోయిన వాణి సమాధానం చెప్పేలోగానే ఆమె స్టేజిమీదకు వెళ్లాల్సిన ఘడియ రావడంతో ఇంకో అమ్మాయి వాణి రెక్క పట్టుకుని స్టేజిమీదకు లాక్కుపోయింది. మాధవ్‌కి మతిపోయింది. జీవన్మరణ సమస్యకు పరిష్కారం దొరకబోయి, చేజారిపోవడం అతను సహించలేకపోయాడు. వాణి వెనక్కాలే పరిగెట్టాడు.

"నేటి మహిళ" నృత్య నాటకం కథ పౌరాణిక యుగం నుండి రాకెట్ యుగం దాకా అన్ని కాలాలలోనూ సాగుతుంది. పౌరాణిక కాలానికి కావలసిన ట్రిక్కుల కోసం స్టేజీ మీద అనేక రకాల మార్పులు చేశారు. స్ప్రింగు చెక్కల మీద గెంతి స్టేజీమీదకు ఎగిరి వచ్చే గంధర్వపాత్రలు, గొయ్యిలోంచి నడిచివచ్చి స్టేజి భూమిలోంచి పైకివచ్చే నాగదేవత పాత్రలు - వేసేవారికి స్ప్రింగు చెక్కలు, గోతులు ఎక్కడ ఉన్నాయో తెలుస్తాయి కానీ పాపం మాధవ్‌కి ఎక్కడ తెలుస్తాయి? అందుకే వాణి వెంట పరిగెట్టే హడావుడిలో అతను చూసుకోకుండా స్ప్రింగు చెక్క మీద కాలు వేయడం, దాంతో స్టేజి మీదకు ఎగిరి రావడం జరిగింది.

అప్పటికే హీరోయిన్ జలజ తన భారీ శరీరంతో డాన్సు చేస్తూ, పాట పాడుతూండడం వెనక్కాల వాణితో సహా పూల బాలలందరూ ఆమె వెనక్కాల బారులు తీరడం జరుగుతోంది. ఆకాశం నుంచి ప్రత్యక్షమైన మాధవ్ సరాసరి జలజ మీద పడడం, ఆమె కుప్పకూలిపోవడం జరిగింది. ప్రేక్షకులందరూ ఒక్క క్షణం కొయ్యబారిపోయి, అంతట్లోనే కోలుకొని చప్పట్లు కొట్టారు. దాంతో జలజ ఉలిక్కిపడి, మాధవ్‌ను తోసేసి లేవబోవడం, ఒళ్లు సహకరించక మళ్లీ పడిపోవడం జరిగింది. ప్రేక్షకుల ఆనందానికి హద్దు లేక పోయింది. లేచి నిలబడి చప్పట్లు చరుస్తూ, "వన్స్‌మోర్" అని కేరింతలు కొట్టారు. స్టేజి మీద మాధవ్ తొలి ప్రదర్శన అదే. మొదటిసారే "వన్స్‌మోర్" రావడంతో పులకించి పోయాడతను. ప్రేక్షకుల కోరిక తీర్చడానికి మళ్లీ ఎగరవలసి వచ్చినందుకు బాధపడలేదతను.




****

పరమశివం పరమానందభరితుడయి ఉన్నాడు ఆ రోజు. పొద్దున్నే మాధవ్ కోసం వాకబు చేశాడు. నడుం పట్టేయడం వల్ల మంచం పట్టాడని విని తనే చూడడానికి వెళ్లాడు. మాధవ్ క్షమాపణలు మొదలుపెట్టాడు. "ఆ చప్పట్లు విని నాకు ఒళ్లూ, పై తెలియలేదు. మొదటిసారి ఏక్సిడెంటల్ అనుకున్నా... రెండోసారి పడడం..." అని చెప్పబోతున్న మాధవ్‌ను మధ్యలోనే ఆపేశాడు పరమశివం.

"మైడియర్ డిటెక్టివ్!. క్షమాపణలు చెప్పడం ఆపేయ్. నువ్వెంత గొప్పవాడివో నీకు తెలియదు. నాకు జలజ పీడ వదిల్చి పారేశావ్. ప్రేక్షకుల ముందు జరిగిన అవమానాన్ని తట్టుకోలేక జలజ కాంట్రాక్టు రద్దు చేసుకుని ఇంటికి వెళ్లిపోతోంది".

"అయ్యో, మరి హీరోయిన్ పాత్ర ఎవరు వేస్తారు? ఆ పోర్షన్ ఇప్పటికప్పుడు ఎవరు బట్టీపట్టగలరు? నా వల్ల మీకా విధంగా నష్టం వచ్చినట్టేగా...." అన్నాడు మాధవ్ ఆందోళనగా.

"నువ్వెందుకయ్యా అనవసరంగా ఇదవుతావ్.... సుందరం భార్యకు హీరోయిన్ పోర్షనంతా కంఠతా వచ్చు. ఇందాకనే ఫోన్ చేసాను. మధ్యాహ్నాని కల్లా వచ్చేస్తుంది. సాయంత్రం షోకి తను రెడీ. ఇక నాకు... అదేమిటి, అలా అయిపోయావ్?"

"సుందరం భార్యా...? అంటే నాకీ పని ఊడినట్టే! ఆవిడే కదా మాకీ పని అప్పగించింది. ట్రూప్‌లో ఆవిడే ఉందంటే తన భర్త మీద తనే ఓ కన్నేసి ఉంచుతుంది. మా బాస్ నన్ను వెనక్కి రమ్మనమంటాడు..." అంటున్న మాధవ్ పరమశివం తనను కౌగిలించుకోవడంతో ఆగిపోవలసి వచ్చింది.

"అయితే ఆ వ్యక్తి సుందరమేనన్నమాట... ఆహా యూ ఆర్ గ్రేట్ మైడియర్ డిటెక్టివ్! సుందరం గొప్ప పతివ్రతుని అందరి అభిప్రాయం. ఎవరూ అతని మీద అనుమానించలేదు. నేనొక్కణ్ణే అతని మీద పందెం కట్టాను. రూపాయికి ఇరవై రెండు రూపాయిలు. అంటే నలభై నాలుగు వేల రూపాయిలు లాభమన్నమాట. మైడియర్... నా మాట విను. నువ్వు నా జేబులో బొమ్మవి. అదృష్ట చింతామణివి. కల్పవృక్షానివి. మరోటివి. ఇంకోటివి. నువ్వు ఆడియన్స్‌లో కూచుంటే చాలు హౌస్‌ఫుల్. స్టేజీమీద అడుగు పెడితే చాలు, జలజ పిశాచాలు పరార్. వెంటాడితే చాలు నలభై నాలుగు వేలు లాభాలు. వెధవ డిటెక్టివ్ ఉద్యోగం మానేయ్. మా ట్రూప్‌లో ఉండు. మాతో బాటు నాటకాలెయ్యి".

"వేషాలేయగలిగితే వాణి కూడా దక్కుతుందనుకోండి. కానీ నాకు ఆటా, పాట రాదని అందరూ ముక్తకంఠంతో అన్నారు".

"ఏక్టరు కావడం ఏముందయ్యా. ఒకడి కోసం వెతికితే వందమంది దొరుకుతారు. కానీ నీలాటి అదృష్టదేవతలు ఎక్కడ దొరుకుతారు? నిన్ను స్టేజి ఎక్కించే పూచీ నాది. కాదనకు" అంటూ చేతులు పట్టుకున్నాడు పరమశివం.

ఏడాది తర్వాత, ఒకతను ఫోన్లో మాట్లాడుతున్నాడు. "లేదండీ, వచ్చే రెండు నెలల దాకా బిజీయే. బుకింగ్స్ ఒప్పుకోవటం లేదు. మొన్న వేసిన డ్రామా సూపర్‌హిట్ కావడంతో దాన్ని సినిమా తీద్దామనుకుంటున్నారు. నన్ను అడిగితే కుదరదన్నాను. అయినా వాళ్లు వినటం లేదు. వెయ్యాల్సి వచ్చేట్టుంది. బిలీవ్ మీ...అస్సలు ఖాళీ లేదు. కావాలంటే మా ఆవిడ వాణిని అడగండి. తనే నా కాల్‌షీట్లన్నీ చూస్తోంది...."

అతనే ప్రఖ్యాత నటుడు మాధవ్!

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పి.జి.ఉడ్‌హౌస్ కథానిక "బిల్ ది బ్లడ్‌హౌండ్" పై ఆధారపడిన ఈ స్వేచ్ఛానువాదంలో పాఠకుల సౌకర్యార్థం పేర్లు, స్థలాలు మార్చడమైనది)**

# న్యూస్ వ్యూస్

## మన బంగారం మంచిదయితే...!



ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రికీ మధ్య ఒక బంగారు కిరీటం లభించింది. జైస్వాల్ కులం వారిని వెనుకబడిన తరగతుల్లో చేర్చినందుకు సంతోషిస్తూ ఆ కులసంఘం అలహాబాదు బ్రాంచ్‌వారు రాజ్‌నాథ్ సింగ్ గారికి అక్షరాలా బంగారు కిరీటం పెట్టేసారు. ఇంత కిరీటం నేనేం చేసుకుంటాను? దీన్ని కరిగించి బంగారు ఆభరణాలు చేయించి, పేద ఆడపిల్లల వివాహ సమయంలో వాటిని బహుమతిగా ఇస్తానని ప్రకటించారు ముఖ్యమంత్రి గారు! ఆ ప్రకారమే కంసాలికి పంపారు కూడా. తీరా చూస్తే ఏముంది? అది బంగారం పూసిన వెండి కిరీటం...! కొసమెరుపు ఏమిటంటే ఇబ్బందిగా ఫీలయిన జైస్వాల్ సభ వారు 5,100.00 రూపాయల విరాళం ప్రకటించారు!

## ఎఫ్.ఎమ్. గడువు పొడిగింపు

ఈ నెల 29లోగా దేశంలోని 19 నగరాలలో 37 ఛానెల్స్ ప్రారంభం కావలసివుండగా ఇప్పటివరకు 3 నగరాలలో మూడు ఛానెల్స్ మాత్రం ప్రారంభించడం జరిగింది. మార్చి 2000లో జరిగిన ఒప్పందం ప్రకారం 16 కంపెనీలు రూ.158.75 కోట్ల బ్యాంకు గ్యారంటీలు సమకూర్చి ఎఫ్.ఎమ్ రేడియో ఛానల్స్ నెలకొల్పడానికి ప్రభుత్వం నుండి లైసెన్సు పొందాయి. డిసెంబరు 29 గడువులోగా ప్రసారాలు మొదలు కాకపోతే గ్యారంటీ మొత్తం ప్రభుత్వ పరం అయిపోతుంది. ముంబయ్‌లో ఆలిండియా రేడియో టవర్ సామర్థ్యం విషయంలో తలయెత్తిన సాంకేతిక సమస్యను సాకుగా చూసి అన్ని నగరాలలోను గడువు పెంచాలని లైసెన్సుదార్లు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.



## సంతకాలు మాత్రమే...!



పాప్యులర్ మోడల్, నటీమణి తనాజ్ కరీమ్ ఈ మధ్య ముంబయ్‌లో ప్రోవోగ్ ఫ్యాషన్‌షోకి వచ్చింది. షో కాగానే జనాలంతా ఆమెను చుట్టుముట్టి ఆటోగ్రాఫ్‌లు అడగసాగేరు. కొంతమంది ఆటోగ్రాఫ్ పుస్తకాలు ఇస్తే, అవి లేనివాళ్లు అరచేతులు చాపారు. ఆమె చిరునవ్వులు చిందిస్తూ అందరికి సంతకాలు పెట్టింది, అరచేతులు చాపిన వాళ్లకు కూడా. చిరిగిన బట్టలేసుకుని అరచేయి చాపిన అభిమానికి సంతకం పెట్టబోతున్నప్పుడు మాత్రం ఆమె చిరునవ్వు ఇగిరిపోయింది. "సంతకాలు కాదు, డబ్బులియ్యమ్మా" అన్నాడు వాడు. తనాజ్ తెల్లబోయి, తేరుకుని "నా దగ్గర చిల్లరలేదయ్యా, వేరెవరినైనా అడుగు" అంది 'ఇక్కడ ఆటోగ్రాఫ్‌లు మాత్రమే ఇవ్వబడును' అన్న బోర్డు కట్టుకున్నదానిలా!

## ముఖ్యమంత్రి పై జాలి!



రాష్ట్ర ఉద్యోగులకు దీపావళి బోనస్ ఇవ్వడానికి బొక్కసంలో డబ్బు లేదన్న మహారాష్ట్ర ముఖ్యమంత్రిపై ఉద్యోగులు కోపం తెచ్చుకోలేదు. 'మాకు లేకపోయినా ఫర్వాలేదు మా అందరికంటె కష్టపడుతున్నవారు. మీకు మాత్రం రావాల్సిందే' అంటూ ప్రతీ ఉద్యోగీ అక్షరాలా మూడున్నర రూపాయల చొప్పున విరాళం ఇచ్చారు. బోనస్ అందుకున్న విలాస్‌రావ్ దేశ్‌ముఖ్ గారి ముఖం వికసించిందో లేదో మాత్రం తెలియలేదు.

## "ఆల్ ది బెస్ట్ ట్వింకిల్ ఖన్నా"



రాజేష్ ఖన్నా, డింపుల్ కపాడియాల కుమార్తె ట్వింకిల్ ఖన్నా నాటక రంగానికి ప్రవేశించింది. అదీ "ఆల్ ది బెస్ట్" అనే ఆంగ్ల హాస్య నాటికతో! గత పక్షంలో హైదరాబాదులో "తాజ్ కృష్ణా"లో ప్రదర్శించబడిన ఈ నాటికలో ముగ్గురు యువకులు (ఒకరికి దృష్టిలోపం, మరొకరికి మాటలోపం, ఇంకోరికి వినికిడి లోపం) ఒక అమ్మాయి వెంటబడడం అనే థీమ్ మీద ఆధారపడిన ఈ డ్రామాకు ఫిరోజ్ ఖాన్ దర్శకత్వం వహించారు. నాటకమూ, ట్వింకిల్ ఖన్నా అభినయమూ - రెండు బాగున్నాయని అన్నారు ప్రేక్షకులు.

### ఉవాచ

"పదమూడు, పద్నాలుగేళ్లుగా నటిస్తున్నా. ఇప్పటివరకు ఓహో! శివాజీరాజా! అని కానీ, పాపం! శివాజీరాజా! అని కానీ అన్పించుకోలేదు."

- హాస్యనటుడు శివాజీరాజా

'నటించడం, సినిమా తీయడం నాలాంటి వాడికి పెద్ద బోర్ జాబ్'.

- తనే హీరోగా 'జీవన్ కా సఫర్' సినిమా రూపొందించి ఫెయిలయిన గాయకుడు కుమార్ సానూ

### టూకీటాక్

- భమిడిపాటి కామేశ్వరరావు గారి నాటకాలకు ప్రేరణ నిచ్చినది మోలియర్ అనే ఫ్రెంచి నాటకకర్త రాసిన హాస్య నాటకాలు. ఆ విషయాన్ని కామేశ్వరరావు గారు స్వయంగా తెలియబరిచేవారు. ఆయన రాసిన "పెళ్లి ట్రెయినింగ్" (బావా బావా పన్నీరు పేరుతో జంధ్యాల సినిమా తీసారు)కు కూడా మూలం మోలియర్ రాసిన నాటికే. ముక్కపాటి నరసింహశాస్త్రి గారు రాసిన "సుబ్బారాయుడు"కు కూడా మోలియర్ నాటకమే ఆధారం. మోలియర్ రాసిన "ది డాక్టర్ ఇన్ స్పైట్ ఆఫ్ హిమ్‌సెల్ఫ్" అనే నాటక ప్రదర్శన అరవింద్ మిత్తల్ దర్శకత్వంలో హైదరాబాదులోని ఎలయన్స్ ఫ్రాంకైస్‌లో నవంబరు 28న ఏర్పాటు చేయడం జరిగింది.
- సికింద్రాబాదు సెయింట్‌మేరీ హైస్కూలులో డిసెంబరు 2, 2001న జేసుదాసు సినిమా సంగీత కచ్చేరి జరగబోతోంది.

# స్వరంలో భాస్వరం గల ఎల్లరి ఈశ్వరి

# ఎల్లారీశ్వరి

**శృంగార గీతాలను రక్తికట్టించడమనేది చాలా కష్టం. ఆ విషయంలో బహునేర్పరి ఎల్.ఆర్.ఈశ్వరి. ఆమె గళంలోని మత్తుకి, గమ్మత్తుకి, మహత్తుకి ఎలాంటివాడైనా గులాం కావాల్సిందే. నాలుగు దశాబ్దాలుగా పాటకు కొత్త సొబగులద్దుతూ అరవైలో వున్న వారిని కూడా ఇరవైలోకి తీసుకెళ్ళ గల సత్తా ఆమెకు మాత్రమే సొంతం. కొన్నేళ్ళుగా ఆమె తెలుగులో పాటలు పాడకపోయినా, ఈతరం శ్రోతలు కూడా ఆమె స్వరాన్ని, ఆ స్వరంలోని భాస్వరాన్ని ఆస్వాదిస్తున్నారు, ఆనందిస్తున్నారు.**



ఎల్.ఆర్. ఈశ్వరి డిసెంబర్ 8న (స్వాతి నక్షత్రంలో) మద్రాస్‌లో జన్మించారు. తండ్రి మద్రాసులో స్పెన్సర్స్ కంపెనీలో మంచి ఉద్యోగమే చేస్తూ ఈశ్వరి ఐదేళ్ళ వయసులో వుండగా మరణించారు. తల్లి నిర్మల మొత్తం కుటుంబ భారాన్ని మోసేవారు. అయితే నిర్మల మంచి గాయని కూడా కావడంతో సినిమాల్లో అవకాశాలు వచ్చినప్పుడల్లా పాటలు పాడుతూ వుండేవారు.

ఈశ్వరి ఎస్ఎస్ఎల్‌సితో చదువాపేసారు. గాయనిగా తల్లి ప్రభావం ఎల్.ఆర్. ఈశ్వరి మీద అధికంగా వుంది.

ఈశ్వరి తల్లి నిర్మల సినీగీతాలకు కోరస్ పాడేవారు. ఆమెతో పాటు ఈశ్వరి కూడా రికార్డింగ్‌లకు వెళుతుండేది. ఆ సమయంలోనే కొన్ని చిత్రాలకు కోరస్ బృందంలో పనిచేసే అవకాశం లభించింది.

తమిళ దర్శకుడు ఎ.పి.నాగరాజన్ ఈమెలోని ఉత్సాహాన్ని, తపనను గమనించి సోలో సింగర్‌గా పరిచయం చేయాలనుకున్నారు.

సరిగ్గా అదే సమయంలో ప్రముఖ సంగీత దర్శకుడు కె.వి.మహదేవన్ 'నల్ల ఇడత్తు సంబంధం' (1958) అనే తమిళ చిత్రం ద్వారా ఈశ్వరిని గాయనిగా పరిచయం చేసారు. ఆ పాట 'ఇవరేదాన్ అవర్'.

ఈశ్వరి రోమన్ కాథలిక్ కుటుంబానికి చెందిన తమిళ వనిత. ఆమె అసలు పేరు లూర్ద్ మేరీ. అందువల్ల అమ్మమ్మ గారింట్లో అంతా 'మేరీ' అని పిలిస్తే నానమ్మ గారింట్లో (వారంతా హిందూ దేవతల్ని కొలుస్తారు) 'రాజేశ్వరి' అని పిలుస్తారు. దాంతో వారిరువురినీ సంతృప్తి పరచడం కోసం తన పేరుని లూర్ద్ రాజేశ్వరిగా మార్చుకున్నారు. తమిళ చిత్రరంగంలో అప్పటికే రాజేశ్వరి పేరుతో ఒక గాయని ఉండటంతో దర్శకులు ఎ.పి. నాగరాజన్ లూర్ద్ రాజేశ్వరిని ఎల్.ఆర్.ఈశ్వరిగా పరిచయం చేసారు.

1962 ప్రాంతంలో 'అనుబంధాలు' (1963) సినిమా కోసం యం.బి.శ్రీనివాసన్ ఆమె చేత తొలిసారిగా తెలుగు పాటను పాడించారు. ఆ పాట 'నా పేరు సెలయేరు, నన్నెవ్వరాలేరు'.

ఆ తర్వాత స్వర్గీయ టి.వి.రాజు సంగీత దర్శకత్వంలో 'శ్రీ సింహాచలక్షేత్ర మహిమ' (1965)లో పాడి తెలుగులో పాపులర్ అయ్యారు.

ఆమె ఇంతవరకూ 14 భాషల్లో వేలాది పాటలు పాడారు. ఆ రోజుల్లో ఆమె కనీసం రోజుకు 20 పాటలకు తక్కువ కాకుండా పాడేవారు. ఆమె మాతృభాష తమిళం అయినా గానీ, తెలుగు, కన్నడం, మలయాళం, తుళు భాషలలో కూడా చాలా స్పష్టంగా పాటలు పాడేవారు.

నన్నగండ ఎల్లి అనే కన్నడ చిత్రంలో అతిక్లిష్టమైన పాటను సైతం అలవోకగా పాడేసారు. ఆ పాటలోని గొప్పతనం ఏమిటంటే ఒక్కో భాషకు 2 లైన్లు చొప్పున 14 భాషల చరణాలు అందులో ఉండటం.

అలాగే 'కథానాయకమొల్ల' (1970) చిత్రంలో అయిదుభాషల పాటని పాడేరు.

దేశ్, ధర్మవతి రాగాలను ఆమె అమితంగా ఇష్టపడతారు.

సంగీత దర్శకత్వం పట్ల ఆమెకు ఆసక్తిలేదు. మంచి అవకాశమొచ్చినా చేయననే చెబుతారు.

ఆశాభోంస్లే, మహమ్మద్ రఫీ, సుశీల, ఘంటసాల ఆమె ఫేవరెట్ సింగర్స్. ఎన్టీఆర్, ఎం.జి.ఆర్, ఎ.ఎన్.ఆర్, సావిత్రి ఆమె ఫేవరెట్ ఆర్టిస్టులు.

ఖాళీ సమయాల్లో తను పాడిన పాటల్నే మళ్ళీ మళ్ళీ వింటూ తన కంఠంలో లోపాలు వెతికేందుకు ప్రయత్నిస్తూంటారామె. అలాగే వీడియోలో సినిమాలు చూడటం కూడా ఆమెకెంతో ఇష్టం.

అల్లరి పాటలతో శ్రోతల గుండె గదుల్లో అలజడి రేపిన ఎల్.ఆర్.ఈశ్వరిని కొందరు ప్రముఖులు అల్లరి పేర్లతో ప్రశంసించారు. డాక్టర్ సి.నారాయణరెడ్డి ఎల్.ఆర్.ఈశ్వరిలో 'ఎల్' అంటే 'లవ్', 'ఆర్' అంటే రొమాన్స్‌గా చమత్కరిస్తే, ఆరుద్ర 'అల్లారుముద్దుల గాయని'గా, దర్శకరత్న డా. దాసరి 'పంచభాషా ప్రవీణ'గా అభివర్ణించారు. 'విజయలలిత కళ్ళల్లో కైపుంటే ఎల్.ఆర్.ఈశ్వరి గొంతులో కైపుంటుంది' అని ప్రముఖ దర్శకులు కె.ఎస్.ప్రకాశరావుగారు అప్పుడప్పుడు సరదాగా అనేవారు.

పాట పాడేటప్పుడు ఆ పాటకనుగుణంగా డాన్స్ చేస్తూ పాడటం ఈశ్వరికున్న అలవాటు.

ప్రముఖ సంగీత దర్శకులు సత్యం తెలుగులో ఈశ్వరిని బాగా ప్రోత్సహించారు. ఆమె కోసం చక్కని బాణీలు రూపొందించి, ఎన్నో హిట్ సాంగ్స్‌ని ఆమె చేత పాడించారు. 'రౌడీరాణి'లో 'ఏస్కో కోకోకోలా' లాంటి వెరైటీ క్లబ్ సాంగ్స్‌ని ఆయన ఈశ్వరితో పాడించారు.

1984లో అప్పటి తమిళనాడు ముఖ్యమంత్రి ఎం.జి.రామచంద్రన్ చేతుల మీదుగా 'కలైమామణి' అవార్డునందుకున్నారు.

ఇండస్ట్రీలోని రాజకీయాల కారణంగానే తను పరిశ్రమకు దూరమయ్యానని చెబుతారామె. తమిళ సినిమాల్లో అడపాతడపా పాడుతూ స్టేజ్ ప్రోగ్రామ్స్‌లో చాలా బిజీగా వున్న ఎల్.ఆర్.ఈశ్వరి పాడిన భక్తిగీతాలు ప్రైవేట్ సాంగ్స్‌గా వచ్చాయి. ఆ మధ్య తెలుగులో 'గ్రామదేవత'లు అనే ఆల్బమ్ కూడా విడుదలైంది.

తన సోదరి, సోదరుడి భవిష్యత్తు కోసం ఆమె అవివాహితగా మిగిలిపోయారు. పెళ్ళి గురించి ఎవరైనా ప్రస్తావిస్తే తాను సంగీతాన్నే వివాహం చేసుకున్నానని చిలిపి సమాధానమిచ్చి దాటవేస్తారు.

యాభై ఏళ్ళు పైబడినా పర్సనాలిటీలో గానీ, గొంతులోగాని ఏ మాత్రం మార్పు కనబడక పోవడం ఈశ్వరి స్పెషాల్టీ.

తెలుగులో ఆమె ఇటీవలే 'చూసొద్దాం రండి' చిత్రంలో ఓ పాట పాడారు.

- శ్రీవిక్రమ్

డిసెంబరు 8
ఎల్.ఆర్.ఈశ్వరి
జన్మదిన సందర్భంగా
సంగీత ప్రియులందరి తరపున
శుభాకాంక్షలతో...

హాసం











